సాధన గ్రంథ మండలి. 52.

# భక్తిరసాయనము

శ్రీ మధుసూదన సరస్వతీ ప్రణీత

సంస్కృత కృతికి ఆంధ్రవివృతి




ఆంధ్ర వివృతి కారుడు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ఎం. ఏ., ఎం. లిట్., పిహెచ్. డి.,

(సాగర విశ్వవిద్యాలయము)





ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి

# సంపాదకీయము

పాఠక మహాశయులారా!

ఈ భక్తిరసాయన మను గ్రంథముతో మండలికి నేడవ వత్సర ప్రారంభమయినది. ఇంతవరకు మండలి యెట్టి కృషి చేసినదియు మీకువిదితమే. మండలికి మూలధనము లేక పోవుట, కావలసిన పోషకవర్గము లేకపోవుట, ఉన్న పోషక వర్గము వారివలన రావలసినది రాకపోవుట, యీ కారణములచే నేటికి రెండువేల రూప్యములకు పైగా ఋణమైనది. ఐనను తనధర్మము తా నిర్వర్తించు చున్నది.

ఇట్టి సంస్థల పురోభివృద్ధికి వచ్చునటుల తోడ్పడ గల సమర్థులు, ఆసక్తులు బహుముఖముల దేశమున కలరు. వారి అందరి తోడ్పాటును మేము కోరుచుంటిమి. మీ సహాయము వలన మండలిలో నుత్తమ గ్రంథముల ప్రకటించి లోకమున కందివ్వ గలమని మనవి చేయుచున్నాము.

రెండు మూడు సంవత్సరములనుండి రాజపోషకులు, పోషకులు, సభ్యులు, చందాదారులు తమ పారితోషికమును మండలికి పంపలేదు. జాబులు వ్రాసినను సమాధానముగూడ లేదు. అట్టివారందరు తమతమ పారితోషికములను వెంటనే పంపి మండలిని చిరస్థాయిగా నుండునట్లు చేయగోరు చున్నాము.

ఈ విషయ మింతకు పూర్వము వెలువడిన గోవింద దామోదర స్తోత్రమను గ్రంథమున సూచించితిమి. కొలదిమంది మాత్రమె మా విన్నపమును ఆలకించిరి. వారికి మాకృతజ్ఞత.

ఇటుపైనుండి షుమారు 125 పేజీలకు తక్కువ కాకుండు గ్రంథములు వెలువరించ వలయునని మాసంకల్పము. ఇందులకు పోషక, పాఠకలోకము మిక్కిలి సహాకరింప ప్రార్థన.

మిత్రులు, పండితులు, సాగరు విశ్వవిద్యాలయమున ఉపన్యాసకులు శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు (ఎం. ఎ. ఎం. లిట్. పి. హెచ్. డి.) మా ప్రార్థన నంగీకరించి ఈ భక్తిరసాయనమును వ్రాసి యిచ్చిరి. వారికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

విజయ చైత్రము }
2-4-1953 }

వ్యవస్థాపకుడు :
బులుసు సూర్యప్రకాశశాస్త్రి

# కృతజ్ఞత

పుష్పము తనలోని సుగంధమును లోకమున వెదజల్లి, తన జన్మను సార్థక్య మొనర్చుకొనును. అట్లే సత్పురుషులు తమ ఉత్తమ ధర్మమును నిర్వర్తించుచుందురు. అట్టి సత్పురు షులలో విద్యాపోషకులు, వదాన్యశేఖరులు, అగు ఆశ్రిత పారి జాత శ్రీ ఈదర వేంకట్రావుపంతులుగారు మామండలి పురోభి వృద్ధికై చేయుచున్నసహాయమునకు మా కృతజ్ఞత. భగవం తుడు వీరికి వీరికుటుంబమునకు ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి సర్వదా సంరక్షించు గాక !

వ్యవస్థాపకుడు:
సాధన గ్రంథ మండలి.

# శ్రీ శివ పంచాక్షర స్తోత్రము

## [ శ్రీ శంకరాచార్య విరచితము ]

నాగేంద్రహారాయ సులోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై న కారాయ నమశ్శివాయ.

మందాకినీ సలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ
మందారపుష్ప బహు పుష్ప సుపూజితాయ
తస్మై మ కారాయ నమశ్శివాయ.

శివాయ గౌరీవదనాబ్జబృంద
సూర్యాయ దక్షాధ్వరనాశకాయ
శ్రీ నీలకంఠాయ వృష ధ్వజాయ
తస్మై శి కారాయ నమశ్శివాయ.

వశిష్ఠ కుంభోద్భవ గౌతమార్య
మునీంద్ర దేవార్చిత శేఖరాయ
చంద్రార్క వైశ్వానర లోచనాయ
తస్మై వ కారాయ నమశ్శివాయ.

యక్షస్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ
దివ్యాయ దేవాయ దిగంబరాయ
తస్మై య కారాయ నమశ్శివాయ.

పంచాక్షర మిదం పుణ్యం యః పఠేచ్ఛివ సన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే.

# ప్రస్తావన

## శ్రీమాత్రే నమః

**జ్యోతిర్మయీం ప్రసూనాక్షీ మానందలహరీం పరామ్,**
**ఉపాస్మహే శివాం దేవీం లలితాలినయాత్మికామ్.**

యం శ్రుత్వా వికస త్యశేషవిషయై ర్హృత్పద్మ మార్ద్రాయతే
యం మత్వా నిరతం చ గచ్ఛతి ముదా చిన్మాత్రతాం మానసమ్,
యం ధ్యాయ న్నచిరేణ వేత్తి సకలాం స్వాత్మార్థభావన్మనః
తం భక్త్యా ప్రణమామి పూతచరితం దివ్యాంశయా సంశ్రితమ్.

1. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనునవి పురుషార్థము లని వ్యవహరించ బడుచున్నవి. జన్మ ముఖ్య ఫల సమర్పకమై కామము, దృష్టోపాయ సమర్పకమై అర్థము గలవు. సాంఘికచైతన్యమున నభివ్యక్తమై సాంఘికవ్యక్తిగా మానవుని పరిణమింపజేయు ధర్మము ప్రచోదనాత్మకము. దృష్టఫలము నాశ్రయించని ధర్మమునకు అపూర్వఫలమును చెప్పవలెను. మానవుడు కేవలము సాంఘికవ్యక్తియే కాడు. సంఘమున నంతర్భూతుడైన మానవుడు, సంఘమును సహితము తనలో నంతర్భూతము చేసికొనవలసి యున్నది. అనగా సంఘమును గూర్చిన ఆత్మవద్భావన యున్ననే సాంఘికచైతన్యము నిర్దేశించులక్ష్యము లవగతములు కాగలవు. ఈ యవగతిలో నాత్మస్వభావ మగు స్వాతంత్ర్య మనుభూత మగును. స్వాతంత్ర్య మనగా కర్మబంధమునుండి విముక్తిని పొందు

ఐయే. దీనినే మోక్షమను నాల్గవ పురుషార్థముగా పూర్వులు స్వీకరించిరి. ప్రతివ్యక్తియు తన నిజస్వభావమగు స్వాతంత్ర్యమును, శాశ్వతమగు నానందమును అనుభవించుటయే మోక్షము. ఇట్టి మోక్షము పారలౌకికమని చెప్పుటలో మానవుడు దేశకాల ద్రవ్యాదుల వశము కారాదని భావము. సాంఘిక చైతన్య విధ్వస్తమగు వ్యక్తికి వ్యక్తిత్వమే లేక పోవుటచే నీమోక్షము కేవలము వ్యక్తిగతము, వ్యక్తినిష్ఠము కాజాలదు. అనగా మోక్షముసాంఘిక చైతన్యమును తనయందు తన స్వభావమును సంఘమున అభిన్నముగా ననుభవింప గల్గుటయే మోక్షశబ్దార్థము. ఈ యర్థావగతికి ధర్మాచరణ మవసరము. కాని ఇతరులు ప్రపంచించు ధర్మమును నే నాచరించవలసినచో తత్ఫలమునకు నేను బాధ్యుడను కాజాలను. బాధ్యత నాకు లేనపుడు నేజేసిన కర్మలఫలితము నన్ను బంధింప గూడదు. అనగా ధర్మము నాకంటె భిన్నమైన బాహ్యాధికారముచే విధింపబడునది కాజాలదు. కావున నిర్లిప్తము, నిర్వికారము, అతీంద్రియము, అనుపహితము నగు నాధ్యాత్మతత్త్వము నాశ్రయించుకొని వచ్చునదియే ధర్మము కాగలదు. పరోపకారమును నే జేయవలె ననిన పరుడు పరుడు కాడని స్పష్టము. దీనినే సర్వభూతములయందు నాత్మవద్భావన యనినారు. ఈ యాత్మవద్భావన అతిశయితము కాగా కలుగు మానసిక పరిణామమున నుదయించు ప్రతీతిని భక్తి యందురు. భక్తి యనగా నిరుపాధిక మగు తత్త్వమును దేశకాలాదివశవర్తి యగు జగమున నంతర్లీన

ముగా భాసించునది. అనగా దేశకాలాద్యుపాధులలో నభి
వ్యక్తమగునది తత్త్వము. ఇందుచే దేశకాలాద్యుపాధు లగు
ప్రాణులను, ఈ ప్రాణుల ఆదర్శము లగు సత్య ధర్మ సౌంద
ర్యములను చక్కగా తెలిసికొనవలసి యున్నది. ఏతదవగాహ
నకై శ్రద్ధ సునిశిత మగు భావన, తితిక్షాపరిశీలనాశక్తి మొద
లగునవి కావలెను. వీటితోపాటు నిత్యానిత్య వస్తువివేకము,
ఐహికాముష్మిక ఫల భోగ విరాగము, శమ దమాది సాధన
సంపద చేకూరగా పరోపకారబుద్ధి ప్రాప్తమగు భక్తిభావ
ముదయించును. కావుననే భక్తులను సేవించుట, ప్రాణుల
నందరను ఆత్మవద్భావనతో గాంచుట, భగవద్ధ్యానానుష్ఠానము,
నిష్కామపూర్వకమగు ప్రేమ మొదలగునవి యున్నియు భక్తి
భావనలో గలవని చెప్పబడుచున్నవి. ఇట్టి భక్తిభావమునకు
లోబడియున్న ధర్మార్థకామములే పురుషార్థములు కాగలవు.

2. సర్వభూతములను తనవలెను, తనను సర్వభూత
ముల వలెను భావించుట ధర్మాచరణమున కత్యవసరము. ఇట్టి
యాచరణమే భక్తిలోగల విశిష్టత యగుటచే జ్ఞానమార్గము
నకు, భక్తిమార్గమునకు పరస్పర విరోధము లేదని, ధర్మాచరణా
రూపమగు భక్తియోగము సర్వజనసామాన్యమగు సాధనమే
గాక సాధ్యముగూడ నగుచున్నదని విశదమగును. సాధ్యరూప
మున నున్న ధర్మమనబడు భక్తిని ఆత్మావగతి యనియు, బ్రహ్మా
త్మైకత్వానుభూతి యనియు, మోక్షమనియు, పునర్జన్మరాహిత్యమని
వ్యవహరించెదరు. కనుకనే అర్థకామములు ధర్మసంవలితములై
యుండవలెను. ఈ విషయమునే సూచించుచు "సత్యంవద,

ధర్మం చర ” అని తైత్తిరీయోపనిషత్ పలికినది. సత్యము కేవలము వాక్యధర్మము గాదని ఉపనిషత్తు లనుచున్నవి. “సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ” యనుచో సత్యమనగా తత్త్వమగు బ్రహ్మయని అర్థము. ధర్మాచరణ మాత్మసాక్షాత్కారము నుద్దేశించి జరుగుచేయుచు, ఆత్మాశ్రయమై ఉత్పన్నమగు ప్రవృత్తియగుటచే “ఆత్మా వా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః ఆత్మా వా అరే ద్రష్టవ్యః ” అని ఆత్మదర్శన ప్రధానమని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి.

౩. విశిష్ట నిత్యకర్మానుష్ఠానముద్వారా కేవల మంతఃకరణ శుద్ధము కాగా ఆత్మాభిన్నముగా జగమంతయు భాసించగలదు. ఇట్టి స్థితియందు కలుగు చిత్తద్రవీకరణమున చిత్తము నిరుపహితము కాగా, తాత్త్వికమగు విషయాకారమును చిత్తము పొందును. తాత్త్వికమగు విషయము చైతన్యస్వరూపమగు బ్రహ్మయగుటచే చిత్తమునకు చైతన్యాకారత కలుగునని భావము. శ్రవణ, మనన, నిదిధ్యాసనాదులద్వారా కలుగు నీ చైతన్యాకారమున నలౌకిక మగు ప్రేమ యంకురించును. ఈ ప్రేమనే —

“విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః”

అని శ్రీ భగవద్గీత నివరించినది. సర్వ విషయముల యందు సమత్వబుద్ధి యనబడు ప్రేమ కలుగగా వర్ణాశ్రమ వయోఽవస్థాది ధర్మము లాత్మపై నారోపింపబడినవని తెలియ

బడ గలదు అప్పుడు జన్మించు స్థితిని వైరాగ్యమని యందురు. వైరాగ్యము స్థితప్రజ్ఞుని స్వభావము. జ్ఞానానుస్యూతమైనభక్తి యోగమీ వైరాగ్యము నుత్పన్నము చేయును. వైరాగ్యమున సాంఘిక చైతన్యము, సాంఘికధర్మములు తిరస్కృతములు కాజా లవు. సాంఘిక చైతన్య మీ వైరాగ్యమున పరిపుష్ట మగును.

4. ఏతద్భక్తియోగమును సమగ్రముగా వివరించగోరి విపశ్చిదగ్రేసరుడు పరివ్రాజకాచార్యుడు నగు శ్రీ మధుసూదన సరస్వతి శ్రీ భగవద్భక్తిరసాయన మను గ్రంథము రచించెను. భక్తిసామాన్యస్వరూపము, భక్తివిశేషస్వరూపము అను విషయములను మొదటి రెండు ఉల్లాసములలో ప్రపంచించి, భక్తిరసమును మూడవ యుల్లాసమున ప్రతిపాదించినాడు. రసశబ్దము నాలంకారికులు శృంగారాది రసముల పరముగా వ్యవహరించిరి. కాని ఉపనిషత్తులలో చెప్పబడిన "రసో వై సః" ఇత్యాది వాక్యముల నాలంకారికులు స్పృశించరైరి. అద్వితీయ మగు బ్రహ్మను రసముగా నిర్వచించవచ్చునా? రసప్రతీతిని బ్రహ్మావగతిగా స్వీకరించ వచ్చునా? యను ప్రశ్నల నక్కడక్కడ కొంద రాలంకారికులు చర్చించినమాట వాస్తవమే. భట్టనాయకుడు రసాస్వాదమును బ్రహ్మాస్వాదసవిధవర్తి యని, బ్రహ్మాస్వాదసహోదర మని ప్రపంచించెను. ఈ భావమును పూర్తిగా విమర్శించక తర్వాతి అలంకారికు లందరు దీనినే ప్రపంచించసాగిరి. దీనిని పూర్తిగా విమర్శించి బ్రహ్మాస్వాదమే రసాస్వాద మని, బ్రహ్మ యనగా

భగ్నమైన ఆవరణ గల చిదాత్మయే యనియు, రస మనగా నిట్టి ఆత్మయే యని సిద్ధాంతించిన అలంకారసార్వభౌముడు జగన్నాథుడు. కాని జగన్నాథునకు పూర్వమే ఈ సిద్ధాంతము శ్రీ మధుసూదనసరస్వతిచే ప్రపంచింపబడినది. శబ్దజ్ఞాన మగు రసమున కపరోక్షత్వమును గూడ మధుసూదనుడే సాధించెను. ఇట్టి రసప్రతీతి నుద్దేశించియే ఉపనిషత్తులు బ్రహ్మానందముగా గూడ ప్రపంచించినవి.

5. అలంకారశాస్త్రము నాయా దర్శనములలోని వని సమన్వయించిన వారనేకులు గలరు. పూర్వమీమాంసకు జెందిన దీ శాస్త్రమని లొల్లటుడు, న్యాయదర్శనములోని దిదియని శంకుకుడు, అద్వైత వేదాంతములోని దిదియని భట్టనాయకుడు, కాశ్మీర శైవాద్వైత దర్శనముననే అలంకారశాస్త్రము సమన్విత మగునని అభినవగుప్తుడు, సాంఖ్యదర్శనమునకు జెందిన దిదియని ధనిక ధనంజయులు వ్యాఖ్యానించిరి. అభినవుని సిద్ధాంతము ననుసరించిన అర్వాచీనులు చాలమంది గలరు. వీరిలో ననేకులకు కాశ్మీర శైవాద్వైత సమ్మతము గాదు. కాశ్మీర శివాద్వయదర్శనము నంగీకరించ జాలనివారు అభినవుని రసవాదము నంగీకరించుట హాస్యాస్పదము. భట్టనాయకునివాదమును సమగ్రముగా పోషించి అభినవుని వాదమును తందర్భానుసారము సవరించి శాస్త్రీయముగా ప్రపంచించి, అద్వైత వేదాంత దర్శనమున కనుగుణముగా నలంకారశాస్త్రమందలి రససిద్ధాంతమును వివరించినవారిలో శ్రీ మధుసూదన సరస్వతి, జగన్నాథుడు మాత్రమే కలరు. ఈవాదమే

పరమ ప్రామాణిక మని వేరుగా జెప్పనక్కరలేదు. శ్రుతి వాక్యములు, ఉపపత్తులు, తర్కము, అనుభవము అనున వన్నియు ఈవాదమునే బలపరచుచున్నవి.

నిత్యము, విషయానుభవసంవలితము, ఆనందస్వరూపము నగు ఆత్మయే రసము. ఈ రసమునే భక్తి యని, శాంత మని వ్యవహరించవచ్చును. శాంతమును మధుసూదనుడు భక్తికంటెను, రసములకంటెను విలక్షణముగా గ్రహించుట అప్రామాణిక మని, అయుక్తిక మని ఆంగ్లవివృతిలో వివరించితిమి. భక్తిలో వివిధాంశములను భాగవతమునుండి మధుసూదనుడు తొలి యుల్లాసమున వివరించుచు, భాగవత సింహావలోకనము నొక్కసారి గావించినాడు. ఆధ్యాత్మిక గ్రంథ మగు భాగవత మద్వైతసిద్ధాంతములకు విరుద్ధముగా పోవుట లేదని,భాగవతమున గల భక్తియోగము జ్ఞానానుస్యూతమని, అవగతి లేక ప్రతీతిగా కన్పించు జ్ఞానమునే భక్తి యనవలె నని ఇచ్చట సిద్ధాంతించితిమి.

6. మధుసూదనసరస్వతి వంగదేశములోని ప్రాచ్య భాగమున గల ఫరీద్‌పూర్ నగర సమీపమున రామచంద్ర భట్టాచార్య వంశమున జన్మించెను. పురందరపుత్ర తనయుడగు కమలనయనుడు నవద్వీపమున హరిరామతర్కవాగీశునివద్ద న్యాయాదిదర్శనముల నభ్యసించి, విశ్వేశ్వర సరస్వతీ యను యతీంద్రునిద్వారా సంన్యాసాశ్రమమును పొంది మధుసూదన సరస్వతీ యని వ్యవహరించబడెను. మధుసూదనుడు కాశిలో ననేకవర్షములుండి, అనేక శిష్యులకు విద్యనొసగెను. ఇతని

శిష్యులలో నొకడగు శేషగోవింద పండితుడు, సర్వవేదాంత సిద్ధాంతర హస్యమను గ్రంథమున కొక టీకను రచించె నని ఆటీకాంతమున గల—

"గురుణా మధుసూదనేన యత్
కరుణాఽఽపూరితి చేతసోపదిష్టమ్,
తదిదం ప్రకటీకృతం మయాస్మిన్
భగవ చ్ఛంకర పూజ్యపాద సూత్రే"

అని శ్లోకముద్వారా తెలియు చున్నది. శేష గోవింద పండితుడు, శేష కృష్ణ విద్వద్వరుని పుత్రుడు. జగన్నాథుని తండ్రి యగు పేరుభట్టుయొక్క విద్యాగురు లీ శ్రీ శేష కృష్ణుడు. దీనివలన జగన్నాథునితండ్రి, మధుసూదనుడు సమకాలికు లని, మధుసూదనుని గ్రంథములు జగన్నాథునకు పరిచితము లని స్పష్టము. జగన్నాథుడు శాహజహాన్ కాల మువా డగుటచే, మధుసూదనుడింతకన్న కొంచెము పూర్వమే అనగా పదునేడవ శతాబ్దమున నివసించె నని చెప్పవచ్చును. అద్వైతసిద్ధి, వేదాంతకల్పలతా, అద్వైతతత్త్వరత్నమ్, శ్రీమద్భాగవతటీకా, శ్రీ భగవద్గీతావ్యాఖ్యా గూఢార్థదీపికా, సంక్షేప శారీరక వ్యాఖ్యాసార సంగ్రహము, సిద్ధాంతబిందు, శివమహిమస్తవటీకా, హరలీలాగ్రంథటీకా, భగవద్భక్తిరసాయనమ్ మన్నగు గ్రంథములు మధుసూదనసరస్వతీ విరచితములు.

**7. సంస్కృత సాహిత్య సమీక్షావాదముల ఆధారములను, స్వభావములను, స్వరూపములను, విచారించు ఆంగ్ల**

గ్రంథమును మద్రాసు విశ్వవిద్యాలయమువారి డి. లిట్. పరీక్షకు సమర్పించి యున్నాను. 1950 లో నేను రచించిన " Studies in the Physiological and Metaphysical Presupposition of Sanskrit Literary Criticism " అను ఈ గ్రంథమును నేనే అనువదింప వలెనని సంకల్పించు సమయమున అభినవభారతీసహిత మగు నాట్యశాస్త్రమును తెనుగున అనువదింప బయలు దేరితిని. 1951 లో నీ గ్రంథమునకు ఆంధ్ర భారతి యని పేరుబెట్టి పదునే డధ్యాయములను పూర్తి గావించితిని. నా 'థిసిస్' లోని పది అధ్యాయములను ఆంధ్ర భారతిలో ఆరవ అధ్యాయ వివరణావసరమున పూర్తిగా అనువదించి యున్నాను. స్థాయిభావములకు, సంచారిభావములకు, సాత్త్వికభావములకు చెందిన మూ డధ్యాయములను భారతిలో ఖర సంవత్సరమున మాఘ ఫాల్గుణ సంచికలయందు, నందన సంవత్సరపు చైత్రసంచికయందు ప్రచురించియున్నాను. ఈ భాగములు నా ఆంధ్రభారతిలోనివి. మధుసూదనుని గ్రంథములో ఈ భావముల ప్రసక్తి పూర్తిగా గలదు గనుక పాఠకుల కా వ్యాసములతో పరిచయ మవసరము. రసస్వరూపమునకు చెందిన భాగము రెండధ్యాయములలో ఆంగ్లమున వ్రాసియుంటిని. వీటిని సంక్షేపించి మొదటి అనుబంధముగా నిచట ముద్రించుచుంటిని. శాంతరసమునకు చెందిన అధ్యాయమును మూడవ అనుబంధముగా అనువదించి ఇట ప్రచురించుచున్నాను. ఈ అనువాదము లన్నియు నా ఆంధ్రభారతిలో చేర్చియున్నాను.

భరతుని నాట్యశాస్త్రము చాల అయోమయస్థితిలో గలదు. అభినవభారతి సహితము సరిగాలేదు. వీటిని సంస్కరించి, నేటి విజ్ఞానమున కనుగుణముగా వివరించవలసిన ఆవశ్యకత గలదు. తదర్థము—

"ప్రక్షిప్తా కథ వ్యాఖ్యాతాన్ శ్లోకానేవ పఠేస్త్యజేత్
సంప్రదాయానుసారేణ వివృణోమ్యాంధ్రభారతీమ్"

అని ప్రతిజ్ఞాశ్లోకముతో నా వివృతిని ప్రారంభించి, అభినవుడు పఠించిన నాట్యశాస్త్రమును సముద్ధరించగోరి, మూలగ్రంథమును ఇరువది యారవ అధ్యాయమువరకు పరిష్కరించితిని. అభినవుని వివృతిని పూర్తిగా అనువదించుచు, అవసరమైన ప్రదేశములలో తదుపోద్బలకము లగు వివరణములను, అభినవుని వ్యాఖ్య అంగీకార్యము కానిచోట్ల నాయాక్షేప సిద్ధాంతములను సమగ్రముగా నిచ్చుచు వ్రాయుచున్నాను. నా ఆంధ్రభారతిలో ఇప్పటికి మొదటి మూడధ్యాయములు ఐదవ అధ్యాయము, ఆరవ అధ్యాయములో ఏబది పుటలు ముద్రింపబడి యున్నవి. త్వరలో ఆంధ్రభారతిని సమగ్రముగ ప్రచురింపగలను.

ప్రకృతగ్రంథము సులభముగా బోధపడుటకు, శాస్త్రవిషయము చక్కగా తెలియగలందులకు నా ఆంగ్లగ్రంథములోనివి, ఆంధ్రభారతిలో ప్రవేశపెట్టబడినవియు నగు కొన్ని భాగములను ఇచట అనుబంధరూపమున ఇచ్చితిని. ఈ విధమగు వివరణ లేనిదే భరతుడుగాని, తర్వాతి ప్రధానాలంకారికులు గాని పూర్తిగా బోధపడ జాలరు. ఈక్లిష్టపరిస్థితిని

తెలుపుటకే మరవగా హస్థితిలో నున్న భరతుని రెండవ అధ్యాయమునకు చెందిన ఆంధ్రభారతిని "నాట్యగృహము" అనుపేర నందనసంవత్సరపు శ్రావణమాస భారతిలో ప్రచురించితిని.

**8.** రెండు మూడు సంవత్సరములనుండి తమ సాధన గ్రంథమండలి కొక గ్రంథమును వ్రాసి ఈయవలసిన దని శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారు కోరుచున్నారు. ఈ ఉత్తమ గ్రంథమండలి ఆశయము ననుసరించుచు ఈమండలిని పైకి తీసికొని రాగలిగిన గ్రంథముగా మధుసూదనుని భగవద్భక్తిరసాయనము స్ఫురించగా గతసంవత్సరాదికి నావివృతి పూర్తి చేసితిని. ఈ గ్రంథముద్రణకు తోడ్పడిన సాధన గ్రంథమండలికి నా కృతజ్ఞత.

నందన, కార్తిక శుక్ల ప్రతిపత్
భానువాసరము,

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

# విషయానుక్రమణిక


పీఠిక

| | |
|---|---|
| ప్రథమోల్లాసము | ౧ |
| ద్వితీయోల్లాసము | ౬౨ |
| తృతీయోల్లాసము | ౯౭ |
| అనుబంధము ౧ | ౧౧౬ |
| ,, ౨ | ౧౭౫ |
| ,, ౩ | ౧౭౮ |




శ్రీ మాత్రే నమః

# భక్తిరసాయనము

## ప్రథమోల్లాసము

---

నవ రస మిలితం వా కేవలం వా పుమర్థం
పరమ మిహ ముకుందే భక్తియోగం వదంతి,
నిరుపమ సుఖ సంవిద్రూప మస్పృష్టదుఃఖం
త మహ మఖిలతుష్ట్యై శాస్త్రదృష్ట్యా వ్యనజ్మి. ౧

పురుషార్థ సాధనకు కర్మ, జ్ఞాన, భక్తి యోగములు శ్రీకృష్ణునిచే ప్రపంచింపబడినవి. వర్ణాశ్రమధర్మ రూపమైన కర్మయోగము ద్వారా అంతఃకరణ పరిశుద్ధమగును. అంతఃకరణ పరిశుద్ధ మగువరకు కర్మయోగమనుష్ఠేయము. తత్త్వ జ్ఞాన జనిత మగు నిర్వేదము కలుగుదాకా కర్మల నాచరించి తీరవలెను. కాని, ద్రవీభూతమైన చిత్తము గల మానవునకు భగవత్కథా శ్రవణముద్వారా భాగవతధర్మములపై నొకవిధమైన శ్రద్ధ బయలుదేరును. ఈ శ్రద్ధయే భక్తి. కాగా, అంతఃకరణను పరిశుద్ధము గావించుకొని, భగవదేకాకారమును మనస్సులో నిలపి, ఏకాగ్రతతో నాధ్యాత్మిక తత్త్వమును ధ్యానించుటయే భక్తి యని వ్యవహరింప వలెను. నిర్విణ్ణుడు, విర

క్తుడు, సంయతేంద్రియుడునై యోగాభ్యాస వశమున మన స్సును స్వాధీనపరచుకొని, యే మానవుడు ప్రవర్తించునో, అట్టి వానికే జ్ఞాన, భక్తి యోగములు సులభ సాధ్యములు కాగలవు. భక్తియోగ ప్రతీతిలేనిచో మనస్సునకు సమ్యక్ప్రసాదము కలుగనేరదు. అనగా జ్ఞాన యోగసంబంధము లేని భక్తి యోగము ప్రయోజనవంతము కాజాలదు. జ్ఞానయోగాంతర్గత మగు సాధనముగా భక్తిని గ్రహింపవలెను. ఇట్టి భక్తితో సకలవిషయములపై వైముఖ్యము నవలంబించి, భగవత్స్వరూప స్వభావముల నాకర్ణింపగా చిత్తప్రుతి కలుగును. అప్పుడు భగవదాకారమగు మనోవృత్తి బయలుదేర గలదు. ఈ మనోవృత్తి, విభావ అనుభావ, సంచారి భావములతో సంయోజితమై, భక్తిరసమును ప్రతీతియోగ్యముగా చేయ గల్గుచున్నది.

ఆలంబనవిభావ మని, ఉద్దీపనవిభావ మని విభావములు రెండు రకములు. భక్తిరసమున కాలంబనవిభావము భగవంతుడు. తులసీ చందనాదులు భక్తిని ఉద్దీపింప జేయునవి. ఇచ్చట నేత్రవిక్రియాదు లనుభావములు. నిర్వేదాదులు సంచారిభావములు. భగవదాకారతారూప మైన మనోవృత్తి యగుస్థాయిభావమును పోషించునవి ఈ విభానుభావ సంచారి భావములు. అప్పుడు ప్రాదుర్భవించు పరమానంద సాక్షాత్కారాత్మకమగు భక్తియోగమును నిరతిశయమగు పురుషార్థ మని రసజ్ఞులు చెప్పుచున్నారు.

దుఃఖాసంభిన్న మగు సుఖమే పరమ పురుషార్థ మని దర్శనములన్నియు చెప్పుచున్నవి. ధర్మార్థ కామ మోక్షములను నాలుగు పురుషార్థములును సుఖమను పరమపురుషార్థమునకు సాధనములు. దుఃఖ స్పర్శ ఏమాత్రము లేని సుఖము నలౌకిక మని, లోకోత్తర మని, ఆధ్యాత్మిక మని వ్యవహరించవలెను. కావుననే ధ్యానశ్లోకమున "నిరుపమ సుఖసంవిద్రూప మస్పృష్ట దుఃఖం" అని మధుసూదను డనినాడు. అలౌకికము, నిరుపమము నగు సుఖమే సంవిద్రూపము. సంవిత్ అనగా చైతన్యము. చైతన్య మాత్మతత్త్వము. ఇందు దుఃఖస్పర్శ లేదు. కాగా ధర్మార్థకామములు స్వతఃపురుషార్థములు కావని, తజ్జన్యమగు సుఖమే పరమపురుషార్థమని, ఈవిధమగు సుఖమే భక్తిసుఖమున గలదని, భక్తిసుఖమే స్వతంత్రపురుషార్థ మని తేలుచున్నది. భక్తిసుఖ ప్రతీతి గలవానికి సంసారమునుండి విముక్తి గలుగుటచే భక్తిసుఖమే మోక్షసుఖ మనవలెను.

శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంతము లనబడునవి తొమ్మిది రసములు. ఈ నవరసములతో మిలితమైన భక్తియోగమున ప్రతీయమానమగు విషయము భగవంతుడనబడు ఆధ్యాత్మికతత్త్వము. ఏవంవిధమగు తత్త్వము దుఃఖాసంభిన్నమగు అలౌకిక సుఖసంవిద్రూపము. ఈ సంవిద్రూపమును శాస్త్రదృష్ట్యా మధుసూదనుడు వివరించనున్నాడు. ఈ సంవిద్రూపము శాస్త్రములచే ప్రతిపాదింపబడిన సిద్ధస్వరూపము. సర్వజనానందహేతుకము. ♦ (♦ మొదటి అనుబంధమును చూడుడు.)

"భజన మంతఃకరణస్య భగవదాకారతారూపం భక్తిః" అని భక్తిశబ్దమునకు భావవ్యుత్పత్తిని చెప్పినచో నిరుపమసుఖ సంవిద్రూప మనబడు ఫలము భక్తియోగమున ప్రధానముగా కన్పించగలదు. "భజ్యతే సేవ్యతే భగవదాకార మంతఃకరణం క్రియతేఽనయా" అని కరణవ్యుత్పత్తిని చెప్పినచో శ్రవణ కీర్తనాది సాధనములు భక్తిశబ్దార్థములు కాగలవు. సాధనరూపమైన భక్తి వేరు, ఫలరూపమైన భక్తి వేరు అని చెప్పరాదు. ఒకేఒక భక్తి సాధనముగాను, ఫలముగాను ప్రతీయమానమగుచున్నది. ద్రవీభూతమైన మనస్సున భగవదాకారతాకముగా కన్పించు సవికల్పక మనోవృత్తిని భక్తి యందురు. ఈ భగవద్భక్తినే బ్రహ్మవిద్యగా పరిగణించరాదు. భగవద్గుణాది శ్రవణమును సాధనగాగలిగి, భగవద్విషయక ప్రేమప్రకర్షమే ఫలముగా గలిగిన భక్తియోగమున కందరు ప్రాణులు నధికారులే యగుచున్నారు.

సంసారరాగేణ బలీయసా చిరం
నిపీడితై స్తత్ప్రశమేఽతి శిక్షితమ్
ఇదం భవద్భి ర్బహుధా వ్యయాతిగం
నిపీయతాం భక్తిరసాయనం బుధాః. ౨

పురాకృత కర్మవశమున రాగద్వేషాది వశంగతమగు సంసారచక్రము చిరకాలమునుండి మానవులను పీడించుచున్నది. ఈ సంసారచక్రము ప్రశమితమైననే దుఃఖబాధతొలగి పోగలదు. ఈ ప్రయోజనమును గుర్తించిన వివేకులీ భక్తిరసా

యనము నాస్వాదించి కర్మబంధములను దాటగలరని యెంచి, మధుసూదనుడు భక్తిరసాయనమును వివరించబోవుచున్నాడు.

ద్రుతస్య భగవద్ధర్మా ద్ధారావాహికతాంగతా
సర్వేశే మనసో వృత్తి ర్భక్తి రి త్యభిధీయతే. 3

భగవద్విషయకమగు భక్తి యొకరసమని, శ్రేష్ఠతమమగు పురుషార్థమని చెప్పితిమి. భక్తియొక్క సామాన్యలక్షణము నిట చెప్పి, ఆపై దీనిని వివరింతుము.

భగవద్గుణ శ్రవణముద్వారా కామక్రోధాదు లుద్దీపితములు కాగా చిత్తము ద్రవీభూతమగును. అపుడు సర్వేశ విషయకమై, భగవదాకారతతో గల ధారావాహికమగు చిత్తవృత్తి బయలుదేరును. ఈ చిత్తవృత్తిని భక్తియని శాస్త్రజ్ఞులు వివరించి యున్నారు. ధారావాహిక మనగా అవిచ్ఛిన్న మని అర్థము. అంతరాయములు లేక, అవిచ్ఛిన్నముగా, సర్వదా అనుభూయమగుచున్న చిత్తవృత్తి భగవదాకారతాకమైనచో భక్తియని పిలుసబడును.

చిత్తద్రవ్యం హి జతువత్ స్వభావాత్ కఠినాత్మకమ్
తాపకై ర్విషయై ర్యోగే ద్రవత్వం ప్రతిపద్యతే. 4

చిత్తము ద్రవీభూతము కావలెనని యంటిమి. చిత్తము స్వాభావికముగా ద్రవావస్థలో ఉండదు. చిత్తము లక్కవంటిది. లక్క స్వభావసిద్ధముగా కఠినమైన ఘనపదార్థము. కాని నిప్పుసెగకు మాత్రమే లక్క కరగిపోగలదు. ఇట్లే కఠినమైన చిత్తమును నిప్పువంటి విషయములే

కరుగ చేయ గలవు. మున్ముందు చెప్పబోవు కామాది విషయ ములను తాపకవస్తువులతో సంయోగము పొందిననే చిత్తము నకు ద్రవీభావము రాగలదు.

కామ క్రోధ భయ స్నేహ హర్ష శోకాదయాఽఽదయః
తాపకా శ్చిత్తజతున స్తచ్ఛాంతౌ కఠినం తు తత్. ౫

చిత్తమను లక్కవంటి పదార్థమును కరిగింపజాలిన తాపకవస్తువులను కామము, క్రోధము, భయము, స్నేహము, హర్షము, శోకము అని యందురు. కామక్రోధాదు లుద్దీపిత ములు కాగా చిత్తద్రవీభావము బయలుదేరును. కామాది తిరోభావమున మరల చిత్తకాఠిన్యము చేకూరునని భావము.

ద్రుతేచిత్తే వినిక్షిప్తః స్వాకారో యస్తు వస్తునా
సంస్కార వాసనా భావ భావనా శబ్దభాగసౌ. ౬

చిత్తము ద్రవీభావమునందు ననగా విషయముతో నత్యంత సన్నిహిత సంబంధము కలిగియుండునని, ఈయనన్య త్వమున నిమగ్నాకారకమగు చిత్తవృత్తి బయలుదేరునని, వస్తువుయొక్క ఆకారమును చిత్తవృత్తి పొందునని భావము. ఒక్కొక్క అనుభూతి కొన్ని సంస్కారములను వాసనారూప మున మనచిత్తమున వదలును. ఈ సంస్కారములను వాసనా రూపమున భావించవీలున్నది. పూర్వానుభూతులు తర్వాతి యనుభూతులలో వాసనారూపమున భాసించుచున్నవి. వస్తువు యొక్క ఆకారమును ద్రుతచిత్తమున వాసనావశమైన భావన

ద్వారా గ్రహించుటచే వస్తువు ప్రతీతిగ్రాహ్య మగు
చున్నది.

శిథిలీభావమాత్రం తు మనో గచ్ఛ త్యతాపకైః
న తత్ర వస్తు విశతి వాసనాత్వేన కిఞ్చన. ౭

తాపకద్రవ్యములగు కామక్రోధాదులతో ఈషన్మాత్ర సంయోగము మనస్సునకు కలుగగా, మనస్సులో కించి దవయవ విశరణమే కలుగును. ఇట్లు శిథిలీభూతమైన మనస్సులోనికి వాసనారూపమున వస్తువు ప్రవేశించదు. కాని తద్విలక్షణముగా, తదాభాసపూర్వకముగానే వస్తువు మనస్సులో ప్రవేశించగలదు. వస్తువును చూడగానే చిత్తమున నొక విధమైన విక్షేపము కలుగును. అప్పుడు పూర్వానుభూతులద్వారా కలిగిన వాసనలలో కలయిక కలుగును. ఈ సంచలనమున వస్తుస్వరూపావగాహియగు చిత్తవృత్తి బయలుదేరును. కాగా చిత్తద్రుతియందు వాసనారూప సంస్కారము బయలుదేరునని, చిత్తశిథిలీభావమున వాసనాభాస బయలుదేరునని చెప్పవలెను.

ద్రవతాయాం ప్రవిష్టం స ద్యత్కాఠిన్యదశాం గతమ్
చేతః పున స్తృతో సత్త్వా మపి త న్నైవ ముఞ్చతి. ౮

కరిగించగా కాఠిన్యమును గోల్పోయిన లక్కకు కాష్ఠాదిసంయోగము కలుగగా కాష్ఠాదులకు లక్కవంటి రంగు సంప్రాప్తించు చున్నది. ఇట్లు ద్రవీభూతముగాక, శైథిల్యావస్థలో నున్న లక్క ఈ రీతిగా ప్రవర్తించజాలదు. ఇదే విధ

ముగా ద్రవీభూతమైన చిత్తమునకు విషయసంయోగము కలుగగా విషయమునకు చిత్తమునకు అనన్యత్వ సంబంధము కలుగుచున్నది. చిత్తమున వస్తుస్వరూపము కన్పించును. ఆపై కాఠిన్యదశలోనికి చిత్తము పోయినను, విషయాంతర ప్రత్యక్షమున చిత్తము మరల ద్రవావస్థలోనికి వచ్చుచు ప్రకాశించుచున్నది. వెనుక ద్రవావస్థలో కలిగిన విషయాకారత ఇప్పటి ద్రవావస్థలో నశించుటలేదు. ఇట్లు నశించకపోవుటయే వాసన యని పిలువబడుచున్నది. చిత్తము శైథిల్యావస్థలో నున్నచో నీ విధమైన వాసన బయలుదేరక, తదాభాసయే కన్పించుచున్నది. ద్రుతచిత్తమునకే ప్రకాశమానత గలదు. ఆధ్యాత్మిక తత్త్వమునే విషయముగా గలిగిన ద్రుతచిత్తమున ఆధ్యాత్మికతత్త్వాకారముగల చిత్తవృత్తి యుండుననని, ఇది సర్వదా ప్రకాశమానమగుననని, అట్టి వ్యక్తియే కృతకృత్యు డగునని చెప్పవలెను. ఒకసారి రగుల్కొలుపబడిన వాసన యనబడు సంస్కారము నశింపజాలక పోవుటచే నీ సదా ప్రకాశమానత్వము వచ్చుచున్నదని భావము. ఈ సంస్కారమును మాటుపడకుండ జేసిన, అనగా చిత్తమును సదా ద్రవావస్థలో నుంచిన, సకల విషయములును ఈ భగవదాకారతాకమగు చిత్తవృత్తిచే భాసింపబడగలవు. కావుననే సర్వభూతములయందు భగవద్భావమే యోగులకు ప్రతీత మగుచున్నది. ఏతాదృశ చిత్త సంస్కారము నశించదు. ఇట్టి సంపూర్ణ చిత్తద్రవావస్థగల వ్యక్తి ఉత్తముడు. ఈషద్ద్రావావస్థ గలవానికి వాసనాభాసయే యుండుటచే నతడు మధ్యము డనబడును. ద్రవావస్థ యే

మాత్రములేక తదర్థ మెవఁడు శ్రద్ధతో భాగవతధర్మముల ననుష్ఠించునో అతఁడు ప్రాకృతుడని పిలువబడును.

ప్రణయము, అనురాగము, స్నేహము మొదలగు శబ్దము లీ ద్రవావస్థను వివరించునవి. ఈ శబ్దములచే సూచింపబడు ద్రవావస్థ నందిన వ్యక్తికి ఇచటనుండి పునర్నిర్గమనము లేదు. ద్రవావస్థలో ముత్తెరగుల ప్రతీతి కలదు. ప్రపంచ సత్యత్వ భాన సహితముగా నాధ్యాత్మిక తత్త్వము ప్రతీయమాన మగుట ప్రాకృత ద్రవావస్థా లక్షణము. ప్రపంచ మిథ్యాత్వ భాన సహితముగా కలుగు తత్త్వావగతి మధ్యమ ద్రవావస్థా లక్షణము. ప్రపంచ సత్యత్వము గాని, ప్రపంచ మిథ్యాత్వము గాని భాసించకుండా కేవలము తత్త్వమే ప్రతీత మగుట ఉత్తమ ద్రవావస్థా లక్షణము.

స్థాయిభావగిరాఽతోఽసౌ వస్త్వాకారోఽభిధీయతే
వ్యక్తశ్చ రసతా మేతి పరానందతయా పునః. ౯

ద్రవావస్థలో నున్న చిత్తమున ప్రవేశించిన విషయాకారము స్థిరముగా నుండున దగుటచే స్థాయి యనబడు చున్నది. విభావములు, అనుభావములు, సంచారిభావములు అను వాటిచే పరిపుష్టమై రసముగా నభివ్యక్త మగునది స్థాయిభావము. పరమానంద సాక్షాత్కార రూపమున నీ స్థాయిభావము రసత్వము నందును.

భగవాన్ పరమానందస్వరూపః స్వయ మేవ హి
మనోగత స్తదాకార రసతా మేతి పుష్కలమ్. ౧౦

ముఖము నద్దములో చూచుకొను చున్నాము. అద్ద మను ఉపాధిలో కన్పించు ముఖబింబమును ప్రతిబింబ మం దుము. ఇట్లే మనస్సు అనబడు ఉపాధినిష్ఠమై ప్రతిబింబిత మైనది పరమానంద స్వరూపమగు భగవంతుడు. ప్రతిబింబిత మైన పరమానంద స్వరూపము స్థాయి భావమై రసముగా పరిణమించును. ఇట్లు సిద్ధమగు భక్తిరసమునకు పరమానంద రూపత్వమునే చెప్పవలెను. కావున బింబమువలెనున్న భగ వంతు డాలంబన విభావమని, ప్రతిబింబమువలె నున్న భగవం తుడు స్థాయిభావ మని నిశ్చిత మగుచున్నది.

కాంతాఽఽదివిషయేఽప్యస్తి కారణం సుఖచిద్ఘనమ్
కార్యాకారతయా భేదేఽప్యావృతం మాయయా స్వతః.

భక్తిరసమునకు పరమానంద రూప మను అలౌకిక చిత్తవృత్తిని స్థాయి భావముగా గ్రహించి, పరమానంద రూపత్వము నాపాదించితిమి. బింబ మాలంబన విభావమని, ప్రతిబింబము స్థాయియని ప్రతిపాదించితిమి. కాని శృంగారాది రసములలో నాలంబన విభావము వేరుగను, స్థాయి భావము వేరుగను కన్పించుట గలదు. శృంగార రసమున నాయికా నాయకు లొకరి కొకరు ఆలంబనవిభావ మగుచుం డగా, స్థాయిభావము రతి యగు చున్నది. ఈ స్థాయిభావ మాలంబన విభావము యొక్క ప్రతిబింబము కాదు. అట్టిచో భక్తిరసమున నీ వైచిత్ర్య మేల కన్పించ గలదను నా శంకకిచట ప్రత్యుత్తరము చెప్పబడు చున్నది.

"ఆనందమునుండి భూతములన్నియు జన్మించుచున్నవి, ఆనందమువలన జీవించు చున్నవి, మరల నివి ఆనందములో లీనమగు చున్నవి" అని తైత్తిరీయోపనిషదాది వాక్యముల ద్వారా పరమానందరూప మగు బ్రహ్మయే జగదుపాదాన కారణమని ప్రతిపాదింపబడినది. ఈ సిద్ధాంతమునే "జన్మాద్యస్య యతః" అను వేదాంతసూత్రమున బాదరాయణుడు గ్రహించెను. కార్యకారణము లభిన్నస్వభావములను కలిగి యున్నవి. మట్టియొక్క స్వభావము మట్టినుండి వచ్చిన కుండలో సహితము గలదు. ఇట్లే కార్యభూతమైన జగత్తు కారణ భూతమైన బ్రహ్మకంటె భిన్నస్వభావమును కలిగి యుండ జాలదు. కార్యభూత ముపాదానకారణాభిన్న మగుటచే "ఇది యంతయు బ్రహ్మయేగదా", "ఇది యంతయు ఆత్మయే" అని మొదలుగా గల ఉపనిషద్వాక్యములు కన్పించుచున్నవి. వీటిని ఆధారము చేసికొని, ఛాందోగ్యములోని ఆరవ ప్రపాఠక మును సూత్రించుచు బాదరాయణుడు "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" అని నిర్ణయించినాడు. జగత్ర్పపృత్త్వము ఉపాదానభూత మగు సగుణబ్రహ్మనుండి బయలుదేరు చున్నది. కావుననే జగత్తు అఖండానందాద్వయాకారమున భాసించుట లేదు. తాత్త్వికముగా బ్రహ్మ ఇచట భాసించకపోవుటకు మాయయొక్క ఆవరణ విక్షేప శక్తులే కారణము. ∴ కార్య భూతము కానిది కార్యముగా భాసించుటలో మాయ యొక్క విక్షేపశక్తి కన్పించుచున్నది. అఖండానందాకార

మున బ్రహ్మ మనకు భాసించక పోవుటలో ఆవరణశక్తి కన్పించుచున్నది.

ఐతే బ్రహ్మపదార్థ మెట్లు భాసించగలదు ? అను ఆశంక కిక సమాధానము నీయవలెను.

సదజ్ఞాతఙ్చ తద్బ్రహ్మ మేయం కాంతాఽఽదిమానతః
మాయావృతితిరోధానే వృత్త్యా సత్త్వస్థయా క్షణమ్. ౧౨

ప్రత్యక్షాది ప్రమాణముల ద్వారా అజ్ఞాతవస్తువు జ్ఞప్తికి తేబడుచున్నది. అజ్ఞాతజ్ఞాపకత్వమున కుపకరించనివి ప్రమాణములు కాజాలవు. స్వయంప్రకాశ్యమై భాసించు నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త చైతన్యమును మనము విస్మరించుటచే నీచైతన్య మజ్ఞాతవిషయ మగుచున్నది. జడపదార్థము చైతన్యముచే ప్రకాశింపబడున దగుటచే నావరణశక్తి చైతన్యము నే ఆవేశించినట్లు కన్పించును. ఈ యావరణశక్తియే జడపదార్థములవలెను, విషయములవలెను శుద్ధచైతన్యమును భాసింపజేయును. కాగా నాయికానాయకాది విషయములు చైతన్యము నుపహితములుగా జూపునవి. విషయాచ్ఛిన్న చైతన్యమును చైతన్యముగా గుర్తించక, విషయముగా గుర్తించుచున్నాము. మనస్సు సాత్త్వికమైనపుడు ప్రత్యక్షాది ప్రమాణ జనితమగు అపరోక్ష మనోవృత్తిద్వారా ఆవరణశక్తి నశించగా తత్తద్విషయావచ్ఛిన్నముగా చైతన్యమే భాసించగలదు. కావున పరమానందరూపమే విషయోపాదానమని, విషయమనగా చైతన్యావచ్ఛిన్నమని, విషయప్రతీతిలో

లౌకిక వ్యవహారమున చైతన్యస్వరూపము భాసించదని, మాయయొక్క ఆవరణశక్తి తిరోహితమైననే చైతన్యప్రతీతి గలదని చెప్పవలెను. అందుచే శృంగారాది రసములలో కన్పించు ఆలంబనవిభావము వస్తుతః చైతన్యావచ్ఛిన్నమని చెప్పవలెను. ఈ చైతన్యమునకు సాత్త్వికమైన మనోవృత్తికి భేదమేమియులేదు.

అత స్తదావిర్భావిత్వం మనసి ప్రతిపద్యతే
కిఞ్చిన్న్యూనాఞ్చ రసతాం యాతి జాడ్యవిమిశ్రణాత్. ౧౩

ద్రవావస్థలోనున్న మనోవృత్తియందు విషయావచ్ఛిన్న చైతన్య మావిర్భవించి భక్తిరసత్వమును పొందుచున్నది. కావుననే లౌకికరసమున పరమానందరూపత్వము స్ఫుటముగా ప్రతీత మగుటలేదు. అనవచ్ఛిన్న చిదానంద ఘనమగు బ్రహ్మ పదార్థము భక్తిరసమున ప్రతీయమాన మగుటచే నీ రసమున నలౌకికానంద మధికముగా నవగత మగుచున్నది. లౌకికము లగు శృంగారాదిరసములలో విషయావచ్ఛిన్న మగు చిదానం దాంశయే ప్రతీత మగుటచే నిచట నాలోకోత్త రానందమంత పూర్తిగా నవగత మగుటలేదు. కావున శృంగారాది రసముల కంటె భక్తిరసమే శ్రేష్ఠమని యెంచవలెను.

ఇతి వేదాంత సిద్ధాంత స్థాపినా రసతో దితా
సాఙ్ఖ్యసిద్ధాంత మాశ్రిత్యా ప్యధునా ప్రతిపద్యతే. ౧౪

ఇంతవరకు నద్వైత వేదాంత సిద్ధాంతము ననుసరించి స్థాయిభావము రసముగా నెట్లు పరిణమించుచున్నదో చెప్పి

తిమి. ఇక సాంఖ్యదర్శనము ననుసరించి రసత్వ మెట్లు సిద్ధ మగునో చెప్పనున్నాము.

తమో రజః సత్త్వ గుణా మోహ దుఃఖ సుఖాత్మకాః
తన్మయీ ప్రకృతి స్తేతుః, సర్వం కార్యఞ్చ తన్మయమ్. ౧౫

సమస్తభావములు సుఖ దుఃఖ మోహాత్మకములుగా ప్రతీయమానము లగుటచే నివి సుఖ దుఃఖ మోహాత్మక మగు సామాన్య ప్రకృతి గలవి. మృదాత్మకముగా ప్రతీయమాన మగు మట్టియొక్క సామన్యప్రకృతి, మట్టినుండి జన్మించు ఘటశరావాదుల ప్రకృతికంటె భిన్నము కాదుగదా! కారణము యొక్క స్వభావము కార్యమున సమనుగతమై భాసించును. ఇట్లే భావము లన్నియు సుఖదుఃఖ మోహజనితము లగుటచే నీభావములయొక్క స్వభావమును సుఖదుఃఖ మోహాత్మకమని చెప్పుచున్నాము. సుఖమును సత్త్వగుణ మని, దుఃఖమును రజోగుణ మని, మోహమును తమోగుణ మని యెంచవలెను. ఈ మూడు గుణములు కలసి యుండుటచే భావములకు త్రిగుణాత్మకత్వము నంగీకరించవలెను.

కార్యకారణముల కత్యంత వైలక్షణ్యము గలదని చెప్పు న్యాయ వైశేషిక దార్శనికులు కార్య కారణ సంబంధ మును నిర్వచింపలేరైరి. కారణముయొక్క పరిణామమే కార్య మని కొంతవరకు చెప్పవలెను.

త్రిగుణాత్మక మేకైకం వస్తు త్ర్యాకార మీక్ష్యతే
నిజ మానస సఙ్కల్ప భేదేన పురుషై స్త్రిభిః. ౧౬

భావము లన్నియు త్రిగుణాత్మకములని చెప్పితిమి. కాని వస్తువులు త్రిగుణాత్మకములుగా, అనగా త్ర్యాకారములుగా, భాసించుచున్నవా ? అనినచో నాంతరమగు చిత్తవృత్తికి బాహ్యమగు వస్తువునకు తాదాత్మ్యము నాపాదించలేమని గుర్తించుకొనవలెను. బాహ్యమగు వస్తువు మనస్సున ప్రతిబింబితమై ఆంతరముగా త్రిగుణాత్మకముగా ప్రతీయమాన మగుచున్నది. కాని ప్రతివస్తువు ఒకే ఒకరీతిగా భాసించజాలదు. సత్త్వరజ స్తమో గుణము లేయేనివృత్తులలో కలసిన ట్లవగత మగునో ఆనివృత్తిని అనుసరించి బయలు దేరు సంస్కారవశమున చిత్తవృత్తిభేదము, విషయభేదము వచ్చుచున్నవని భావము. ఇందుల కుదాహరణగా తర్వాతిశ్లోకము చెప్పబడుచున్నది.

కామిన్యాః సుఖతా భర్త్రా సపత్న్యా దుఃఖరూపతా
తదలాభా త్తథాఽన్యేన మోహత్వ మనుభూయతే. ౧౭

కామసుఖమును గోరిన స్త్రీకి భర్తవిషయమున సత్త్వగుణము, సవతివిషయమున రజోగుణము, తా నభిలషించుభర్త తనకు లభించకపోయిన తమోగుణము ఉద్రిక్తము లగుచున్నవి. ఈ మూడు విషయములయందు క్రమముగా సుఖము, దుఃఖము, విషాదము కలుగగలవు. చిత్తవృత్తియందలి సంస్కారభేదము ననుసరించి ఈ మూడవస్థలు వచ్చుచున్నవని భావము.

ఏవం సతి సుఖాకారః ప్రవిష్టో మానసే యదా
తదా స స్థాయిభావత్వం ప్రతిపద్య రసో భవేత్. ౧౮

రజస్తమో గుణాంశలతో సంబంధము లేనపుడు క్రోధా దులు చిత్తము నుద్రిక్తము గావించినచో కలుగు చిత్తద్రుతి యందు సుఖమయత్వమే భాసించును. చిత్తద్రవీభావము సత్త్వగుణధర్మ మగుటచే నీ సత్త్వజనిత ద్రవీభావమే స్థాయి భావ మగుచున్నది. సత్త్వగుణము సుఖరూప మగుటచే సమస్తభావములు సుఖమయము లనవలెను. కాని ప్రతిగుణ మున నితరగుణముల అంశలంగములుగా గలవు. కావున వివిధ భావములలో కలుగు సుఖప్రతీతి ఇతరగుణముల నిష్పత్తిచే నియంత్రితమై యుండును. ఇందుచే సర్వరసములయందు నొకే యొకవిధమైన సుఖానుభవము కలుగజాలదు.

పరమాణ్వేకరూపం తు చిత్తం న విషయాకృతి
ఇత్యాది మత మన్యేషా మప్రామాణ్యా దుపేక్షితమ్. ౧౯

న్యాయ దార్శనికుల కీసిద్ధాంతము సమ్మతము గాదు. నిత్యము, నిరవయవము, అణుపరిమాణమునని వీరు మనస్సును నిర్వచించుటచే చిత్తద్రవీకరణ నంగీకరింప జాలరు. ద్రవీభూతమైన చిత్తము విషయాకారముగా పరిణమించు ననినచో మనస్సును సావయవమని నిర్వచించవలెను. కాని మనస్సు నిరవయవ మగుటచే నీ ద్రవీకరణకుదురదని, తద్ద్వారా స్థాయి భావనిరూపణ చేకూరదని వీరివాదము.

కాని మనస్సు పరమాణువువంటి దని చెప్పుట కుపపత్తులు కన్పించవు. చక్షురాదీంద్రియముల వంటిదిగూడ కాజాలకపోవుటచే మనస్సునకు మధ్యమ పరిమాణత్వము నాపాదించుచున్నాము.

ప్రాభాకర మీమాంసకులు మనస్సునకు విభుత్వమును చెప్పుదురు. నిత్యత్వ, విభుత్వము లెంతమాత్రము వీరికి కుదుర జాలవు. శ్రోత్రేంద్రియమువలె నిత్యమైనది మనస్సు అని వాదించునపుడు శ్రోత్రేంద్రియమునకు కారణమగు నాకాశ మనిత్యమని, అనిత్యకారణమునుండి నిత్యమగు కార్యము జన్మించలేదని మరువరాదు. జన్యమైనది, కార్యభూత మైనది, విభుత్వముచే లక్షింపబడజాలదు. పంచ మహాభూత గ్రాహకమగు మనస్సు పాంచభౌతిక గుణముచే విశిష్టమై యుండుటచే నిరవయవముగాని, విభువుగాని కాలేదు. అపంచీ కృత పంచమహాభూతములనుండి వచ్చినది సత్త్వప్రధానము, సంకోచవికాశశీలము, స్వచ్ఛద్రవ్యమగు చక్షువువలె మూర్త ద్రవ్యము, దేహపరిమాణము గలిగినదియు నైనది మనస్సు. సుఖదుఃఖేచ్ఛా జ్ఞానములకు ఆశ్రయమగు మనస్సునకు దేహ పరిమాణమును చెప్పవలెను. మనస్సు అణువైనచో ఒకే ఒక కాలమున సర్వేంద్రియ సంబంధము సంభవించలేదు.

> గృహ్ణాతి విషయాకారం మనో విషయయోగతః
> ఇతి వేదాంతిభిః సాంఖ్యై రపి సమ్యఙ్నిరూపితమ్. ౨౦

స్వచ్ఛస్వభావము, సావయవమునగు మనస్సు అద్దము వలె విషయాకారమును గ్రహించునని సాంఖ్యదర్శనము, అద్వైత వేదాంతదర్శనము చెప్పుచున్నవి. కాని సాంఖ్యులకు మనస్సు అహంకారలక్షితము. వేదాంతమున మనస్సును భౌతికముగనే గ్రహించుచున్నాము.

మూషాసిక్తం యథా తామ్రం తన్నిభం జాయతే తథా
ఘటాది వ్యాప్నువచ్చిత్తం తన్నిభం జాయతే ధ్రువమ్.-౨౧

ద్రవీభావము చెందిన చిత్తమే విషయాకారమును భజించుననుట భాష్యకారసమ్మత మని ఇచట చెప్పబడు చున్నది. మూసలో రాగిని కరగించినచో పుటపాక యంత్ర మగు మూసయొక్క ఆకారమును రాగి పొందుచున్నది. ఇట్లే రాగద్వేషాదులచే ద్రవీభూతమైన చిత్తము చక్షురాదీంద్రియ ములద్వారా స్నిగ్ధమై తత్తద్విషయాకారమును పొందు చున్నది. ఈశ్లోకము పంచదశలోని ద్వైతవివేక ప్రకరణము లోనిది.

తైత్తిరీయోపనిష ద్భాష్యమున బ్రహ్మవల్లిలో ప్రాణ మయకోశ వివరణమున పురుషవిధత్వమునకు దృష్టాంతముగా "మూషానిషిక్త ప్రతిమావత్" అను భాష్యకార వచనము గలదు.

వ్యఞ్జకో వాయథాఽఽలోకో వ్యఙ్గ్య స్యాకారతామియాత్
సర్వార్థవ్యఞ్జకత్వా ద్ధీ రర్థాకారా ప్రదృశ్యతే. -౨౨

మూసలోని రాగిని నిప్పుచే కరిగించగా రాగి మూస యొక్క ఆకారమును పొందుచున్నదని పైన చెప్పితిమి. ఈరాగి మూర్తమగు ద్రవ్యము, అనగా రూపము గల పదార్థము. కాని చిత్తమనునది తామ్రాది విలక్షణమగు అమూర్తద్రవ్య మగుటచే విషయాకారము నెట్లు పొందగలదు ? అను ఆశంక బయలుదేర గలదు. పై ఉదాహరణలోని ఈ అస్వరసతను

గమనించి దృష్టాంతాంతరముగా పంచదశీకారు డీ శ్లోకము నిచ్చినాడు.

పరిదృశ్యమాన మగు వస్తువును విషయ మందురు. మన మొక విషయమును చూచుచున్నామనగా నిచట మనము గమనింపవలసినది కొంత గలదు. ప్రకాశము లేని దే విషయము కన్పించదు. ప్రకాశము విషయమును వ్యంజింపజేయు చున్న దనగా ప్రకాశము విషయాకారమును పొందుచున్న దని భావము. ఇట్లే చిత్తము లేక బుద్ధి సర్వవస్తువులను వ్యంజింప జేయున దగుచున్న దనిన, చిత్తము సకల పదార్థప్రకాశ మని, విషయాకారమును పొందుచు విషయములను భాసింప జేయున దని భావము.

భగవత్పూజ్యపాదానా మియ ముక్తిః సయుక్తికా
తథా వార్తికకారై ర ప్యయ మర్థో నిరూపితః. ౨౩

మనస్సు పదార్థవ్యంజకమని పదార్థాకారముగా భాసించునదని శ్రీ శంకర భగవత్పాదులు, వార్తికకారులగు శ్రీ సురేశ్వరాచార్యులు గూడ చెప్పినవాదముయుక్తియుతము, సమంజసమునని నిశ్చితమగుచున్నది. "వ్యఙ్క్తోవా" అను ఇరువది రెండవ శ్లోకమున వార్తికకారుల అభిప్రాయ మీయబడినది.

"మాతు ర్మాత్రాభి నిష్పత్తి ర్నిష్పన్నం మేయ మేతిచ
మేయాభిసఙ్గతం తచ్చ మేయాభత్వం ప్రపద్యతే"

అని వార్తికకారు లనినారు. అనుభవ మెవరికి కలుగుచున్నదో అతనిని ప్రమాత యందురు. అనుభవింపబడు విష

యమును ప్రమేయ మందురు. ఏరీతిగా, ఏ సాధనముద్వారా అనుభూతి కలుగుచున్నదో, దానిని ప్రమాణమందురు. చైతన్య స్వరూపుడగు ప్రమాతయొక్క చైతన్యోపబృంహితమగునంతః కరణమునుండి బయలుదేరు మనోవృత్తి జ్ఞానము నొసగుచున్నది. ఈ వృత్తిజ్ఞానము ద్రవీభావపూర్వకము. మనోవృత్తి నిష్పన్నమై చక్షురాదిద్వారా ఘటాది విషయపర్యంతము బయటకుపోయి విషయముతో సంయోగము నందును. ఘటాది విషయ సంబద్ధమైన ఈ వృత్తి విషయాకారతను, అనగా ప్రమేయాకారతను పొందును. అప్పుడు ఘటాది విషయోపలంభత్వము చైతన్యముద్వారా కలుగుచున్నది.

మధుసూదనుని సిద్ధాంతబిందులోను, విద్యారణ్యుల పంచదశియందు ఈ ప్రక్రియ పూర్తిగా వివరించబడినది. వేదాంతపరిభాషలో గూడ నీ విషయము చర్చింపబడినది. కాని ఈ ప్రక్రియ నంగీకరించకుండా విషయ ప్రత్యక్షమును వివరించవీలున్నది.

అతో మాంసమయీ యోషిత్ కాచి దన్యా మనోమయీ
మాంసమయ్యా అభేదేఽపిభిద్యతేఽత్ర మనోమయీ. ౨౮

ఒకే ఒక స్త్రీని భార్యయని, స్నుషయని, మాతయని, పరిపరి విధములుగా భావించుట గలదు. ఈ భావనలలో భేదములు కన్పించుచున్నవే గాని వీటికి విషయభూత మైన స్త్రీ యొక్కటియే. ఇట్లు విషయభూతమైన స్త్రీ మాంసమయియై బాహ్యజగములో నున్న స్త్రీ. జ్ఞేయమైన ఈస్త్రీలో భేదములు

కన్పించవు. తజ్జన్యములగు జ్ఞానములు విలక్షణములుగా గలవు. కాని జ్ఞానవైలక్షణ్యము కలుగునప్పుడు జ్ఞేయవైలక్షణ్యము కలిగి తీరవలసి యుండుటచే జ్ఞేయాకారభేదము నంగీకరించక తప్పదని చెప్పుటకై పంచదశీకారు డీ శ్లోకము నిచ్చినాడు.

మధుసూదనున కీ సందర్భమున నభీష్టతమగు భావ మీ క్రింది విధముగా నుండనోపు నని పైదాని కీషన్మాత్ర భేద ముతో వ్యాఖ్య చేయుచున్నాము.

మాంసాదులతో భాసించు స్త్రీ వేరు, మానసికముగా భాసించు స్త్రీ వేరు. మానసికముగా నొకానొక ప్రతిమాకార మున భౌతికజగములోని స్త్రీ భాసించుట గలదు. భౌతికజగము లోని స్త్రీకి ఇది ప్రతిబింబమగుటచే నీరెంటికిని భేదము లేదు. కాని భౌతిక జగములోని స్త్రీ దేశకాలా ద్యుపాధుల వశమై మార్పులను బొంది, నశించుట గలదు. మనోమయి యైన స్త్రీ దేశకాలాద్యుపాధులకు లొంగక, మార్పులను బొందక, నిర్వి కారయై నిలిచిపోవుటచే నీ రెంటికిని భేద మేర్పడుచున్నది. మనోమయియగు స్త్రీ భావనాజగము లోనిది. భావన ఆత్మ యొక్క వ్యాపార మగుటచేతను, భావనావ్యాపారము ద్వారా బాహ్యజగ మర్థవంత మగుటచేతను, భావనాజగమే మాతృక యని, లౌకికజగము తదనుకరణ యని యెంచవలసి వచ్చు చున్నది. మనోమయాకార భేదము ననుసరించి భౌతికాకార భేదము ప్రతీయమాన మగుచున్నది.

భార్యా, స్నుషా, ననాందా చ, యాతా, మాతే త్యనేకధా
జామాతా, శ్వశురః, పుత్రః, పితేత్యాది పుమా నపి. ౨౫

ఒకేఒక స్త్రీ ఒకనికి భార్య, ఇంకొకనికి సోదరి, మరొకనికి కోడలు, వేరొకనికి తల్లి అని భిన్న భిన్న సంబంధముల ద్వారా ప్రతీయమాన మగుచున్నది. ఇట్లే ఒకేఒక పురుషుడు ఒకనికి అల్లుడు, మరొకనికి మామ, వేరొకనికి పుత్రుడు, ఇంకొకనికి తండ్రి యని భిన్నభిన్న స్వరూపములతో భాసించుట గలదు. ఈ భేద ప్రతీతి మనోవృత్తిని ఆశ్రయించుకొని యున్నది.

బాహ్యపిండస్య నాశేఽపి తిష్ఠత్యేవ మనోమయః
అతః స్థాయీతి విద్వద్భి రయ మేవ నిరూపితః. ౧౬

ఒకేఒక విషయము భిన్నవిధములుగా భాసించుట గల దంటిమి. ఇదిగాక ఒకేఒక విషయమునకే వినాశిత్వా వినాశిత్వ ధర్మములుగూడ కన్పించుచున్నవి. భౌతికజగములోని విషయము నశించినను మనోమయమగు నీ విషయము నశించుటలేదు. బాహ్యవిషయము దేశకాలాద్యుపహితము. మనోమయమగు నీవిషయము దేశకాలాదుల కతీతము. కావుననే మనోమయమగు విషయమును స్థాయి యనుచున్నారు. స్థాయి యనగా కదలికగాని, మార్పుగాని లేనిదియని అర్థము. * (రెండవ అనుబంధము చూడుడు.)

ఏవం స్వభావతో భావస్వరూప ముపవర్ణితమ్
విశేషేణ తు సర్వేషాం లక్షణం వక్ష్యతే పృథక్. ౨౭

మనోమయమగు విషయాకారము వినాశరహితమగు టచే స్థాయి యని పిలువబడుచున్నదని చెప్పితిమి. ఈ స్థాయి యనునది రతి, హాసము మొదలగు భేదములతో కన్పించు చున్నది. ఈ భేదములను మున్ముందు వివరించగలము. ద్రుత చిత్తమును ప్రవేశించిన వినాశరహితమగు విషయాకారము స్థాయి యని మాత్రమే ఇచట గుర్తుంచు కొనవలెను.

భగవంతం విభుం నిత్యం పూర్ణం బోధసుఖాత్మకమ్
య ద్గృహ్ణాతి ద్రుతం చిత్తం కి మన్య దవశిష్యతే. ౨౮

సర్వదేశవ్యాపి, సర్వకాలవ్యాపి యని భగవంతుని నిర్వ చించినచో భగవంతుడు దేశకాలముల కతీతుడని భావము. భగవంతు డన ఆధ్యాత్మిక తత్త్వము. దీనినే ఆత్మ యని, బ్రహ్మయని ఉపనిషత్తులు వ్యవహరించినవి. ఈ తత్త్వము దేశకాలములచే నుపహితముగానిది. ఇది అద్వితీయమగు బ్రహ్మపదార్థ మగుటచే పూర్ణమని చెప్పబడుచున్నది. ఇది సర్వద్వైతభ్రమాధిష్ఠానము. ఈ తత్త్వావగతియే నిర తిశయమగు పరమపురుషార్థము. ఇట్టి భగవదాకారము ద్రుత చిత్తముచే గ్రహింపబడినచో నిక గ్రహింపబడవలసిన విష యము వేరుగా నేమియులేదు. సర్వానుగ్రాహకమగు తత్త్వము గృహీతమైన సర్వము గృహీతమే యగుచున్నదని భావము. భక్తియోగమునకే భగవదాకారమగు చిత్తవృత్తి ప్రధానము.

మానవుల శ్రేయస్సునకై జ్ఞాన, కర్మ, భక్తియోగములు చెప్పబడినవని శ్రీమద్భాగవత మనుచున్నది (**11. 20. 6**) నిర్వేదము కలుగనంతవరకు కర్మాచరణము తప్పదని, శ్రద్ధ కలుగనంతవరకు భగవత్కథాశ్రవణము చేయవలెనని చెప్పుచు భాగవతము (**11. 20. 9**) భక్తి, జ్ఞాన, యోగముల వైశిష్ట్యమును ప్రశంసించినది. కర్మాచరణవలన నంతఃకరణ పరిశుద్ధమగును. తద్ద్వారా గీతలలో చెప్పబడిన జ్ఞానయోగము (**13. 7. 11**) దేహేంద్రియాద్యనాసంగాత్మకమై సుప్రతిష్ఠితము కాగలదు. వైరాగ్యముతో నిర్విణ్ణుడైన వ్యక్తియొక్క మానసము దౌరాత్మ్యమును పదలి, శమదమాదిసాధన సంపదతో మనన నిదిధ్యాస నాత్మకము కాగలదు. ఇట్లు సిద్ధమగు మనఃప్రసీదనమున భక్తియోగమునకు జ్ఞానావధిత్వమును భాగవతము చెప్పుచున్నది. భక్తియోగములేనిచో మనస్సునకు సమ్యక్ప్రసాదము కలుగనేరదు. కనుక భక్తియోగమును జ్ఞానయోగాంతర్గతముగా స్వీకరించవలెను. భక్తి యోగముతో భగవానుని భజించువాని హృదయమున కామము లన్నియు నశించ గలవని భాగవతము చెప్పుచు ఇహాముత్రార్థ ఫలభోగ విరాగమును ప్రశంసించుచున్నది.

"ఈశ్వరునియందు భక్తిగలిగి, భగవదాత్మకమగు మనస్సుగల యోగికి జ్ఞాన వైరాగ్యములు సాక్షాత్తుగా శ్రేయఃకారకములు కాజాలవు. కర్మలు, తపస్సు, జ్ఞానము, వైరాగ్యము, యోగము, దానధర్మములు, ఇతర శ్రేయోదాయకములగు కృత్యములు అనునవి ఫలించవలె ననినచో

ఈశ్వరునిపై భక్తి చాల అవసరము. స్వర్గము, అపవర్గము, కైలాసము మొదలగువానిని భగవద్భక్తులు మాత్రమే పొంద గలరు. భక్తితో నీవాంఛలు గలవారికి పునరావృత్తి లేని భగవత్ప్రసాదము లభించగలదు. నిరపేక్షాత్మకమగు ఈవిధమైన నిఃశ్రేయస్సు శ్రేష్ఠతమము," అని భాగవతము భక్తియోగ మును ప్రశంసించుచున్నది. (**11. 20. 31-36**)

భక్తియోగము పరమ పురుషార్థమని, పరమ పురుషార్థ సాధకమని భాగవత మనేక స్థలములలో కొనియాడుచున్నది. (**2. 2. 33, 34; 1. 2. 8; 3. 25, 44; 10. 47. 24**)

కైవల్యము ననుభవించుటకు భక్తియోగమును మించిన మార్గములేదు. ధర్మాచరణవలన, భగవత్కథాశ్రవ ణమువలన అంతఃకరణ పరిశుద్ధమై భగవంతునిపై ప్రేమను రగుల్కొలుపును. ఈ ప్రేమ కలుగనిచో కర్మాద్యాచరణము వ్యర్థమైన శ్రమయే యగును. దానము, వ్రతము, తపస్సు, హోమము, జపము, స్వాధ్యాయము, శమదమాది సంయ మనము మొదలగు వానిద్వారా భగవద్భక్తి సాధ్యము కాగ లదు. భక్తియోగమున మనస్సు భగవదర్పితమగును. ఆత్మప్రహీణభావ పూర్వకముగా భగవదైక్యము భావించి, అనుభవింపబడును. భగవంతునితో, అనగా పరబ్రహ్మతత్త్వ ముతో, ఐక్యమును భావనజేసి అనుభవించుటయే భక్తియొక్క పరమలక్ష్యము. నిశ్రేయసఫల[illegible] భక్తియోగము పరమపురుషార్థమని వేరుగా [illegible]రలేదు. కావుననే—

" యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మేయుక్తతమోమతః.
అని గీతలలో గూడా గలదు.

భక్తియోగము పరమ పురుషార్థమునకు సాధనమని కొన్నిస్థలములయందు గానవగును. భక్తియోగమువలన వైరాగ్యము, జ్ఞానము కలుగు నని (1. 2 .7) భక్తియోగములో పరమపురుషుని భజించవలెనని (2. 3. 10), సూర్యకిరణముల ప్రకాశముద్వారా మంచు కరగిపోవునట్లు భక్తియోగము ద్వారా పాపము నశించునని (6. 1. 15) భాగవతము చెప్పుట గలదు. భక్తియోగముద్వారా బ్రహ్మజ్ఞానము కలుగునని గీతలలో (18. 55) గలదు. వీటిని బట్టి భక్తియోగము అన్యార్థములను సాధించుట కుపకరించు సాధనముగా కన్పించుచున్నది. అన్య విషయమునకు సాధనమైనది సాక్షాత్తుగా పురుషార్థము కాజాలదు. కాని భక్తిశబ్దమునకు భావవ్యుత్పత్తి, కరణవ్యుత్పత్తి గలవని వెనుక చెప్పితిమి, భావవ్యుత్పత్తి ద్వారా భక్తికి భగవదాకారతా రూపమను మనోవృత్తిని భజించుట యను నర్థము రాగలదు. ఈ మనోవృత్తి నిరతిశయ పురుషార్థమని వేరుగా జెప్పనక్కరలేదు. కరణవ్యుత్పత్తిద్వారా భక్తి సాధనమగును. సాధనముగను, సాధ్యముగను గూడ భక్తి కలదు. ఇట్లే విజ్ఞానశబ్దమునకు బ్రహ్మయని, తదవగతికగు సాధనమని అర్థములను చెప్పుచున్నాము. కావున రెండవ భక్తిశబ్దము సాధ్యముగ ప్రయోగింపబడినది.

మరియొక శ్లోకమున (**11. 3. 33**) సాధనరూప మగు భక్తిని భాగవత ధర్మముగా వివరించి చెప్పుట గలదు. సాధ్య మగు భక్తి ఈ సాధనముల ద్వారా బయలుదేరునని చెప్ప బడినది.

కాని సాధనరూపమైన భక్తి యొకటి, ఫలరూపమైన భక్తియొకటి యని రెండు విధముల భక్తులుగలవని చెప్ప రాదు. వేరొక శ్లోకమున కృతకృత్యత్వ పరామర్శగలదు. వేదాధ్యయనము నాచరింపవలె నన వేదములలోని అక్షర గ్రహణమే గాక, అర్థజ్ఞానమునుగూడ గ్రహించవలెనని అర్థ మును చెప్పుచున్నాము. ఇట్లే భక్తియోగము నాచరించవలె నన సాధనరూప మగు భక్తి శ్రద్ధాదులు, ఫలమగు భగవ దైక్యము రెండును చెప్పినట్లే యగును. కావున భాగవతాది గ్రంథములలో సాధనమగు భక్తిని చెప్పువాక్యములు, ఫల మగు భక్తిని వివరించు వాక్యములునని రెండు తెరగుల గల వని, ఇవి పరస్పర వ్యాఘాతకములుగావని, విషయ విభాగ వశమున వచ్చిన ఈ రెంటికి విరోధము లేదని నిశ్చయించ వలెను. పైగా సాధనభూతమగు భక్తి భగవత్కథాశ్రవణాది కముద్వారా ఫలభూతమగు భక్తియోగమున పర్యవసితి మగు చున్నది. మరికొన్ని స్థలముల శ్లోకములలో (**1. 5. 22; 10. 1. 4**) చెప్పబడిన సాధన వచనములను ఫలపరముగా యోజించవలెను. ఇచటగల గుణానువర్ణన, గుణానువాదశబ్ద ములు తజ్జన్యప్రతీతిపరముగా యోజింపబడవలెనని భావము.

భక్తికి, బ్రహ్మజ్ఞానమునకు వైలక్షణ్యము గలదు. కాని భక్తియోగమున సహితము నిరతిశయ పరమపురుషార్థ ప్రతీతి గల్గునని భాగవతము చెప్పుచున్నది (**1, 5, 17, 19; 6, 1, 19**). అనేక ప్రదేశములలో భగవానుని చరణాబ్జసేవయే ఉత్కృష్ట ధర్మమని, నిఃశ్రేయ సఫలదాయకమని చెప్పబడుచున్నది. ఈ భక్తిరసము నొకసారి ఆస్వాదించినవారు దీనిని వదల జాలరు. ఇట్టి నిర్మల హృదయుల నధర్మము గాని, నరకము గాని, బంధింప జాలవు. ఏవంవిధమైన భక్తిలో మానవునకు, ఆధ్యాత్మిక తత్త్వ మగు భగవంతునకు అనన్యత్వ సంబంధము కలదని తెలియబడు చున్నది.

ద్రుతచిత్తము భగవదాకారతను పొందినచో మనోవృత్తియం దవిచ్ఛిన్నముగా నీ యాకారత ప్రతీత మగును అని భాగవతమున (**3, 29, 11, 12**) భగవత్కథా శ్రవణాదికమువలన భగవదాకారతాక మగు మనోవృత్తి కలుగు నని, సముద్రములోనికి సదా గంగానది ప్రవహించునట్లు ధారావాహికమగు నీవృత్తి వర్తించునని, చిత్తద్రవావస్థ లేనిదే ఈవృత్తి కలుగ జాలదని చెప్పబడినది.

భక్తియోగ మింకొకచో వర్ణించబడినది (**11, 2, 45**). ద్రుతచిత్తమున భగవదాకారతాకమగు వృత్తి బయలుదేరగా సర్వభూతములయందు భగవద్భావము భాసించగలదు. ఈ భగవద్భావ మాత్మలో ప్రతీయమాన మగును. ఇది ఉత్తమ ద్రవావస్థా లక్షణము. ఈశ్వరునియందు ప్రేమ, తదధీనులతో

మైత్రి, బాలిశులపై కృప, శత్రువులయం దుపేక్ష ఎవనికి కలుగునో అతని చిత్తము మధ్యమ ద్రవావస్థలో గలదని చెప్పవలెను (11, 2, 46). అప్పుడే ప్రారంభించిన భక్తిసాధనానుష్ఠానము ప్రాకృత మగు ద్రవావస్థయని తెలియవలెను. (11, 2, 47)

కఠినా శిథిలా వా ధీ ర్న గృహ్ణాతి న వాస్యతే
ఉపేక్షాజ్ఞాన మిత్యాహు స్తద్బుధాః ప్రసరాదిషు. ౨౯

ద్రవీభావప్రయోజనము వెనుక చెప్పబడినది. దానినే మరల స్మరించుచున్నాడు. కఠిన మగు చిత్తము విషయమును గ్రహింపజాలదు. శిథిలీభావ మందిన చిత్తమున విషయము గ్రహింపబడినను చిరకాల మచట నిలువలేదు. ద్రవావస్థాజనిత మగు సాత్త్వికభావములు విషయగ్రహణ కవసరములు. సంచారిభావోద్దీపనమైన తదభివ్యక్తి సూచకము లగు సాత్త్విక భావములు బయలుదేరుచున్నవి. కావున సాత్త్విక భావము లనుభూతములైన చిత్తము ద్రవావస్థ నందినదని చెప్పవచ్చును. సాత్త్వికభావ రహితమైన ప్రతీతిలో చిత్త కాఠిన్య ముండును. ఈకాఠిన్యమున విషయ మవగతము కాజాలదు. అందుచే భగవద్విషయమున చిత్తకాఠిన్యము నిందింపబడుచున్నది. (భా. 2. 3. 24; 11. 14. 23)

హరినామమును గ్రహించినను హృదయము ద్రవీభూతము గాకయున్నచో, హృదయమున నేవిధమైన వికారమును కలుగక యున్నచో, అట్టి హృదయమును పాషాణ

మనవలెను. ద్రవీభావము నందని చిత్తములేనిచో రోమహర్షము కలుగజాలదు; భక్తిభావనయే కలుగదు. ఇట్టివారికి కలుగు జ్ఞానము నుపేక్షాజ్ఞాన మందురు. ఈ జ్ఞానము సుఖసాధనము గాని, దుఃఖసాధనము గాని కాలేదు. రాగ ద్వేష శూన్య మైన చిత్తమున సంస్కార మేమియు కన్పించదు.

కాఠిన్యం విషయే కుర్యా ద్ద్రవత్వం భగవత్పదే
ఉపాయైః శాస్త్రనిర్దిష్టై రనుక్షణ మతో బుధః. 30

చిత్తమునకు భగవదాకారతా సంపాదనమే సకల శాస్త్రముల ప్రయోజన మని నిశ్చయించితిమి. శీతలత్వము నీటి స్వభావమని, ఉష్ణత్వము అగ్నిస్వభావ మని, సంచరిష్ణుత్వము వాయుస్వభావ మని మనకు తెలిసియున్నది. వీటి కీ స్వభావములను పోగొట్టలేము గదా! ఇట్లే ద్రవీభూత మగు చిత్తమున ఆయా ఇష్టానిష్ట విషయ సమూహము ప్రవేశించి, చిత్తమును సంకీర్ణము చేయుచున్నది. ఈసంకీర్ణత అనాదికాల ముననే ప్రవేశించి, చిత్తముయొక్క స్వభావముగా భాసించుట గలదు. ఇది నివృత్త మైననే చిత్తమునకు భగవ దాకారత చేకూరగలదు. కాని స్వాభావికధర్మము నివృత్తము కాగలదా? అను ప్రశ్న కిచట సమాధాన మీయబడుచున్నది.

చిత్తము విషయాకారమునుపొందుట యనునది చిత్తము యొక్క స్వాభావిక ధర్మము గాదు. ఆగంతుక హేతు జన్య మైన దీ ధర్మము. ఇంద్రియసన్నికర్షాది ప్రత్యక్ష విషయమున స్థూలవిషయాకారత ప్రతీత మగుట గలదు. స్వప్నావస్థలో

మనోగతవాసనలద్వారా సూక్ష్మవిషయాకారత ప్రతీయమాన మగుచున్నది. కాని సుషుప్తియందు చిత్తము నిర్విషయక ముగా భాసించుచున్నది. సుషుప్తియందలి చిత్తలయ ఈనిర్విష యకత్వమునే తెలుపునది. "తదా పీతేః సంసార వ్యప దేశాత్" (4. 2. 8) అని బాదరాయణుడు సూత్రించినాడు. చిత్తలయ కలుగకయున్నవేళనే సంసారవ్యపదేశము కలదని అర్థము. చిత్తలయలోనే చిత్తముయొక్క స్వాభావిక ధర్మము కనబడగలదు.

అనిర్వచనీయా ద్యనేక శక్తి సమన్వితమై, మాయా ధిష్ఠానమై, సర్వాంతర్యామియై, సర్వత్రానుగతమై యున్న బ్రహ్మ స్వరూపమే సమస్త జగమునకు వివర్తోపాదనము. బ్రహ్మయే మాయాశక్తులవలన జగముగా మనకు కన్పించుట గలదు. ప్రతివిషయము యొక్క స్వాభావిక ధర్మము తత్తద్వస్తువున భాసించు అంతర్యామియే యని భావము. కావున చిత్తముయొక్క స్వాభావికధర్మముగూడ భగవదాకా రతయే యని చెప్పవలెను.

"వియ ద్వస్తు స్వభావానురోధా దేవ న కారకాత్
వియత్సంప్రూర్ణ లోత్రా కుంభస్యేవ దశా ధియామ్.
ఘట దుఃఖాది రూపత్వం ధియాం ధర్మాదిహేతుకః
స్వతఃసిద్ధాఽఽత్మ సంబోధ వ్యాప్తి ర్వస్త్వనురోధతః"

అని వార్తికకారు లనినారు. కుండలో శూన్య మగు ప్రదేశము స్వాభావికముగా గలదు. కుండను నీటితో నింపిన

నిది కుండకు కలుగు అస్వాభావిక ధర్మము. ఈ ధర్మ మన్య కారణసాధ్యము. ఇట్లే దుఃఖాదిమత్త్వ మాత్మ కస్వాభావిక ముగా వచ్చు ధర్మము. ఆత్మయొక్క స్వాభావికధర్మము భగవ దాకారత యనబడు బ్రహ్మస్వరూపము. అన్యాకారతావిరోధి యగు భగవదాకారత నాత్మకు సంపాదించుటయే శాస్త్ర ప్రయోజనమని తేలగలదు. శ్రవణ మననాది సాధనములద్వారా చిత్తమున కన్యవిషయాకారత క్రమక్రమముగా తొలగిపో గలదు. భాగవతము సహిత మీ యర్థమునే చెప్పుచున్నది. భగవద్భక్తివలనగుణకర్మజనితమగు చిత్తమాలిన్యము నశించి, సవితృప్రకాశమువలె నిర్మలము శుద్ధమునగు ఆత్మతత్త్వము ప్రతీయమానము కాగలదు (భా. 11. 3. 40). అగ్నిలో నుంచిన బంగారమునకు మాలిన్య మంతయు పోయి వన్నె బాగుగా వచ్చునట్లు భగవత్కథాశ్రవణాదు లను అగ్నియం దుంచిన ఆత్మ పరిష్కృతమై రాణించగలదు. కర్మలు మొద లగువానివలన వచ్చిన మాలిన్యము నశించగా చక్షురాదీం ద్రియములు సహితము తత్త్వావగతికి సహాకరించగలవు. విషయ ములను ధ్యానించు మానసము విషయాకారమును పొంది విషయములలో నిమగ్న మగునట్లు భగవచ్చింతన చేయు మానసము భగవంతునియందు లీనమగును (11.14.26-28). అనిగూడ భాగవతము చెప్పుచున్నది. మనస్సును విష యములనుండి మరల్చి భగవంతునిపై నిలుపవలెనని భావము (11. 13. 14). ఆత్మయొక్క స్వాభావిక ధర్మమగు భగవదా

కారత అన్యకారణ జన్యమైనది గాకపోవుటచే ననిమిత్త నిమిత్త మనబడుచున్నది. ఇట్టి నిర్మలమగు ఆత్మతో భక్తియోగము నవలంబించవలెను. ఈ భక్తియోగమున కలుగు జ్ఞానోదయమున తత్త్వదర్శన సంభవించును. వైరాగ్యబుద్ధితో, తపోయుక్తమగు యోగముతో, తీవ్రమగు ఆత్మసమాధి నవలంబించగా పురుషుని అస్వాభావిక ప్రకృతి పూర్తిగా దహించుకొనిపోవును. కట్టెలనుండిబయలుదేరిన అగ్ని కట్టెలనే దహించివేయునట్లు గుణకర్మ సమున్మిషితమైన ఆత్మ, గుణకర్మలను నశింపజేయును (**3. 27. 21. 23**). గుణములయందు చిత్తము, చిత్తమున గుణములు ప్రవేశించుచు అన్యోన్యసంబంధము కలిగియుండుటచే, ముముక్షువుయొక్క చిత్తము గుణములనుండి యెట్లు వేరుచేయబడగలదు? అని సనకాదులు ప్రశ్నించగా (**11. 13. 17**), భాగవతమున శ్రీభగవాను డీరీతిగా సమాధానము నొసగినాడు — "మనస్సు, వాక్కు, ఇంద్రియములు అను వాటిచే తాత్త్వికముగా గ్రహింపబడు విషయమాధ్యాత్మికతత్త్వ మొక్కటియే. జీవునిగుణములు, చిత్తము అను రెండును భగవదాత్మకములని తెలియవలెను. జాగ్రత్స్వప్న సుషుప్త్యాద్యవస్థలకంటె విలక్షణుడై సాక్షిగా నున్నవాడు జీవుడు. అనగా జీవునిస్వాభావికావస్థ పీటికకంటె విలక్షణమైన తురీయావస్థ. సంసారబాధాదికము జీవుని గుణవృత్తినుండి వచ్చునది. భగవదాత్మకము, భగవదాకారమునగు తురీయావస్థలో గుణచిత్తములు త్యజింపబడుచున్నవి. అహంకారకృతమగు సంసారబంధము అర్థవిపర్యయకారకమని విద్వాం

సుడు గుర్తెరిగి, నిర్వేదము జెంది, తురీయావస్థలో సంసార చింతను వదలుచున్నాడు. నానావిషయప్రతీతి యెంతవరకు నిలిచియుండునో అంతవరకు జాగ్రత్స్వప్నములే మానవుని ఆవేశించి యున్నవని భావించవలెను. అట్టి మానవుని జాగ్రద్దశ స్వప్నమువంటిదని భావము. స్వప్నదశలోని విషయములెట్లు తాత్త్వికములుకావో, అట్లే జాగ్రద్దశలోనివి గూడనని తెలియవలెను. త్రిగుణాత్మకమగు నీ వ్యాపారము సుషుప్తియం దుపసంహరింపబడు చున్నది. కాని సుషుప్తిలో సహితము త్రిగుణాత్మకమగు వృత్తి పూర్తిగా నశించదు. త్రిగుణములచే నావృతమైన ఈ మూడుదశలు మాయాశక్తిజనితములు. తత్త్వజ్ఞాన మొక్కటియే ఈ మాయాశక్తిని నశింపజేయ జాలినది. తద్ద్వారా త్రిగుణాత్మకమగు వృత్తి నశించును" (**11. 13. 24 - 33**). కావున తత్త్వజిజ్ఞాసద్వారా నానాత్వభ్రమను పోగొట్టుకొని, వైరాగ్యముతో, భగవదైక్యము నవగతము చేసికొనవలెను (**11. 11. 21**).

చిత్తమున కాయా ఆకారములను తెచ్చునవి విషయములు. విషయములు భగవద్వ్యతిరిక్తములు కావు. భగవంతునిపై నధ్యస్తములై, భగవంతుని అంతర్యామిగా గలిగి, భగవదుపాధిభూతములైనవి విషయములు. విషయములన్నియు సదాత్మకములుగనే భాసించుచున్నవి. సద్రూపత్వము భగవల్లక్షణము. భగవదాకారస్ఫూర్తి గలుగగా విషయభాస నివృత్తమగుచు సద్రూపావగతియే మిగులును. అనగా అధిష్ఠాన విషయమగు చైతన్య మవగతముకాగా తదారోపితవస్తువులు

నివృత్తము లగును. అప్పుడు విషయనిష్ఠమగు ప్రేమ భగవ దర్పితము కాగలదు. ఈస్థితిని.—

"యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ
త్వా మనుస్మరతః సా మే హృదయా న్మాపసర్పతు"
(విష్ణు, 1. 20. 19)

అని ప్రహ్లాదు డర్థించినట్లు విష్ణుపురాణము చెప్పు చున్నది. కావున సర్వాధిష్ఠానసన్మాత్రము, పరిపూర్ణ సచ్చిదా నందఘనము, అద్వయమునగు బ్రహ్మగా ఆత్మస్వరూపమును గ్రహించవలెను. అప్పుడు స్వాప్నికవిషయముల నెట్లు స్వీక రింతుమో అట్లే జాగ్రద్విషయములనుగూడ నెంచినచో మహ త్తరమగు వైరాగ్యము జన్మించగలదు. "దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్" అని సూత్రిం చుచు యోగసూత్రకారుడీవైరాగ్యమును వశీకారమని పిలచినాడు.

వైరాగ్యము నాలుగు విధములుగా సాధ్య సాధన భావాపన్నముగా ఆగమములయందు ప్రసిద్ధి నందినది. ఎంత ప్రయాసకైనను సహించి చిత్తదోషములను తప్పక తొల గించుకొనవలెనను అధ్యవసాయాత్మక మగు బుద్ధి కలుగు వైరాగ్యము మొదటి విధము. దీనిని యతమానవైరాగ్య మందురు. నిరంతర ముపాయానుష్ఠానము గావించుచుండగా కొన్ని దోషములు నశించగలవు. మిగిలినవాటిని గూడ నశింప జేయవలె నను బుద్ధి కలుగగా సంభవించు వ్యతిరేక సంజ్ఞాక

మైన వైరాగ్యము రెండవది. అప్పుడు బాహ్యేంద్రియములను విషయములపై వ్యాపృతములు గాకుండ చూచుచు, కేవల మంతఃకరణ వాసనలతో నుండగా నేకేంద్రియసంజ్ఞాక మగు మూడవవిధ మగు వైరాగ్యము రాగలదు. ఈ మూడు విధముల వైరాగ్యముల నభ్యసించగా దృష్టానుశ్రవిక విషయములపై దోషదర్శన పరిపాక జన్యము, స్పృహాత్మికము నగు చిత్తవృత్తి బయలుదేరును. దీనిని వశీకారవైరాగ్య మందురు. నాల్గవది యగు వశీకారవైరాగ్యము పర మని, అపర మని రెండు తెరగులుగా గలదు. ఇందు పర మను వశీకారవైరాగ్యమును "తత్పరం పురుషఖ్యాతే ర్గుణవైతృష్ణ్యమ్" అని పతంజలి సూత్రించెను. పురుషఖ్యాతి యనగా ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానానంతరము తద్గుణము లగు శబ్దాదులయందు వైరాగ్యము కలుగును. ఆత్మజ్ఞానమునకు శ్రేష్ఠఫలరూపత్వము సిద్ధ మగుటచే నీవైరాగ్యము వచ్చుచున్నది. అపరమను వశీకారవైరాగ్యము దీనికి సాధనరూపము. ఇతరఫల నిరపేక్షా పూర్వకమై, మోక్షమాత్ర స్పృహయాలుత్వము నీ పరమను వశీకారమున గాననగును. "నీపాదసేవకంటె మిన్నయైన దేమియు లేదు; నే కోరదగిన దేమియు లేదు. మోక్షదాత యగు నిన్ను భజించిన మానవు డెవ డాత్మబంధనమును కోరుకొనును? కావున సత్త్వరజ స్తమోగుణాత్మకము లగు ఆశీర్వచనముల నేమియు నభిలషించక, నిరంజనము, నిర్గుణము, అద్వయము, స్వతఃసిద్ధము, స్వయంప్రకాశము నగు బ్రహ్మత్వము నందెదను. ఈ వ్యావహారిక జగమున చిరకాలము వసించినను శాంతి నేవిధముగా

నైనను పొందజాలక పోతిని. కావున నభయప్రదాత వగు నీ శరణు జొచ్చితిని. ఆపన్నుడ నైన నాకు అభయమును, అమృతత్వమును ప్రసాదించుము" అని ముచుకుందుడు భగవంతుని ప్రార్థించినట్లు భాగవతమున (**10. 51. 56 – 58**) గలదు. ఇట్టి దశయందు భగవత్ప్రేమ ఆనందపరాకాష్ఠ నధిరోహించు నని భగవానుడు ముచుకుందునకు ప్రత్యుత్తరము నొసగెను (**10. 51. 59–64**).

అపరవైరాగ్యమును "దృష్టానుశ్రావిక విషయతృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్" అని పతంజలి సూత్రించినాడు. పరవైరాగ్యము లేనిచో భక్తిప్రకర్ష యుండదు. మోక్షపర్యంతము సకల ఫల నిరపేక్షతతో నుండు వైరాగ్యమును భాగవత మనేక పర్యాయములు ప్రస్తుతించినది. ఐహికఫలమును, ఆముష్మిక ఫలమును పూర్తిగా పరిత్యజించి, వీటిని అపేక్షింపక, అనన్యభక్తితో భగవంతుని భజించుచు, భగవంతునిలో లీనము కావలెనని యత్నించువారలకే అమృతత్వలక్షిత మగు బ్రహ్మావస్థ చేకూరగలదు (**3. 25. 39, 40**). భగవత్సేవ లేకుండా బ్రహ్మతో సాలోక్యమునుగాని, సామీప్యమును గాని, సారూప్యమును గాని ప్రసాదించినను భక్తులు గ్రహింపజాలరు (**3. 29. 13**). కొందరు భక్తులు భగవంతునితో నేకాత్మతను వాంఛించరు. వీరు భగవత్ప్రేమ గలిగినవారైన భగవత్పాదసేవాభిరతులు (**3. 25. 34**). పరమేష్ఠిత్వము, మహేంద్రత్వము, సార్వభౌమత్వము, రసాధిపత్యము, యోగసిద్ధి, పునర్జన్మరాహిత్యము అను వానిలో దేనినైనను గోరక భక్తులు

భగవంతునే అభిలషింతురు (6. 11. 25. 11. 14 14). ప్రహ్లాదుడు కామరహితుడై, భక్తుడై,స్వామియగు భగవంతుని దరి జేరినాడు (7. 10. 6). భగవచ్చరణాంబుజాసవ మున్నచో కోరిక యేమియు కలుగదని పృథు వనినాడు (4. 20. 24). భగవత్పాదపద్మ ధ్యానము, భగవత్కథాశ్రవణము ఉన్నచో కలుగు నిర్వృతి సుఖము బ్రహ్మయందుగూడ నుండ దేమో యని ధ్రువుడనినాడు (4. 9. 10). భగవద్భక్తి యున్నచో నితర సుఖములను వేటిని అభిలషించ జాల మని శ్రీకృష్ణుని భార్య లనినారు (10. 83. 41, 42). భగవద్భక్తిలో ప్రబుద్ధ మగు హృదయకమలముద్వారా మాత్రమే మోక్షప్రాప్తి యని ఇంద్రు డనినాడు (7. 8. 42). అమృత సాగరమును గ్రోలి అనుభవించినవానికి చిన్నగుంటలు, చెరువులు నిరర్థ కము లగునట్లు నిఃశ్రేయసఫలదాయకు డగు భగవంతుని భజిం చినవానికి అన్యవిషయప్రసక్తి యుండదని ఇంద్రు డనినాడు (6. 12. 22). దురవగమ మగు నాత్మతత్త్వ వినిగమమునకై భగవచ్చరిత మను మహామృతసాగరమున తిరుగుచు శ్రమ జెందువారు భగవద్వ్యతిరిక్త మగు నపవర్గమును వాంఛించరు. (10. 87. 21). ఈరీతిగా మోక్షపర్యంతము సకల ఫల నిర పేక్షస్వరూప మైనది పరవైరాగ్యము. పరమానంద రూప మగు పరమాత్మావగతియందే ప్రేమ పరాకాష్ఠ నందుచున్న దని ఈ పరవైరాగ్య ప్రతీతిద్వారా మనకు తెలియుచున్నది. రెక్కలు రాని పక్షులు తమ తల్లిని, ఆకలి గొన్న దూడలు తమ తల్లిని, భార్య భర్తను చూడవలెనని ఎంత ఆతురత గలిగి

యుండునో అట్లే భక్తునిమానసము భగవంతుని దర్శించవలె నని వేగిరపడుచుండును (6. 11. 26). అనగా జ్ఞానము లేనిదే పరవైరాగ్య మంకురించదు. పరవైరాగ్యాభావమున భగవత్ప్రేమ పరాకాష్ఠ నందదు. తదర్థము జ్ఞాన వైరాగ్యములను దృఢము గావింపవలెను గనుక "ప్రకృతిగుణములను వదలిపెట్టి వైరాగ్య విజృంభిత మైన జ్ఞానముతో, యోగముతో, భగవద్భక్తితో ప్రత్యగాత్మానుభూతిని పొందవలెను" అని భాగవతము చెప్పుచున్నది (3. 25. 27). జ్ఞాన వైరాగ్యయుత మగు భక్తియోగముతో యోగులు బ్రహ్మాభావము నందుచున్నారు (3. 25. 43). భక్తి, వైరాగ్యము, భగవత్ప్రబోధము అనునవి శాంతిని చేకూర్చునవి (11. 2. 43). వీటికి అన్యోన్యసంబంధ మతిసన్నిహితముగా గలదు. పుణ్యగాథాశ్రవణము జేయు భగవద్ధర్మానుష్ఠాతకు మొదట భగవత్ప్రబోధము, తర్వాత వైరాగ్యము, ఆపై ప్రేమలక్షణాక మగు భక్తి కలుగగల వని తాత్పర్యము. జ్ఞానులకు భగవంతుడే అభిమతతమ మగు విషయము; భగవంతునితో కూడని స్వర్గాపవర్గములు వారికి ప్రియతమములు కావు. కావున జ్ఞాన విజ్ఞాన సంసిద్ధులు బ్రహ్మత్వమునే శ్రేష్ఠ మని తెలిసికొనుచున్నారు. అందుచే భగవంతునకు జ్ఞానిచే ప్రియతము డని, జ్ఞానముచేతనే బ్రహ్మోపగతి కలుగుచున్న దని చెప్పబడినది (11. 19. 2, 3). ఈజ్ఞాన మెట్టిది? యను ప్రశ్నకు చక్కని సమాధాన మీయబడినది. లౌకిక జగమున కాద్యంతములు లేవు. ఆద్యంతములు లేని వస్తువునకు మధ్యగూడ నుండ జాలదు. అనగా అట్టి వస్తువు

శూన్యము. అతాత్త్వికము. జన్మ, స్థితి, లయము లీ అతాత్త్విక జగత్తునకు చెందినవి. అనగా నివి యన్నియు మాయాశక్తి యొక్క అధీనములోనివి. ఈ మాయాశక్తిని తెలిసికొనిన, తదధిష్ఠాన మగు బ్రహ్మ అవగత మగును. ఇదే జ్ఞానము లేక విజ్ఞానము. ఈ విజ్ఞానావగతియే పురుషార్థము (**11.19.7**).

భగవద్వ్యతిరిక్త మైన దంతయు మాయామయము. స్వప్నజగత్తువలె మాయాకృత మగు జగము తుచ్ఛము, దుఃఖరూపము, అనిత్యము. ప్రత్యగాత్మ యగు పరమాత్మయే సత్యము. ఈసత్యపదార్థము స్వప్రకాశ పరమానంద రూపము, నిత్యము, విభువు, ఉపాదేయము. ఇది తెలిసికొనుటయే జ్ఞాన మనబడును. దీనినే భగవద్గీతలో శ్రీకృష్ణుడు వివరించెను. (అ7) ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని భగవంతుని భజించు వారు నాలుగు తెరగులుగా గలరు. వీరిలో శ్రేష్ఠుడు జ్ఞాని. జ్ఞానియొక్క ఆత్మ బ్రహ్మయందు లగ్నమై, బ్రహ్మావగతిని లేక బ్రహ్మత్వమును పొందుచున్నది. బ్రహ్మాతిరిక్తమైన దంతయు మాయాత్మక మగుటచే తుచ్ఛము, అనిత్యము, అతాత్త్వికము. వాసుదేవుడే బ్రహ్మ యగుటచే జ్ఞాను లగు భక్తులకు ప్రియతముడు, సత్యము, స్థాయిభావము నగు చున్నాడు. శ్రుతి, ప్రత్యక్షము, ఐతిహ్యము, అనుమానము అను నాలుగు ప్రమాణములును తత్త్వజ్ఞానమును పూర్తిగా నీయ జాలక పోవుటచే జ్ఞానికి వైరాగ్యము కలుగును. వైరాగ్య బుద్ధితో నిత్యానిత్య వస్తు వివేకము గలిగి బాహ్యేంద్రియ ముల కదృష్ట మగు విషయమును గూడ దర్శింప గలుగు

చున్నాడు (11. 19. 17-18). కర్మాచరణ వలన సుఖదుఃఖ ప్రతీతి కలుగుటయే గాక నస్థిరవిషయ సవ్యామోహముగూడ కలుగును. ఇట్లు కర్మచే నిర్మింపబడిన జగము శాశ్వతము గాదు (11. 3. 18-20).

భగవద్ధర్మానుష్ఠాన మగ్నునకు జ్ఞాన వైరాగ్య పూర్వక మగు భగవద్భక్తి ఉదయించు నంటిమి. ఈ భక్తియొక్క స్వరూపము భాగవతమున నేకాదశస్కంధములో విపులముగా వర్ణించబడినది. నిశ్చలముగా మనస్సును బ్రహ్మయందు నిలుప జాలక పోయినచో, నిరపేక్షబుద్ధితో భగవత్పరముగా కర్మల నన్నిటిని ఆచరించుట శ్రేయస్కరము. శ్రద్ధతో భగవత్పుణ్య కథలను విని, పాడి, మననము జేసి, భగవదర్థమే ధర్మ కామా ర్థములను నిర్వర్తించినచో నిశ్చల మగు భక్తి ఉదయించ గలదు (11. 11. 22-24). భగవంతునిపై శ్రద్ధావినయముల నిలుపుట, ఎల్లపుడు భగవదనుకీర్తనము గావించుట, భగవ త్పూజా స్తవములను జేయుట, భగవత్పరిచర్యలో నాదర మును జూపుట, భగవద్భక్తపూజ గావించుట, సర్వభూతముల యందు భగవద్భావము ననుభవించుట, మనో వా క్కాయ కర్మలను భగవదర్పణము జేయుట, భగవదర్థమై అర్థ భోగ సుఖ పరిత్యాగము, భగవద్బుద్ధితో జపతపముల నొనర్చుట, అనువాటిద్వారా భక్తి బయలుదేరును; భక్తివ్యక్త మగును గూడ (11. 19. 20-24).

జిజ్ఞాసువు శ్రేయోదాయకుడగు ఉత్తమ గురువుదగ్గర జేరవలెను. ఆగమాది శాస్త్రములయం దారితేరినవాడు,

బ్రహ్మాత్మ్యము నందినవాడు నగు గురువు ఆత్మదైవతమై భాగవతధర్మములను నేర్పవలెను. మాయారహితముగా నాత్మ యెట్లు సంతృప్తి నందగలదో, ఆత్మదాతయగు భగవంతు డేరీతిగా తుష్టి నందగలడో, అట్టి ప్రక్రియను నేర్పవలెను. మొట్ట మొదట మనస్సును కామక్రోధాదులనుండి వేరుజేసి, అనగా అసంగము గావించి, ఆపై సత్పురుషుల సాంగత్యమును పొందవలెను. దయ, మైత్రి, ప్రశ్రయము, భూతదయ, శౌచము, తపస్సు, తితిక్ష, మౌనము, స్వాధ్యాయప్రవచనము, బ్రహ్మచర్యము, అహింస, సుఖదుఃఖాది ద్వంద్వములపై సమత్వబుద్ధి అనువానిని ఆచరించవలెను. అంతట ఆత్మేశ్వర భావన, దర్శనలను సాధించవలెను. సదా సంతోషముతో మెలగుచు, భగవంతునిపై శ్రద్ధకలిగి, దేనిపైనను నిందాబుద్ధిని కలిగియుండక, మనోవాక్కర్మలను సంయమించి, శమదమాది సంపదతో ప్రవర్తింపవలెను. భగవద్గుణ క్రియాదులను వినుట, కీర్తించుట, ధ్యానించుట, చాల అవసరము. స్వార్థ రహితముగా, భగవద్బుద్ధితో, సుహృద్భావముతో మెలగవలెను. వినయ విధేయతలతో నీ రీతిగా ప్రవర్తించ తీవ్రతమమైన భక్తి ఫలవంతముకాగలదు. అనగా భగవదైకాత్మ్యభావనతో భాగవతధర్మ జనితమగు భక్తితో మాయను దాటిపోయి, బ్రహ్మానుభూతిని పొందవీలున్నది (11. 3. 21-33). ఈ శాస్త్రీయోపాయములతో మనస్సును శుద్ధము జేసికొనవలెను.

ఉపాయాః ప్రథమస్కంధే నారదే నోపవర్ణితాః
సంక్షేపాత్తా నహం వక్ష్యే భూమిభేదవిభాగతః. 30

ప్రతిపన్నజన బుద్ధిసౌకర్యార్థము శాస్త్రీయోపాయము లను మధుసూదనుడు చెప్పబోవుచున్నాడు. భాగవతమున మొదటి స్కంధములో నారదు డీ యుపాయములను వివరించి యున్నాడు. వాటినే భూమికాభేదవశమున సంక్షిప్తముగా నిట చెప్పనున్నాము.

ప్రథమం మహతాం సేత తద్దయాపాత్రతా తతః
శ్రద్ధాఽథ తేసాం ధర్మేషు తతో హరిగుణశ్రుతిః. 32
తతో రత్యఙ్కురోత్పత్తిః స్వరూపాధిగతి స్తతః
ప్రేమవృద్ధిః పరానందే తస్యాథ స్ఫురణం తతః. 33
భగవద్ధర్మనిష్ఠాతః స్వస్మిం స్తద్గుణశాలితా
ప్రేమ్ణోఽథ పరమా కాష్ఠే త్యుదితా భక్తిభూమికా. 34

మహాపురుషులసేవ, వారిదయకు పాత్రుడగుట, వారాచరించు ధర్మములపై శ్రద్ధ, భగవద్గుణశ్రవణము, భగవంతుని ప్రేమ ఉదయించుట, భగవత్స్వరూపమును తెలిసికొనుట, భగవత్ స్ఫూర్తి, భగవద్ధర్మనిష్ఠ, తనయందా గుణములను పెంపొందించుట, భగవంతునిపై గల ప్రేమ పరాకాష్ఠనందుట అను క్రమక్రమముగా, ఒకదానితర్వాత ఒకటి అలవడవలెను. వీటిని శాస్త్రీయోపాయము లందురు. ఇవి యన్నియు భాగవతమున వ్యాస నారద సంవాదములో వివరింపబడినది.

పూర్వజన్మమున నారదుడు బాల్యదశయందే వేద వాదరతులసేవ జేయుచు, యోగులకు శుశ్రూషచేయ నారం భించెను. వారిదయకు పాత్రుడై క్రమక్రమముగా విశుద్ధ చేతస్కుడై నాడట. అప్పుడు భగవత్కథాశ్రవణ మననాదిక మును జేయుచు అస్ఖలితబుద్ధితో ప్రవర్తించసాగెను. అప్పుడు సదసద్వివేకము కలుగగా మనస్సును భగవంతునియందు లగ్నము గావించెను. అప్పుడు సమ్మనిషితమైన భక్తియోగ మున వాసనారూపమున నున్న రజస్తమోగుణములు నశించి నవి. శ్రద్ధాపూర్వకమగు భక్తియోగమున జ్ఞానోదయము కలి గినది. కర్మాద్యాచరణము సంసారబంధహేతువని, భక్తియోగ సమన్వితమైన జ్ఞానము పునరావృత్తిని పోగొట్టునదని నార దుడు గ్రహించ గలిగినాడు. కర్మాదులను భగవద్బుద్ధితో, భగవదర్పణము చేయుచు నాచరించుటయే శ్రేయస్కరమని తెలిసికొనినాడు. తద్ద్వారా లోకోత్తరమగు బ్రహ్మజ్ఞానమును, బ్రహ్మభావమును పొందగలిగినాడు (**1. 5. 23 – 39**).

భగవద్భక్తసేవ యని, సాక్షాద్భగవత్సేవయని భగవ త్సేవ రెండు విధముల గలదు. మోక్షమునకు మహాపురుషు లను సేవించుట ద్వారమువంటిది. వీరిని సేవించుటచే తమో ద్వారము నిరస్తము కాగలదు. సమచిత్తములను గలిగినవారు, ప్రశాంతులు, కామక్రోధరహితులు, సుహృదయులు, సాధు వులు, భగవంతునియందు ప్రేమ కలగి మానవుల నందరను భగవద్భావముతో గాంచువారు, లౌకికవిషయసంపద నశిం చినవారు నగువారు భగవద్భక్తులగు మహాపురుషులు (**5. 5.**

2-3). సాధువులగు భగవద్భక్తులను సేవించుటచే మోక్ష ద్వార మపావృతమగును. కారుణికులు ప్రాణులపై సుహృ ద్భావముగలవారు, అజాతశత్రువులు, శాంతము గలవారు, సాధువులు, సాధుభూషణులు, అనన్యమనస్కులై భగవద్భ క్తిని దృఢముగా గల్గియున్నవారు, భగవదర్థమే ఇతరకర్మ లను బంధుజనులను వదలినవారు, భగవత్కథా శ్రవణము లలో నాసక్తులు, భగవంతునిపై చిత్తమునిలిపి తపస్సు చేయు వారు, సర్వసంగవివర్జితులు, సంగదోషహరులునైన వారే సాధువులు (3. 25. 20-24). స్వర్గముగాని, పునర్జన్మరాహి త్యముగాని భగవద్భక్తుల సాంగత్యముకంటె శ్రేష్ఠముగాదని మరియొకచో భాగవత మనుచున్నది (1. 18. 13). క్షణ భంగురమైనను మానవదేహము సంప్రాప్తమగుట దుర్లభము. ఇట్టి మానవులకు సహితము వైకుంఠ ప్రియదర్శనము మరియు దుర్లభమగుచున్నది. కావున క్షణికమగు నీ జీవితమున సత్పు రుషసాంగత్యమే నిధివంటిది యగుచున్నది (11. 2. 29-30). సాంఖ్యయోగములు, స్వాధ్యాయము, తపస్సు, త్యాగము, ఇష్టాపూర్తము, దక్షిణ, వ్రతములు, యజ్ఞములు, తీర్థయా త్రలు, యమదమాది నియమములు అనునవిగూడ సర్వసంగా పహమగు భగవద్భక్త సంగమువలె భగవానుని ప్రేమకు లోబడునట్లు జేయలేవు. దైత్యులు, యాతుధానులు, మృగ ములు, పక్షులు, గంధర్వులు, అప్సరసలు, నాగములు, సిద్ధులు, గుహ్యకులు, విద్యాధరులు, సర్వవర్ణములకు చెందిన

మానవులు మొదలగు వారందరు భగవద్భక్తసంగముద్వారా భగవత్పదము నందగలరనిగూడ చెప్పబడినది (**11.12.1–5**).

సాక్షాద్భగవత్సేవ గావించినవారనేకులు పురాణాదులయందు కొనియాడబడినారు. వృషపర్వుడు, బలి, బాణుడు, మయుడు, విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, గజేంద్రుడు, గరుత్మంతుడు, వ్యాధుడు, కుబ్జ, గోపికలు, యజ్ఞపత్నులు, వేదాధ్యయనమును గావించనివారు, మహాత్తముల నుపాసించనివారు, వ్రతముల నాచరించనివారు, తపస్సులను చేయనివారు మొదలగు వారందరు భగవద్భక్త సాంగత్యము జేసి భగవత్పదము నందినారని వినుచున్నాము. గోపికలు, గోవులు, మృగములు, నాగములు, సిద్ధులు, మూఢులు సహితము భగవద్భావముతో వర్తించి భగవత్పదము నందిరని చెప్పబడినది. ఎన్ని యత్నములు జేసినను లభించని భగవత్పదము భక్తులకు, భక్తులసాంగత్యము గలవారలకు సమకూరుచున్నది (**11. 12. 5-9**). కావున చోదనా ప్రతిచోదనలను, ప్రవృత్తి నివృత్తులను, శ్రుత శ్రోతవ్యములను పరిత్యజించి, భగవంతుని శరణుజొచ్చి, సర్వాత్మభావముతో, భయరహితముగా భగవద్భావము నంద వలెననినారు (**11. 12. 13-15**).

కావున భగవత్సంగము గాని, భగవద్భక్తసంగముగాని లేకుండా భగవంతునిపై భక్తి ఉదయించ జాలదు. భగవద్భక్తులు కృతార్థులు, కృతకృత్యులు నగుటచే వీరికి అన్యసంగాపేక్ష యుండదు. కాని భగవద్భక్త సంగులు భక్తుల సాంగత్యము నపేక్షించక తప్పదు.

మహాత్మేవ యైన తర్వాత తద్దయాపాత్రత కలుగ వలెను. సుశీలాది గుణోపేతులైన వారిని మహాపురుషు లని యెంచవలెను. కృపాలువు, ద్రోహము చేయనివాడు, తితిక్షువు, సత్యవంతుడు, ద్రోహరహితమైన ఆత్మగలవాడు, సమబుద్ధి గలవాడు, సర్వోపకారకుడు, అపామహతుడు, దాంతుడు, మార్దవము గలవాడు, శుచి యైనవాడు, ఉదారబుద్ధి గలవాడు, కోరికలు లేనివాడు, మితభోజి, శాంతముగలవాడు, స్థిరుడు, భగవద్భక్తి గలవాడు, అప్రమత్తుడు, గంభీరాత్మ గలవాడు, ధృతిమంతుడు, షడ్గుణములను జయించినవాడు, మానవంతుడు, కారుణికుడు, ప్రతిభావంతుడు నగు వాడు మహాత్ముడు (11.11.29-31). మాత్సర్యరహితుడు, దక్షుడు, మమకారరహితుడు, దృఢసుహృద్భావము గలవాడు, అసూయాదులు లేనివాడు, జిజ్ఞాసువు, అన్నిటియందు నుదాసీనబుద్ధి గలవాడు, భగవంతుని తెలిసికొనినవాడునై శాంతరూపుడగు గురువును భగవదాత్మకునిగా నుపాసించ వలెను (11. 10. 5-7). బ్రహ్మణ్యుడు, శీలసంపన్నుడు, సత్యసంధుడు, జితేంద్రియుడు, తనను తాను చూచుకొనునట్లితర విషయములను గాంచువాడు, వినమ్రుడు, దీనవత్సలుడు, భ్రాతృత్వముతో స్నిగ్ధుడు, గురువుల నీశ్వరునిగా భావించువాడు, రాగద్వేషాది వివర్జితుడు, వ్యసనములపై నుద్విగ్నము కాని చిత్తము కలవాడు, కామరహితుడు, తత్త్వావగతికై యత్నించినవాడు, ప్రశాంతకాముడు, అజాతశత్రువు అని ప్రహ్లాదుడు ప్రస్తుతించ బడినాడు (7. 4. 30-33). ఇట్టి శిష్య

త్వము గాని, భగవద్భక్తసేవ గాని, భగవద్భక్తి గాని, లేనిచో మహాత్ముల సాంగత్యము నిరర్థక మగును.

ఏతాదృశ మహాపురుషుల దయకు పాత్రుడు కావలె నని ద్వితీయభూమిక గలదు. ఈ దయాపాత్రత గూడ స్వప్రయత్నానపేక్ష యని, తత్సాపేక్ష యని రెండు విధముల గలదు. క్రమముక్తి, సద్యోముక్తి యనునవి స్వప్రయత్నానపేక్ష ద్వారా లభించునవి. ఈముక్తిని పొందుటకు కావలసినది భక్తి మాత్రమే (**4. 24. 25-31**). స్వప్రయత్నాపేక్షతో ధ్రువుడు త్రిభువనోత్కృష్ట మగు భగవత్పదమునకు మార్గము నుపదేశింప వలసిన దని నారదుని ప్రశ్నించెను (**4. 8 35-38**). ప్రవణాయితమగు చిత్తముతో భగవంతుని భజించ నిఃశ్రేయః కరమగు స్థితి లభించ గలదని నారదుడనినాడు (**4. 8. 40-42**).

పైన చెప్పిన గుణములతో నలరారు, మహాత్ములను సేవించగా వారియొక్క ధర్మములపై, క్రియలపై శ్రద్ధ బయలుదేరును. ఆ ధర్మముల ననుష్ఠించిన కృతార్థుడను కాగల ననుబుద్ధి జన్మించ, తదనుష్ఠానమునకై మానవుడు యత్నించ గలడు. శ్రద్ధాపూర్వకముగా మహాత్ములకు శుశ్రూష చేయుచు, భగవత్కథలను వినుచు, పుణ్యతీర్థములను సేవించుచు నున్నచో కర్మబంధము భిన్నము కాగలదు (**1. 2. 16-17**). నిస్సంగత్వముతో కూడియున్న భక్తియోగమే కైవల్య సమ్మత మగు పథ మగుటచే భక్తియోగ మాదేశించు భగవత్కథాశ్రవణము నెవడు ప్రేమించడు? (**2. 3. 12**) అనగా

భాగవతధర్మము లన్నిటిపైనను ప్రేమ, శ్రద్ధ కలుగకపోవు. భగవద్భక్తులలో నొకడై, భగవత్పాద పల్లవమును బ్రహ్మ ఆరాధించగోరినట్లు భాగవత మనుచున్నది (**10. 14. 30**) సాధనపరిపాక వశమున నేవంవిధ మగు శ్రద్ధ వృద్ధిపొందుచు నైహికాముష్మిక విషయముల నన్నిటిని వదలునట్లు జేయ గలదు. ఆప్పు డాకలి గొన్నవానికి అన్నమువలె భక్తునకు భగవద్ధర్మాచరణమే జీవనోపాధి కాగలదు.

భగవన్ముఖాంభోజమునుండి స్రవించు భగవత్కథా మృతమును గ్రోలు పరీక్షితున కాకలి దప్పులు లేవట! భగవద్గుణ శ్లోకాను కీర్తనము లేని జీవితము వ్యర్థమని శౌనకు డనినాడు. భగవద్గుణ క్రియాదులను వినక, సంకీర్తనము చేయక యున్నవాని, జిహ్వాదీంద్రియములు నిరర్థకములు. కిరీటాదులతో విభూషిత మైనను శిరస్సు భగవత్ప్రణామము నకు లొంగనిచో నా శిరస్సు కేవలము భారహార మగును. ప్రకాశించు కాంచన కంకణములతో నున్నను ఎవని చేతులు భగవత్సపర్యయందు వ్యాపృతములు గావో అట్టి చేతులు చేతులు కాజాలవు. భగవన్నిరీక్షణ జేయని నేత్రములు నేత్ర ములు కావు. భగవత్క్షేత్రములకు తీసికొని పోజాలని పాద ములు చెట్ల మొండెముల వంటివి. భగవత్పాదరేణువు నభిల షించనివాడు జీవచ్ఛవము. భగవన్నామ సంకీర్తనమును విను చున్నను చిత్తము ద్రవీభూతము గానిచో నట్టి చిత్తమును పాషాణమని యెంచవలెను. (**2, 3 17-24**)

భగవంతునిపై శ్రద్ధాభక్తులు లేనివారు విషయభోగపరులు. కొందరు పాండిత్యాది గర్వముతో నున్నవారై భగవద్భక్త నిందాపరు లగుచున్నారు. సర్వపాప వినాశకర మగు భగవన్నామ సంకీర్తనమును జేయక, మతిని పోగొట్టు అన్యవిషయముల నాకర్షించుచు, విషయలోలు రైనవారలకు భగవంతుడు దూరముగను (3, 15, 23). వృక్షములు, పశుపక్ష్యాదులు భగవన్నామాలకములై జీవించుచున్నవి. శ్వాసించుచున్నవి అట్టిచో భగవత్కథా శ్రవణమునకు చెవియొగ్గని పురుషుని పశువుగాగూడ భావించ వీలు లేదేమో యని మరియొకచో గలదు. ఆత్మకారక మగు నీశ్వరుని సాక్షాత్తుగా భజించుట, తెలిసికొనుట యను వాటి యందు వ్యాపృతులుగాని వా రధోగతిపా లగుదురు. స్త్రీ శూద్రాదులు సహితము భగవద్గుణ శ్రవణాదికముచే పవిత్రు లగుచున్నారు (11, 5 2-4) రజోగుణమునకు లొంగి ఘోర కృత్యములను సంకల్పించువారు, కాముకులు, క్రోధాదిద్వేషపూరితులు, దాంభికులు, గర్విష్ఠులు, పాపులు మాత్రమే భగవద్భక్తులను నిందించుచు, హేళన చేయుదురు. అధర్మాచరణముననుండి జీవహింస చేయుచు భక్తుల నెగతాళి చేయు నీ దుష్టులు మహైశ్వర్యాదికముచే మదించినవారు. విద్యా, త్యాగ, రూప, బలాదులచే బుద్ధిమాంద్యము నందినవారు. వీరని తెలియవలెను. ఇష్టదైవతమును స్మరించక, వేదాదులచే ననుకీర్తింపబడిన దేవుని ఆరాధించక యుండు వీరు బుద్ధిహీను లనబడుదురు (11. 5. 7-10). భగవత్పరాఙ్ముఖులకు వీరల కంధకారమే గతి

కాగలదు (**11. 5. 18**). కావున భగవద్ధర్మ శ్రద్ధ యనునది మూడవ భూమిక యగుచున్నది.

భగవత్పాదానువృత్తిని గోరి సత్యమగు మార్గము నవలంబించ దలచినవారు భగవద్గుణ క్రియలపై శ్రద్ధ వహింపవలెను. ఏతచ్ఛ్రవణమువలన నితరుల కలభ్యమగు భగవదావాసము సంప్రాప్తము కాగలదు (10. 90. 49-50). అతిదుస్తరమగు సంసారసాగరమును దాటుటకు భగవంతుడను పడవ దప్ప వేరొకటి లేదు. వివిధ దుఃఖములను పోగొట్టుకొనుటకు భగవల్లీలా కథా రస నిషేవణమే తరుణోపాయము (**12. 4. 40**). భగవద్గుణశ్లోకమువలననే మానవుడు విరాగి కాగలడు (**10. 1. 4**). భగవద్గుణశ్రవణ మనునది సమస్త భాగవత ధర్మములకు నుపలక్షణము. కావున నీవిధములగు ప్రయోగములు కన్పడినపుడు భాగవత ధర్మములని వ్యాఖ్య చేయవలెను.

భగవచ్చరణాంబుజ సేవయే అమృతత్వ హేతువని వేరొకచో గలదు (**11 . 2 . 2**). భగవత్కథాశ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము నను నవలక్షణములతో గూడినది భక్తి. ఇట్టి భక్తి కలిగియుండుట ఉత్తమపురుష లక్షణము (**7.5.23-24**). కావున భగవానునిగురించి వినుట, భగవానుని కీర్తించుట, స్మరించుట అనునవి అభయప్రదాయకము లని చెప్పవచ్చును (**2.1.5**). భగవచ్ఛ్రవణ సంకీర్తన

ముల ద్వారా భగవదవతారము చిత్తము నావేశించి, చిత్త మందలి మాలిన్యము నంతయును నిర్మూలించును. భగవంతుని నభివ్యక్తముచేయని వాక్కులు, కథలు అసత్ప్రలాపములు గానవ్వ డవగితములగును. భగవద్గుణోదయము లైన సత్త్వమంగళపుణ్యమే అన్వర్థము లగును. భగవంతుని ఉత్తమ శ్లోక యశోనుఽనుకీర్తనము గలిగిననే రమ్య, రుచిర, నవత్వాదులు సార్థకములు కాగలవు. అప్పుడు మానసము సదా మహోత్సవమగ్నము కాగలదు. అప్పుడే శోకార్ణవమును దాటగలము భగవద్భావములో వర్తించు ఏతాదృశ మానవులు నిర్మల హృదయులగు సాధువులని పిలువబడుదురు. కావుననే భగవద్భావ వర్జితమైన నైష్కర్మ్యముగాని, జ్ఞానముగాని శోభించవు. భగవద్భక్తిని తెలుపు శ్రవణ, మనన, నిధిధ్యాసనలు శాంతిని, భద్రతను ప్రసాదించునవి; విజ్ఞాన విరాగ యుక్తమగు జ్ఞానమును, పరమాత్మ భక్తిని, సత్త్వశుద్ధిని తీసికొనివచ్చునవి (**12.12 47–54**). సంసారకూపమున బడినవారికి తన్మోక్షహేతువగు భగవచ్చరణావలంబనమున కలుగు ఆత్మార్పణమే శ్రేయస్కరము (**10.69.18**). రజో రాగ విషాదములు, క్రోధము, కామము, గర్వము, దైన్యము, భయము, ఆధి, సంసారబంధము అనున వీ విధమగు భక్తి వలననే నశింపగలవు (**5.18.14**). అనగా వీరికి భగవత్సేవ చేయవలెనను కోరిక యొక్కటే మిగిలియుండును (**5.19 21**). జగద్గురు వగు భగవానుని భర్తగా భావించి భజించుటయే శ్రేష్ఠమగు తపస్సు అని విష్ణుపురాణ మనుచున్నది. వైదికముగా యజించినను,

తాంత్రికముగా యజించినను, ఉభయసమ్మిశ్రితముగా యజించినను భగవానుడే యజ్ఞపురుషుడు (11.27.7). అందుచే యజనక్రియ భక్తిమార్గములోనిదే యగుచున్నది. తద్ద్వారా ఈప్సితార్థసిద్ధి కలుగుచున్నది (11.27.49). భగవానుని అర్ఘ్య పాద్యాదులచే పూజించి, సపర్యచేయువానిని దుఃఖములు బాధించవు. ఆత్మకృతమగు విపాకము ననుభవించుచు భగవదనుకంపను గోరి మనోవాక్కాయకర్మలతో భగవన్నమస్కృతి గావించువానికి భగవత్పదమే లభించగలదు (10.14 8). ఈ నమస్కృతి సర్వకిల్బిషహరము (12 12 46). కావుననే—

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే"

అని గీతలో చెప్పబడినది. భగవన్నామ శ్రవణ మాత్రముననే మానవుడు నిర్మలుడగుచుండగా తద్భక్తసంగతి వేరుగా జెప్పనక్కరలేదని భాగవత మనుచున్నది (9 5.16). అశేష బంధువగు నీశ్వరుడు అనన్యశరణ్యము గలవారియందాత్మభూతుడై యుండును (11.29.4). మనోవాక్కాయకర్మలను స్వార్థరహితముగా నుంచి భగవదర్పణము చేయువాని సుకృత మద్వితీయము (11.2.36). ఇట్టి పరమానంద స్వరూపుడు, పూర్ణపురుషుడు, సనాతనుడు, బ్రహ్మయగు భగవానుడు గోపాలకులతో కలసిమెలసి తిరుగుట ఆ గోపాలకుల పుణ్యఫలమే యగుచున్నది (10.14.32). కావుననే బ్రహ్మానుభూతికై భగవద్దాస్యము చేయువారు తమతమ స్వార్థములను

లెక్కచేయక భక్తిమార్గావలంబు లగుచున్నారు. సమస్త కర్మలను వదలి, భగవానునకాత్మను నివేదనముచేసి అమృతత్వమును పొందు వ్యక్తి బ్రహ్మాత్మానుభూతిని పొందుచున్నాడు (**11.29.34**). ధర్మార్థకామములు, శయ దమాదులు మొదలగునవి శాస్త్రములలో చెప్పబడినను, భగవంతునకు ఆత్మను నివేదించుటయే శ్రేష్ఠమని శాస్త్రములు చెప్పు పరమరహస్యము (**7.6.26**). సర్వాత్మనా భగవంతుని శరణు జొచ్చుటయే శ్రేయస్కరమని తాత్పర్యము (**11.5.41**). కావున శక్త్యనుసారము భాగవతధర్మముల ననుష్ఠించుటయే నాల్గవ భూమిక. ఈ నాలుగు భూమికలు పరమ భక్తిప్రతీతికి సాధనములు.

తర్వాత వచ్చునది రత్యం కురోత్పత్తి; భగవంతునిపై ప్రేమ యనునది మొలక యెత్తుట యని భావము. ద్రుత చిత్తమును ప్రవేశించిన భగవదాకారతారూపమగు సంస్కార విశేష మగు భక్తి స్థాయిభావమై భక్తిరసమును నిష్పన్నము చేయును. ఈ స్థాయిభావము భగవద్ధర్మానుష్ఠానాత్మకము. కావున సత్పురుషుల ప్రసంగములయందు భగవద్గుణాదులు చెవిన బడి హృదయము నావేశించి, మానవుని శీఘ్రముగా మోక్షమార్గమున ప్రవేశపెట్టునవని, ఈ మార్గమున నభీష్టము నెరవేరుటకు శ్రద్ధాపూర్వకమగు భగవత్ప్రేమ బయలుదేరు నని చెప్పబడినది (**3.25.25**). భక్తిరసానుభవమున కలుగు శ్రద్ధద్వారా జనించు రతి యనబడు ప్రేమ స్థాయిభావమై, పరిపుష్టమై భక్తిరసముగా పరిణతమగుచున్నది. ఈ స్థాయి

భావ పరిపోషమును గూడ భాగవత మనేకసారులు వివరించి నది. అవిద్యలో బడి యున్నవారి ఆత్మ ఉపహితము కాగా మనస్సు కర్మవశ మగును. తద్వారా గాఢమగు దేహాత్మ సంయోగమున భగవంతునిపై ప్రేమ అంకురించదు. కాని అపవర్గప్రదు డగు భగవంతునితో నాత్మకు సమాగమము కలుగగా నలౌకిక మగు రతి యను భావము సమున్మిషిత మగును (**10.51.54**). గంగానది అన్యవిషయాభిలాష లేక అనన్యవిషయకమై భగవంతునితో లీనమగుటయే ఇచట గల రతి శబ్దమున కర్థము. కర్మాచరణమున నున్నను ఈశ్వరేచ్ఛ యున్నచో నీ రతి ఉదయించగలదు (**10.47.67**). ఈ రతి యను నైదవ భూమిక భక్తియొక్క స్వరూపమును తెలుపు నది. ఫలభూతములైన మిగిలిన ఆరు భూమికలును ఈ ఐదింటి యొక్క పరిపాకవిశేషములు.

రత్యంకురోత్పత్తి కలుగగా వచ్చునది స్వరూపాధిగతి. స్థూల సూక్ష్మ దేహద్వయాతిరిక్తముగా ప్రత్యగాత్మస్వరూప సాక్షాత్కారము కలుగుట ఆరవ భూమిక. ఈ యారవభూమిక బయలుదేరనిచో దేహేంద్రియాది విక్షేప జనితమైన రతి యనిర్వాహితమై దుఃఖావస్థను తేగలదు. హృదయగ్రంథ భేదన మగు నాత్మదర్శనరూపమగు జ్ఞానమే నిఃశ్రేయసహే తువు, ప్రకృతి కంటె భిన్నము, ప్రకృతి కతీతము, నిర్గుణము, అనాది,స్వయంప్రకాశము, విశ్వమున నంతర్యామియు నగు నది ప్రత్యగాత్మ. యదృచ్ఛావశమున నీ యాత్మ గుణమయమై లీలాకారమున త్రిగుణాత్మకమగు జగమును సృష్టిలోనికి

దెచ్చునది. తద్ద్వారా జ్ఞానము నిగూహితమై ప్రత్యగాత్మ స్వయంకృతమగు నుపహితత్వము నందుచున్నదని విష్ణుపురాణ మను మన్నది. ఈరీతిగా నుపహితస్వరూపమున నున్న ఆత్మ కర్మల నాచరించుచు, గుణముల నాత్మగుణములుగా భావించగా సంసారబంధ మంకురించుచున్నది. అకర్త, సాక్షి, నిర్వ్యతాత్మయగు బ్రహ్మస్వరూపమున కర్తృత్వకము పారతంత్ర్యమపుడు భావింపబడు చున్నదని భాగవతము చెప్పుచున్నది (3. 26. 6-7). నిత్యము, అవ్యయము, శుద్ధము, ఏకము, సర్వాశ్రయము, అవిక్రియము, వ్యాపకము, అసంగము, అనావృతము, క్షేత్రజ్ఞుడు, స్వదృగ్హేతువు ఆత్మ యను పండ్రెండు లక్షణములలో ఆత్మస్వరూపమును వివేకియగు విద్వాంసుడు తెలిసికొని అహం మమాభి మానములను, మోహజనితమగు దేహేంద్రియాది సద్భావమును వదలుకొనవలెను (7. 7. 19 20). ఇట్టి శుద్ధతత్త్వమగు ఆత్మవిషయమగుటచే తత్పద మగును. ఈ తత్పదము ప్రమాత యగు త్వంపదముకంటె భిన్నము గాదని తెలియగా "తత్త్వమసి" అను మహావాక్యములో గల "నీవే బ్రహ్మవు" అను అర్థమనుభవింపబడ గలదు. ఆత్మస్వరూపము, సర్వాంతర్యామియు నగు భగవానుడు జగద్ధితము గోరి, మాయద్వారా దేహమును ధరించునని అవతారలక్షణము భాగవతమున చెప్పబడినది (10. 14. 55).

ఇట్టి జ్ఞానము భక్తివలన జన్మించునది. భక్తియోగము నవలంబించగా నిర్హేతుకమగు వైరాగ్య జ్ఞానము లుదయించ

గలవు (1.2.7). శ్రేయస్కరమగు భక్తిని నిరసించి, జ్ఞానము నందవలెనను యత్నించువారలకు క్లేశమే మిగుల గలదు (10. 14. 4). ఏతాదృశతత్త్వజ్ఞానము కలుగగా వైరాగ్యము దృఢమగును. అప్పుడు భగవంతునిపై ఉదయించిన ప్రేమ వృద్ధి పొందును. ఈ ప్రేమప్రవృద్ధి యనున దేడవ భూమిక. భగవంతుడే తన యాత్మయని గ్రహించినవానికి జగము మనకు భాసించినట్లు భాసించదు. సర్వము భగవత్పరిరంభిత మైనట్లు కన్పించును. భగవద్భావనాయుక్తు డగుటచే నట్టి వ్యక్తికి సర్వము భగవన్మయముగా ప్రతీయమాన మగును. అస్పంద ప్రణయానంద సలిలామీలితేక్షణుడై భగవంతుని తన ప్రియునిగా అనుభవించును. తద్ద్వారా మనస్సును విషయములనుండి పరాఙ్ముఖము గావించి ఉత్కృష్టమగు నిర్వృతి నందగల్గును (7. 4. 37 – 42). భగవద్రతి పెంపొందుచున్న హృదయము గలవాడు షడ్వర్గములను జయించుచున్నాడు. భగవంతుని లీలాదేహము గాలించిన పణక్రీయాదులను శ్రద్ధతో వినగా నతిహర్షోత్పుల కాశ్రుగద్గదమగు వాక్కుతో నట్టివ్యక్తి పాడుచు విలపించుచు, నర్తించును. గ్రహగ్రస్తునివలె నొకప్పుడు వర్తించును. ఒకవేళ నవ్వును. మరొకచో నాక్రందనము గావించును. వేరొకచో ధ్యానించును. ఇంకొకచో జనులకు నమస్కరించు చుండును. మాటిమాటికి భగనామమును నుచ్చరించు చుండును. అప్పుడు సమస్తబంధనముల నుండి విముక్తుడై, భగవద్భావ భావానుకృతమగు నాకయాకృతి గలవాడై, భక్తిప్రకర్షవశమున భగవానుని సమీపిం

చును. ఇట్టి బ్రహ్మస్వరూపమే నిర్వాణసుఖమని విద్వాంసు లనుచున్నారు (7. 7. 33-37). ఇంతవరకు చెప్పబడిన ఏడు భూమికలు సాధనాభ్యాసమునకు జెందినవి. ఇక చెప్పబోవు నాలుగు భూమికలు నయత్న సాధ్యములు.

భగవత్ స్ఫురణ మెనిమిదవ భూమిక. ప్రేమాస్పదీ భూతమైన భగవంతుని సాక్షాత్కారము ప్రేమాతిశయ హేతుకము. భగవత్పాద సేవాభిరతులై, భగవంతుని మాత్రమే వాంఛించు కొందరు భగవదైకాత్మ్యతను కోరుట లేదు; ఇట్టివారు భగవద్గుణ క్రియాదుల ననుకీర్తన జేయు భాగవతధర్మపరులు. భగవత్స్వరూపాదులను వర్ణించు వీరు వాక్కాయ కర్మలతో భగవంతుని భావించు పుణ్యజీవులు. భగవత్స్వరూపావగతి గల్గిన వీరు దర్శనీయావయవములలో ఉదార విలాస హాసేక్షిత వామసూక్తములతో తమ ప్రాణ ములను, ఆత్మను భగవదర్పణము చేయుచున్నారు (3. 25. 34-38). తద్ద్వారా తొమ్మిదవ భూమికయగు భగవద్ధర్మనిష్ఠ కల్గును. భగవన్న్యస్త మానసుడగు మహాభాగు డహింసా ద్యశేష గుణములతో నావహిల్లును. అప్పుడు మనస్సును సంయమించి కేవలము భగవద్ధ్యానపరు డగును. ఈ జ్ఞాన సమాధి కలుగగా నిజమగు నిఃసంగత్వము కలుగ గలదు. సప్తద్వీపవతియగు భూమండలము నంతయు జయించి, అవ్య యమగు శ్రియమును పొంది, అమలవిభవముతో తులదూగి, ఇదియంతయు స్వప్నసంస్తుతమను నిశ్చయమున కంబరీషుడు వచ్చినాడు. అప్పుడు భగవంతునియందు, సాధువులగు భగవ

ద్భక్తులయందు భగవద్బుద్ధి కలిగినవాడై ఐహికవిభవమును తుచ్ఛముగా పరిగణింప గల్గినాడు. ఆపై మనోవాక్కాయ కర్మలను భగవదర్పణము గావించి సర్వత్ర భగవద్భావము ననుభవించ సాగెను (**9. 4. 15-21**). ఈశ్వరునియందు చిత్తమును స్థిరముగా నిలపి, భగవదనుకీర్తనము జేయుచు, భగవంతునిపై ప్రేమభావమును వహించి, తద్భక్తులతో ప్రసంగించుచు, సర్వత్ర మైత్రిని పెంపొందించగా దివ్యానుభూతి కలుగగలదు (**1. 19. 15-17**). కర్మపథమున వర్తించుచున్న మానవులు మహాయోగుల నాదర్శముగా నిలపికొని, వారి అడుగుజాడలలో నడచిననే అజ్ఞానాంధకారమునుండి తరించగలరు (**11. 6. 48**). భగవద్ధర్మానుష్ఠానముతో జీవించుచు, భగవద్దాసులై జనులు విశ్వమాయను జయించగలరు (**11. 6. 46**). ఈ భగవద్ధర్మనిష్ఠ ప్రయత్నపూర్వకముగా సంభవించు సాధనము. స్వతఃసిద్ధమగు భగవద్ధర్మనిష్ఠ ఫలభూతముకాగా తొమ్మిదవ భూమికయగును.

భగవద్గుణశాలిత్వమును తనయం దనుభవించుట పదియవ భూమికగా చెప్పబడినది. భగవత్ప్రియమును మాత్ర మభిలషించు భక్తులు భద్రము, శాశ్వతమునగు స్థితిని పొందగలరు. కాని ఈస్థితి సంభవించవలె ననిన భగవద్భావమే ఆత్మలో ప్రతీయమానము కావలెను. అనగా పరమభక్తులకు భగవానుడు ప్రియతమమగు ఆత్మగను, సుతుడుగను, సఖుడగను, గురువుగను, స్నేహితుడుగను, ఇష్టదైవతముగన

ప్రతీయమాను డగును (3. 25. 37-38). ఈ యవినశ్వర భగవత్తుల్య గుణావిర్భావమే పదియవ భూమిక.

ఇక మిగిలిన భూమిక చివరకు సంప్రాప్త మగునది. ఇందు భగవంతునిపై ఉదయించిన ప్రేమ పరాంకోటి నందే పరిపుష్ట మగును. ఇది ప్రేమయొక్క పరాకాష్ఠ యనబడును. భగవంతునినుండి యెడబాటును భక్తుడు సహించజాలడు. విరహాసహిష్ణుతా రూపమగు నీ యవస్థ ప్రాణపరిత్యాగము కలుగువరకు నిలచియుండును. భగద్దర్శనములేని గోపికలకు క్షణ మొక యుగముగా పరిణమించినదట (10. 19. 16). భగవంతుని ఒక త్రుటికాలము చూడక పోయినను ఒక యుగకాలము చూడనట్లు కనుపించును (10. 31. 15.). ఒక్క క్షణము కోటివర్షములవలె భాదించునట (1. 11. 9). కాగా భగవద్దర్శన మొకసారి లభించిన, తద్విరహమున కోర్వ జాలక పోవుదురు. అప్పుడు కలుగు విప్రలంభశృంగారముద్వారా భక్త్యాత్మకమగు ప్రేమ పరమోత్కృష్టమై రాణించును.

లక్షణం భగవద్భక్తేః సాధనం సోపపత్తికమ్
సభూమికం స్వరూపఞ్చ యథాబుద్ధి హ వర్ణితమ్. ౩౫

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ మధు
సూదన సరస్వతీ విరచితే భగవద్భక్తిరసాయనే
స్వరూప భూమికా సాధన సహిత భక్తిసామాన్య
నిరూపణం నామ ప్రథమ ఉల్లాసః సమాప్తః.

భగవద్భక్తియొక్క లక్షణమును, సాధనమును ఉపపత్తి పూర్వకముగా చెప్పితిమి. తదనుగుణముగా భూమికలను, భక్తిస్వరూపమును స్వబుద్ధ్యనుసారము వర్ణించితిమి. అనంతరోల్లాసమున నీ విషయము నింక వివరించెము.

## గద్య

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ మధుసూదన
సరస్వతీ విరచిత మగు భగవద్భక్తి రసాయనమున,
ఆంధ్రవివృతియందు, స్వరూప భూమికాసాధన
సహిత మగు భక్తిసామాన్య నిరూపణ
మనబడు ప్రథమోల్లాసము
సమాప్తము.



# ద్వితీయోల్లాసము

ద్రుతే చిత్తే ప్రవిష్టా యా గోవిందాకారతా స్థిరా
సా భక్తి రిత్యభిహితా; విశేష స్త్వధునోచ్యతే. ౧

భక్తివిశేష నిరూపణము చేయగోరి మధుసూదనుడు రెండవ యుల్లాసము నారంభించు చున్నాడు. స్వాభావికముగా కఠినమైన చిత్తద్రవ్యము కామ క్రోధాది తాపకములచే ద్రవీభావము నందునని చెప్పితిమి. ఇట్లు ద్రుతమైన చిత్తమున వస్తువుయొక్క ఆకారము వినిక్షిప్తమగునని యంటిమి. అనగా చిత్తము విషయాకారమును పొందునని భావము. ఈరీతిగా భగవంతు డను విషయముపై దృష్టిని నిలుపగా ద్రుతచిత్తము భగవదాకారతను పొందును. ఈ యాకారత స్థిరముగా నుండగా, స్థాయిభావమని పిలువబడు చున్నది. ఈవిధమైన స్థాయి భావమును భక్తియని యందురు. సర్వేశ్వరుని ఉద్దేశించి వచ్చు మనోవృత్తిని భక్తియని పిలచితిమి. ఇక నీ యుల్లాసమున భక్తివిశేషమును నిరూపించ నున్నాము.

చిత్తద్రుతేః కారణానాం భేదా ద్భక్తి స్తు భిద్యతే
తా న్యక్త్వాని తు సంక్షేపాద్ వ్యాఖ్యాయంతేఽధునా
స్ఫుటమ్. ౨

చిత్త ద్రవీభావమున కనేక కారణములు గలవు. ఈ యుత్పాదక కారణములు పరస్పరము భేదించుచున్నవి. ఇందుచే తజ్జనిత మగు భక్తిగూడ అనేక రూపములుగా కన్పించుచున్నది. ఈ భిన్న కారణములను సంక్షిప్తముగా మొదటి యుల్లాసమున చెప్పితిమి. వీటినిచట వివరించబోవు చున్నాము.

కామః శరీరసంబంధవిశేషః స్పృహయాలుతా
సంనిధానా సంనిధాన భేదేన స భవే ద్ద్విధా. ౩

కామ క్రోధాదులు ద్రవీభావ కారణము లని మొదటి యుల్లాసమున చెప్పితిమి. ఇందు మొదటిది కామము. కామ మనగా స్పృహయాలుత, కోరికయని అర్థము. దేహాత్మసంబంధ వశమున ఇచ్ఛ బయలుదేరును. ఇచ్ఛ యనునది యొక పురోఽవస్థిత మగు విషయము నుద్దేశించి వచ్చునది. విషయ మెదురుగా నుండగా బయలుదేరు కామము వేరు. ఎదుట లేనపుడు వచ్చు కామము వేరు. సాన్నిధ్యమున విషయ ముండగా కలుగు కామము సంభోగాత్మకము. అసాన్నిధ్యమున విషయ మున్న విప్రలంభాత్మక మగు కామము కలుగును.

తజ్జన్యాయాం ద్రుతౌ చిత్తే యా స్యా చ్ఛ్రీకృష్ణనిష్ఠతా
సంభోగ విప్రయోగాఖ్యా రతిః సా సా క్రమా ద్భవేత్. ౪

విషయసన్నిధానమున చిత్తము ద్రవీభూతము కాగా శ్రీకృష్ణాకారతాక మగు, అనగా భగవదాకారతాక మగు చిత్తవృత్తి కలుగును. భగవదాకారత చిత్తము నావేశించును.

ఇట్లుత్పన్న మగు రతిని సంభోగాత్మక మందురు. విషయము సన్నిధానమున లేనపుడు చిత్తద్రుతి కలుగగా చిత్తము నావేశించు భగవదాకారతాక మగు రతిని విప్రలంభాత్మక మని యందురు. సామాన్యాతిశయ వినిర్ముక్త సచ్చిదానంద ఘనాత్మకముగా బ్రహ్మపదార్థము రసరూపమున ఆవిర్భవించును. చిత్తముయొక్క సహజస్వభావమే భగవదాకారతను పొందుట యని వెనుక చెప్పితిమి. ఈ భగవదాకారత ప్రతీతము కాగా శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యాది భావములు ప్రజ్వలితములై భక్తిరసమున పర్యవసితములు కాగలవు. భగవద్రూపము నేరీతిగా భజించుదుమో, అదేరీతిగా భగవానుడు ప్రతీయమాన మగును. ఇందుచే —

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"

అని చెప్పబడినది. ఏవంవిధమగు భక్తిభావము రసత్వమున పర్యవసించును. సమస్తభావములు రసమున పరిపుష్టములై, రసాభినిర్వృతి హేతుకములగునని భరతుడు సహితము నాట్యశాస్త్రమున చెప్పినాడు.

భాగవత శ్లోకములలో (10. 29. 46; 10. 30. 27) భక్తిభావము ప్రమోదాత్మకమగు రతిగా పరిణమించుట గానవగును. అనగా రతి భక్తియొక్క రూపాంతరముగా భాసించుచున్నదని భావము.

క్రోధ ఈర్ష్యా నిమిత్తం తు చిత్తాభిజ్వలనం భవేద్
తజ్జన్యాయాం ద్రుతౌ సా తు ద్వేషశబ్దేన గృహ్యతే. ౫

ఇక క్రోధము నిర్వచింపబడు చున్నది. ఈర్ష్యవలన జనించు క్రోధమున చిత్తము జ్వలించును. పరుని అభ్యుదయాధికమును సహించజాలక పోయినపుడు కలుగు అసూయ ద్వారా మనస్సు దీప్తావస్థను జెందును. క్రోధమున బయలు దేరు చిత్తద్రుతియందు కలుగు భగవదాకారత ద్వేష పద వాచ్యమగును.

అత్ర చేతో వ్యాకులత్వం సోపద్రావకదర్శనాత్
ఉపద్రావకనాశార్థం తత్ప్రీత్యర్థం చ తద్ద్విధా. ౬

ద్వేషము కలుగునపుడు చిత్తవిక్షేపము కన్పించును. ఉపద్రావక దర్శనమున కలుగు మనస్తపనాదికము నివృత్తించవలెననిన, తద్విషయము నివృత్తించవలెను. ఒకవిషయముపై ద్వేషము కల్గినచో నావిషయము నశించిననే ద్వేషము నశించగలదు. విషయనాశమున మనఃప్రీతి కల్గును. ఒక్కొక్కపుడు చిత్తప్రీతికై చిత్తవ్యాకులత్వము బయలుదేరుట గూడ గలదు.

తత్రాద్యం ద్వేష ఏవ స్యా ద్ద్వితీయం రతిశబ్దభాక్
ఉపరిష్టా త్త దుభయం మయా స్పష్టీకరిష్యతే. ౭

ఉపద్రావక నాశము నభిలషించు క్రోధమును ద్వేషమని యందురు. ఉపద్రావక ప్రీత్యర్థకమగు క్రోధమును రతి యందురు. ఈ రతిని విప్రలంభరూపముగా గ్రహించవలెను. కించి ద్వ్రప్రియ దర్శన శ్రవణాదులద్వారా వచ్చు ఈర్ష్యాక షాయితత్వమును విప్రలంభ విశేషతా ప్రయోజకముగా స్వీకరించవలెను. ఈవిషయము నిరువది తొమ్మిదవ కారిక

యందు, ముప్పదియొకటవ కారికయందు, వివరింపబడగలదు. భగవద్విషయక మగు నీర్ష్యచే ప్రదీప్తచేతస్కుడైన శిశుపాలుని ద్వేషము మనకు తెలిసినదే (10. 74. 30) కాని—

"రాధామంజులమందిరా దుపగత శ్చంద్రావలీ మూచివాఞ్
రాధే! క్షేమ మిహేతి తస్య వచనం శ్రుత్వాఽఽహ చంద్రావలీ
కంస! క్షేమ మయే విముగ్ధహృదయే! కంసః క్వ దృష్ట స్త్వయా
రాధా క్వేతి విలజ్జితో నతముఖః స్మేరో హరిః పాతు వః"

అను శ్లోకమున ప్రీతిప్రయోజక మగు నీర్ష్య గలదు.

ద్వేషా హేతుః స్వమంతూత్థం వైక్లవ్యం చిత్తగం తు యత్
తజ్జన్యాయాం ద్రుతౌ యాఽఽస్తే రతిః సా భయ ముచ్యతే. ౮

ఇక భయమును నిర్వచించుచున్నాడు. ద్వేషము, భయము అనునవి రతి యను స్థాయిభావము నాశ్రయించుకొని వచ్చునవి. కాని ఈ రతి వీటితో మిశ్రితమై యుండుటచే నిది శుద్ధము కాజాలదు. చిత్తవ్యాకులత్వమునకు రతివిరోధినులగు భావాదులు ద్వేషమున గలవు. ప్రీత్యర్థకమైన ద్వేషముచే విప్రలాభయోగ్య మగు రతి స్థాయిభావము గాగలదు. ఉపద్రావక నిరాసార్థక మగు ద్వేషమున రతి యను భావమునకు స్థాయిత్వము లేదు. ఇట్లే భయమున సహితము సంకీర్ణ మిశ్రితముగా గాని, కేవల మిశ్రితముగా గాని రతికి స్థాయిత్వము నంగీకరించవలెను. చిత్తగతము, నిజాపరాధజనితము నగు వైక్లవ్యము విజాతీయ త్రాస విశేషమై, మృత్యు శర

ణాను సంహితాద్యాడి జనకమైన రతి యను భావము భయానక భక్తిరసముగా పరిణమించును. ద్వేషము తాపకమై చిత్తద్రవ శోషణముగా వర్తించుటచే ద్వేషజనకత్వమున నిట్లు రతి పరిణమించ జాలదు.

స్నేహః పుత్రాదివిషయః పాల్యపాలకలక్షణః
సేవ్యసేవకభావోఽన్యః సోఽప్యుక్త స్త్రివిధో బుధైః. ౯

పుత్రాదివిషయకము, పాల్యపాలకభావమునై వ్యక్త మగునది స్నేహమను భావము. పుత్రాదుల నుద్దేశించి, వారిని రక్షించుటయందు కనబడున దీ భావము. సేవ్య సేవక భావమున కన్నడు స్నేహము దీనికన్న విలక్షణము. సేవ్య సేవక భావరూపము గూడా చెప్పబోవు మూడు విధములుగాగలదు.

భగవద్దాస్య సఖ్యాభ్యాం మిశ్రితం చాపరం జగుః
యా కృష్ణాకారతా చిత్తే తజ్జన్యద్రుతిశాలిని. ౧౦

పాల్య పాలక భావేన సా వత్సలరతి ర్భవేత్
సేవ్య సేవక భావేన ప్రేయో రతి రితీర్యతే. ౧౧

భగవంతుని దాస్యబుద్ధితోను, సఖ్యబుద్ధితోను గూడ భజించవచ్చును. దాస్యబుద్ధి, సఖ్యబుద్ధికలసిన నొకవిధ మగు సేవ్య సేవకభావము రాగలదు. ప్రీతిస్థాయిక మైనది దాస్యరస మని, విశ్రంభస్థాయిక మైనది సఖ్య మనబడు ప్రేయోరసమని రసజ్ఞులనినారు. ప్రభుతాజ్ఞాన, నిబంధన, సాదర, చాంచల్యా త్మక సంభ్రమ స్థాయిక మైనది దాస్యము. ముక్తసంభ్రమ,

గాఢవిశ్వాస, ప్రాణవిశ్రంభ స్థాయిక మైనది సఖ్యము. ఈ సంభ్రమ విశ్రంభ ప్రయుక్త మైన ద్రవచిత్తమున క్రమముగా భగవదాకారత ప్రవేశించగా సంభ్రమరతి, విశ్రంభరతి బయలు దేర గలవు.

పాల్య పాలక రూపమగు స్నేహములో ద్రుతచిత్తము విషయాకారమును పొందగా వాత్సల్యరతి కన్పించును. సేవ్య సేవక భావములో ద్రుతచిత్తము విషయాకారము నందగా ప్రేయోరతి కన్పించును.

హర్ష శ్చిత్తసముల్లాసః కథ్యతే స చతుర్విధః
ఏకః పరానందమయః శ్రీశమాహాత్మ్యకారణమ్. ౧౨

ఇక హర్షము నిర్వచింపబడు చున్నది ఇష్టవిషయ ప్రాప్తిలో కలుగు సుఖవిశేషమే హర్షము. చిత్తసముల్లాసాత్మక మగు హర్షము నాల్గు విధముల గలదు. ఇందు మొదటిది పరానందమయము. నిరతిశయానంద ప్రచుర మైన ఈహర్షము శ్రీశమాహాత్మ్య కారణము. మాహాత్మ్యరూపమగు విషయము యొక్క జ్ఞానము మానవునకు హర్షమున కలుగగలదు. ఈ హర్షము భగవ న్మహాత్మ్యానుభవ జనకత్వ యోగ్యము.

తజ్జన్యాయాం ద్రుతౌ శుద్ధా రతి ర్గోవిందగోచరా
ఏతదంతం హి శాస్త్రేషు సాధనామ్నా న మిష్యతే. ౧౩

హర్షమువలన కలుగు చిత్తద్రుతియందు భగవద్విష యకమగు రతి శుద్ధమై, సంకర మిశ్రణాది రహితమై భాసిం

చును. పరమ పురుషార్థోప లబ్ధ్యుపాయ ప్రతిపాదకము లగు శాస్త్రములయందే నిశ్చయముగా పరమపురుషార్థప్రాపకము లను గూర్చిన ఉపదేశము కన్పించును. ఇట్టి ఉపదేశము పూర్వోక్తహర్షమున గలదు గనుక నీ హర్షరూపము ప్రధాన మగును. కావుననే భాగవత (5. 5. 5-6) మీ హర్ష ప్రాధాన్య మును ప్రస్తావించుచున్నది.

వ్రీడావికృత వాగ్వేష చేష్టాఽఽది జనితోఽ పరః
తజ్జన్యాయాం ద్రుతౌ చేతో వికాసో హాస ఉచ్యతే. ౧౪

హర్షముయొక్క ద్వితీయరూప మిచట చెప్పబడు చున్నది. సిగ్గుచే వికృతమైన వాగ్వేష చేష్టాదులద్వారా జన్మించు హర్షము రెండవది. ఈహర్షమువలన కలుగు చిత్త ద్రవీభావమున చిత్తవికాసరూప మగు హాస మున్నది.

లోకోత్తర చమత్కారి వస్తు దర్శనజః పరః
తజ్జన్యాయాం ద్రుతౌ చేతోవికాసో విస్మయో యతః. ౧౫

అస్వాభావికము, అలౌకికము, సుఖవిశేషజనకము నగు వస్తుజ్ఞానమువలన నుద్భవించు హర్షము మూడవది. ఈహర్ష జనితమగు చిత్తద్రుతియందు చిత్తవికాస రూప మగు విస్మ యము గలదు.

యుద్ధాది తాప జనితో వీరాణాం జాయతే పరః
జితచిత్తస్య విస్తారో ద్రుత స్యోత్సాహ ఉచ్యతే. ౧౬

యుద్ధము మొదలగువాని ప్రజ్వలనముద్వారా శూరులకు జన్మించు హర్షము నాల్గవది. జితునిచిత్తము ద్రవీభూతమైనచో కన్పించు చిత్తవిస్తార రూపమగు ఉత్సాహ మిచట గలదు.

ఇష్టవిచ్ఛేదజనితో య శ్చిత్తే క్లిష్టతోదయః
తజ్జన్యాయాం ద్రుతౌ విస్తారతతా శోక ఉచ్యతే. ౧౭

శోకము నిక చెప్పుచున్నాము. ఇష్ట విషయమునుండి వియోగము కలుగ సంభవించు చిత్తవ్యాకులత్వమును శోకమని యందురు. ఈ శోకజనితమగు ద్రుతచిత్తమున ప్రవేశించు రతిభావమే శోకము. రతి యను భావము నాధారముగా జేసికొని శోకము వచ్చును.

దయా ఘృణా స్యా ద్విషయతుచ్ఛత్వ జ్ఞాన దీర్ఘికా
తయా ద్రుతే తు మనసి జుగుప్సా జాయతే త్రిధా. ౧౮

చిత్తద్రావకము లని కొన్నింటిని నిర్దేశించితిమి. ఇచట సందర్భశుద్ధ్యర్థము దయ నిర్వచింపబడు చున్నది. విషయములు క్షుద్రములను జ్ఞానము కలుగగా గొప్ప దయ బయలుదేరును. విషయములను గూర్చిన తుచ్ఛత్వజ్ఞానము ఉద్వేజకత్వ, క్షోభకత్వ, వివేకానాస్పదత్వ రూపములతో మూడు విధముల కలుగుచున్నది. ద్రుతచిత్తమున జుగుప్స సహితము మూడు విధములుగా గలదని వ్యవహరించు చున్నారు. ఈ మూడు విధములు తర్వాతి రెండు కారికలలో నీయబడినవి.

పూతి వ్రణాది విషయే కథితోద్వేగినీ బుధైః
శ్మశానోత్థ పిశాచాది విషయా క్షోభిణీ భవేత్. ౧౯
దేహేంద్రియాదిదుఃఖే త్వవిచారణపురఃసరా
ఘృణా శుద్ధేతి కవిభిః సా జుగుప్సా ప్రకీర్తితా. ౨౦

దుర్గంధము, వ్రణములు మొదలగు విషయములపై కలుగు జుగుప్స లేక ఏవగింపు, ఉద్వేగిని యనబడును. శ్మశానము, పిశాచములు మొదలగు విషయములపై కలుగు ఏవగింపును క్షోభిణీ యందురు. శరీరేంద్రియాది నిబంధనమైన దుఃఖమును విషయముగా గలిగిన జుగుప్స వివేకరాహిత్యమును పురస్కరించుకొని కలుగును. బాహ్యోపాధి సంపర్కము లేకపోవుటచే నీ యవివేకపురస్సర మగు జుగుప్సను శుద్ధ మగు దయ యని పిలుతురు.

యా తు శోచ్యస్య రక్షార్థం ప్రవృత్తి రనుకంపయా
తయా ద్రుతే తు మనసి దయోత్సాహః స్మృతో బుధైః.

ప్రసంగవశమున ఉత్సాహరూపములను చెప్పదలచి మొదట దయోత్సాహము నిట నిర్వచించు చున్నాము. దయనీయమగు విషయమును రక్షించుటకై కలుగు కృపాసహిత మగు ప్రవృత్తియందు చిత్తద్రుతి కలుగ దయోత్సాహము బయలుదేరును.

సర్వస్వ మపి దాస్యామి ప్రార్థయేతి చ యో మహాన్
ఉద్యమో ద్రుతచిత్తస్య దానోత్సాహః స ఉచ్యతే. ౨౧

స్వాభీష్టవస్తువు నర్థించగా తదర్థము సమస్తమును దానము చేయవలె నను ప్రశంసనీయమగు ఉత్సాహ మెవనికి కల్గునో అట్టివానికి దానోత్సాహము గలదని యనవలెను.

తథా స్వధర్మరక్షార్థం యా ప్రవృత్తిః ప్రయత్నతః
తయా చిత్తస్య విస్తారో ధర్మోత్సాహో ద్రుతే భవేత్.

స్వధర్మమును ప్రయత్న పూర్వకముగా చేతనైనంత వరకు రక్షించుకొన వలెనను ప్రవృత్తి గలవాని ద్రుతచిత్తమున చిత్తవిస్తార రూప మగు ధర్మోత్సాహము ప్రతీయమాన మగును.

వశీకారాఖ్య వైరాగ్యం యత్ కామాస్పృహాత్మకమ్
తేన ద్రుతస్య చిత్తస్య ప్రకాశః శమ ఉచ్యతే. ౨౪

శమమను భావ మిక నిర్వచింపబడు చున్నది. కామనా విషయము లేకపోవుటచే హృదయము రాగశూన్య మగును. ఐహికాముష్మిక విషయములపై వాంఛ లేని వీతరాగునకు వశీకారవైరాగ్యము గలదని వెనుక జెప్పితిమి. ఈ వైరాగ్య మూలకముగా ద్రవీభూతమైన చిత్తమున కన్పించు చిత్త ప్రకాశమును శమమని వ్యవహరింతురు.

ఇతోఽన్యథా తు చిత్తస్య న ద్రుతి ర్విద్యతే క్వచిద్
తదభావా త్తు భావో న నిరుక్తానోఽస్తి కశ్చన. ౨౫

కామ, క్రోధ, భయ, స్నేహ, హర్ష, శోక, దయా, శమములచే చిత్తము ద్రవీభావము నందుచున్నది. వీటికంటె

భిన్నమగు ప్రకారములద్వారా చిత్తద్రుతి కలుగ నేరదు. ఈ ఎనిమిదింటికన్న విలక్షణమగు స్థాయిభావము లేదని భావము. స్థాయిభావము లేనిచో రసము నిష్పన్నము కాజాలదు. భక్తిరసమునకు భగవద్విషయకమగు రతి యవసరమని చెప్పితిమి. స్థాయిభూతమగు రతియందు చిత్తము భగవదాకారతాక మగును. ఇట్లగుటకు చిత్తద్రుతి యవసరము. చిత్తము ద్రవించుటకు తాపకద్రవ్యములు కావలెను. కామాదులగు పైన జెప్పిన అష్టభావములే తాపకము లగుచున్నవి. వీటికంటె భిన్నమైన స్థాయిభావము లేదనవలెను.

యావత్యో ద్రుత యశ్చిత్తే భావాస్తావంత ఏవహి
స్థాయినో, రసతాంయాంతి విభావాది సమాశ్రయాత్. ౨౬

చిత్తద్రుతు లెన్ని తెరగుల గలవో, అన్ని భావములే కలవని యెంచవలెను. అనుగతములగు కామాద్యుపాధులచే నుపహితము లైనవి చిత్తవృత్తు లగుటచే, చిత్తద్రుతు లసంఖ్యాకములుగావని, భావముల సంఖ్యనే చిత్తద్రుతులసంఖ్యగా గూడ నెంచవలెనని నిశ్చయించుచుంటిమి. చిత్తద్రుతులకంటె నభిన్నములగు స్థాయిభావముల సంఖ్య సహితమిట్లే నిశ్చితమగుచున్నది. ఈ స్థాయిభావములకు విభావాది సంయోగము కలుగ రసత్వము సిద్ధించుచున్నది. ఏ భావము మాత్రమే రసముగా పరిణమించ గలదో, ఆ భావమునే స్థాయిభావమని వ్యవహరించవలెను.

ఇక చిత్తద్రుతి సామాన్యము లగు స్థాయిభావములకు భగవద్విషయక మగు రసత్వ మెట్లు సిద్ధించునో చెప్పబోవు చున్నాడు.

ధర్మోత్సాహో దయోత్సాహో జుగుప్సా త్రివిధా శమః
షడ ప్యేతే న విషయా భగవద్విషయా న హి. ౨౭

ధర్మోత్సాహము, దయోత్సాహము, త్రివిధముగా నున్న జుగుప్స, శమము అను నారు భావములు విభావాను భావ సంచారిభావములతో సమన్వితములై, పరిపుష్టములు కాగా లౌకిక రసములుగా పరిణమించు చున్నవి, లౌకికరసాస్వాద యోగ్యములగు భావములకు భక్త్యంగత్వము కుదురదు. ఈ భావమును తర్వాతిశ్లోకమున దృఢపరచు చున్నాడు.

ధర్మవీరో దయావీరో భీభత్సః శాంత ఇత్య మీ,
అతో న భక్తిరసతాం యాంతి భిన్నాస్పదత్వతః. ౨౮

ధర్మానుబంధి యగు వీరరసము, దయానుబంధి యగు వీరరసము, జుగుప్సాత్రయాత్మక మగు త్రివిధ భీభత్సరసములు శాంతము అను నారు రసములు భక్తిరసముగా పరిణమించ జాలవు. వీటియందు భజనీయ మగు నాలంబన విభావము లేక పోవుటయే ఇందులకు ప్రబల హేతువు.

“ రాజ్యము, ధనము, దేహము, భార్య, సోదరులు, పుత్రులు, ఈ లోకమున నేను చేకూర్చినది మొదలగునవి యన్నియు సర్వదా ధర్మమునకై ఉద్యతములై యున్నవి. ”

అని పలికినపుడు యుధిష్ఠిరునకు కలిగిన ఉత్సాహము ధర్మ విషయకమే గాని, భగవద్విషయకము గాదు. "దినావసాన మగుటచే దీనిలేగదూడ తల్లికై ఉత్సుకురా లగును గనుక నీ వసిష్ఠమహర్షి యొక్క ధేనువును వదలి, నాశరీరమును భక్షించి నీ యాకలిని బాపికొనుము." అని సింహమును గూర్చి దిలీపుడు పల్కినపుడు కన్పించు ఉత్సాహము ధేనువిషయకమైన దయకు జెందినది. ఇట్లే ఉద్వేగిని యగు జుగుప్సనుండి, క్షోభిణియగు జుగుప్సనుండి, దుఃఖనిబంధనమగు శుద్ధజుగుప్స నుండి, జన్మించు బీభత్సరసమున కాలంబన విభావము బాహ్య జగములోని విషయరూపమున గలదు. శాంతమును శృంగారాది రసములవంటి రసముగా గ్రహించినచో శాంతమునగూడ నిట్టి స్థితియే కన్పించును.

శాంతము రసమా కాదా? యను చర్చ నాలంకారికులు జరిపియున్నారు. శృంగారము, హాస్యము, కరుణ, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము నను ఎనిమిది రసములు గలవు. వీటిలో శృంగార, హాస్య. కరుణ, అద్భుతములు ప్రధానములు. మిగిలిన రసముల నన్నింటిని వీటియం దంతర్భూతములుగా గ్రహించ వచ్చును. కాని శాంతరస మిట్లు అంతర్భూతమగునని చెప్ప వీలులేదు. శాంతము రసమే కాదని కొందరు, తొమ్మిదవ రసమని కొందరు వాదించి యున్నారు. సాహిత్యమున [illegible]మని శాంతరసోపక్షేపకమై నాట్యశా[illegible] వాదించిన వాడు భట్టనాయకుడు. ఈ వాదము నంగీకరించిన అభినవ

గుప్తుడు శాంతమే రసమని, మహారసమని, ప్రస్తుతించెను. శృంగారాద్యష్టరసములవంటిది శాంతము గాదని స్పష్టము. (* మూడవ అనుబంధము చూడుడు.)

ఏవంవిధ మగు శాంతము భక్తిరసమున సహితము ప్రతీయమానము కావలె ననిన భక్తి యనునది రసము గావలెను. భక్తిరసమునకు భగవద్విషయక మగు రతియే స్థాయిభావము. ఈరతిని శుద్ధసత్త్వవిశేషాత్మక మగు రతియని గ్రహించవలెను. ఇట్టి రతియందు పైన నివరింపబడిన శమమే భాసించును. శమాత్మక మగు రతియే భగవద్విషయకమై భక్తిరస మనబడు చున్నది. ఇదే సందర్భమున—

అక్షరం పరమం బ్రహ్మ సనాతన మజం విభుమ్
వేదాంతేషు వదం త్యేకం చైతన్యం జ్యోతి రీశ్వరమ్.
ఆనందః సహజ స్తస్య వ్యజ్యతే స కదాచన
వ్యక్తిః సా తస్య చైతన్య చమత్కార రసాహ్వయా."

అను అగ్నిపురాణశ్లోకముల ననుసంధింపవలెను. ఈ భక్తిరసము దాస్య, సఖ్య, వాత్సల్య రూపములతో గూడ కన్పించుట గలదు.

ఈర్ష్యాజ భయజ ద్వేషౌ భగవద్విషయా వపి,
న భక్తిరసతాం యాతః సాక్షా ద్భుక్తివిరోధతః. ౨౯

ఈర్ష్యాజనిత మగు ద్వేషమున, భయజనితమగు ద్వేషమునగూడ ద్వేషింపబడు విషయము భగవంతుడైనను ఈ

ద్వేషములు చిత్తద్రవీకరణకు నాకూ ద్విరోధు లగుటచే నివి భక్తిరసములోనికి పరిణమించ లేకున్నవి. జుగుప్సాదులలో చిత్తద్రుతి యున్నను భగవంతు డను నాలంబన విభావము లేకపోవుటచే జుగుప్సాదులు భక్తిరసముగా పరిణమించలేవు. పైనజెప్పిన రెండు విధములగు ద్వేషములు భగవద్విషయకము లైనను, చిత్తద్రుతిరహితము లగుటచే భక్తిరసముగా మారుట లేదని తాత్పర్యము. చిత్తద్రుతి, భగవద్విషయకత్వము అను రెండును భక్తిరసమున కవసర మైనవి.

శుద్ధో రౌద్రరస స్తత్ర తథా రౌద్రభయానకః,
నాస్వాద్యః సుధియా ప్రీతివిరోధేన మనా గపి. 30

శుద్ధ మగు ఈర్ష్యనుండి జన్మించిన క్రోధమును స్థాయి భావముగా గల్గిన రౌద్రరసము, ఈర్ష్యాజనితమగు ద్వేషముతో సంకీర్ణమైన భయమును స్థాయిగా గల్గిన రౌద్రభయానకము గూడ రసములు కాగలవే కాని భక్తిరసముగా పరిణమించ జాలవు. ఈ రెండు రసములయందు విషయముపై ప్రీతి కన్పించకపోవుటయే ఇందులకు కారణము. కావుననే ప్రీతి నాదరించు భక్తు లీ రసముల నాస్వాదింప లేకున్నారు.

కామజే ద్వే రతీ శోకః ప్రీతి భీ విస్మయ స్తథా,
ఉత్సాహౌ యది దానే చ భగవద్విషయా అమీ. 31

సంభోగవిప్రలంభ రూపమగు రతిద్వయము, శోక, ప్రీతి, భయ, విస్మయ, దాన, ఉత్సాహములు నను భావములు మాత్రమే భగవద్విషయకము లైనవి.

వ్యామిశ్రభావరూపత్వం యాంత్యేతే క్షీరనీరవత్,
విభావాదిసమాయోగే తథా భక్తిరసా అపి ౩౨

పై శ్లోకమున చెప్పబడిన భావములకు విభావానుభావ సంచారి భావములతో సంయోగము కలుగగా నివియన్నియు పాలు, నీరు కలసి పోవునట్లు వ్యామిశ్రితము లగుచున్నవి. అప్పుడే ఇవి రసములు కాగలవు. ఇవి భగవద్విషయకము లైనచో భక్తిరసములని వ్యవహరించబడు చున్నవి.

శృంగారః కరుణో హాస్య స్తథా ప్రీతి ర్భయానకః,
అద్భుతో యుద్ధవీర శ్చ దానవీరశ్చ మిశ్రితాః. ౩౩

శృంగార, కరుణ, హాస్య, ప్రీతి, భయానక, అద్భుత, యుద్ధవీర, దానవీరములయందు ఆయా స్థాయిభావములు తత్తదుచిత విభావములతో వ్యామిశ్రితములై ఈ రసములుగా నిష్పన్నము లగుచున్నవి. వ్యామిశ్రితత్వమున నీటిని పాలనుండి ఎట్లు వేరుచేయజాలమో, అట్లే ఈభావములను వేరుపరచలేమను నర్థము కలదు.

శుద్ధా చ వత్సల రతిః ప్రేయోరతి రితి త్రయీ,
భావాంతరామిశ్రితత్వా దమిశ్రా రతి రుచ్యతే. ౩౪

శుద్ధరతి, వత్సలరతి, ప్రేయోరతి, యని మూడు విధములుగా రతి యను భావము మూడు రసములలోనికి పరిణమించు చున్నది. ఈభావము లన్యభావములతో వ్యామిశ్రితములు గాకపోవుటచే నిచటగల రతిని అమిశ్రరతి యనవలెను.

విశుద్ధో వత్సలః ప్రేయానితి భక్తిరసా స్త్రయః,
రసాంతరామిశ్రితా స్తే భవంత పరిపుష్కలాః. ౩౫

శుద్ధరతినుండి విశుద్ధరసము, వత్సలరతి యను స్థాయి భావమునుండి వత్సలరసము, ప్రేయోరతి స్థాయిభావజన్యమై ప్రేయోరసము నిష్పన్నము లగుచున్నవి. వీటి స్థాయిభావము లన్యభావములతో మిశ్రితములు గానట్లే ఈరసములు గూడ నన్యరసములతో మిశ్రితములు గాకపోవుటచే వీటిని నిసర్గపూర్ణ స్వభావకము లనవలెను.

శృంగారో మిశ్రితత్వేఽపి సర్వేభ్యో బలవత్తరః,
తీవ్ర తీవ్రతరత్వం తు రతే స్తత్రైవ వీక్షతే. ౩౬

కేవల సంకీర్ణ మిశ్రితము, స్వేతర కేవల మిశ్రితము, శుద్ధము నగు రసము లన్నిటికంటె కామమిశ్రితమైన శృంగారము నిరతిశయ చమత్కారాత్మక మగుటచే బలవత్తరము. సంభోగ శృంగారమున తీవ్రముగను, విప్రలంభ శృంగారమున తీవ్రతరముగను రతి యుండును. పూర్వ రాగమున రతి తీవ్రతమమై యుండును.

కేచి త్కేవలసంకీర్ణాః కేచి త్సంకీర్ణమిశ్రితాః
కేచి త్కేవలమిశ్రా శ్చ శుద్ధా శ్చ స్యు శ్చతుర్విధాః. ౩౭

రసములు నాలుగు విధముల గలవు. ఒకభావమునకు అన్యభావసంయోగము కలుగగా వచ్చు రసము కేవలసంకీర్ణము. ఒకభావ మన్యభావముతో సంకీర్ణమైన సంకీర్ణమిశ్రిత

మగు రసము రాగలదు. రతికి భావాంతర యోగము కల్గిన కేవలసంకీర్ణమగు రసము రాగలదు. భావాంతర సంకీర్ణ మీరతికి కలుగగా, అనగా భగవద్భిన్నమగు నాలంబనము రాగా సంకీర్ణమిశ్రిత రసము వచ్చును. భగవద్విషయక మైనను రతికి భావాంతరసంయోగము కలుగ కేవలమిశ్రితరసము నిష్పన్న మగును. భావాంతర సంయోగము లేనిచో శుద్ధరస ముత్పన్న మగును.

తత్ర కేవలసంకీర్ణా రౌద్రో రౌద్రభయానకః,
ధర్మవీరో దానవీరో భీభత్సః శాంత ఇత్యపి. ౩౮
మిశ్రా ఏవాన్యవిషయాః ప్రోక్తాః సంకీర్ణమిశ్రితాః,
భగవద్విషయా స్తే తు ఖ్యాతాః కేవలమిశ్రితాః. ౩౯
శుద్ధా స్త్రయః పురైవోక్తాః సంకీర్యంతే న కేనచిత్,
ఏవం నిరూపితా భక్తిః సంక్షేపా దుచ్యతే పునః. ౪౦

క్రోధ, భయ, ఉత్సాహ, జుగుప్సా, నిర్వేదము లన్య భావములతో సంయోగమునందిన రౌద్రము, రౌద్రభయానకము, ధర్మ దాన వీరములు, భీభత్సము, శాంతము అను కేవల సంకీర్ణరసములు క్రమముగా నిష్పన్నము లగుచున్నవి. వీటికి ఆలంబనవిభావ మవసరము. భగవదాలంబనము లైనచో నివి కేవల మిశ్రితము లగునని, భగవద్భిన్నాలంబనకము లైనచో నివి సంకీర్ణ మిశ్రితములని తెలియవలెను. భావాంతరసంయోగము పొందక, భగవద్విషయము లై యున్నచో నివి శుద్ధము లనబడు చున్నవి.

ఇట్లు సంక్షిప్తముగా చెప్పబడిన భక్తి నిక ముందు వివరించ బోవుచున్నాడు.

రాజసీ తామసీ శుద్ధసాత్త్వికీ మిశ్రితా చ సా,
ఈర్ష్యాజ ద్వేషజాఽఽద్యా స్యా ద్భయజ ద్వేషజాపరా.
హర్షజా శుద్ధసత్త్వోత్థా కామశోకాదిజే తరా,
సత్త్వజత్వేతు సర్వాసాం గుణాంతరకృతాభిదా. ౪౨

రజోగుణ ప్రధానము, తమోగుణ ప్రధానము, శుద్ధ సత్త్వగుణ ప్రధానము, ఏతద్గుణ మిశ్రితముననిభక్తి నాలుగు విధములగలదు. ఈర్ష్యాజనితమగు ద్వేషమునుండి వచ్చునది రాజసీభక్తి. భయజనితమగు ద్వేషమునుండి వచ్చునది తామసీభక్తి. హర్షజనితమైనది సాత్త్వికీభక్తి. కామశోకాది జనితమైనది మిశ్రితమైన భక్తి. ఈరీతిగా సాంఖ్యమతాను సారము నాలుగు విధముల భక్తి కన్పించుచున్నది. ఈభక్తి విధములన్నియు సత్త్వగుణజనితము లైనను, ఏభక్తిలో నేగుణ మధికముగా కన్పించునో ఆగుణవిశిష్టమైనదా భక్తియని తెలియవలెను.

తత్ర తే రతితాం నైవ యాతః సుఖవిరోధతః,
రతిశబ్దంతు భజతః సుఖమయ్యా పరే ద్రుతీ. ౪౩

ఈనాలుగు విధములుగా నున్న భక్తియందు భిన్నము లగు స్థాయిభావములు గలవు. రాజసీభక్తి, తామసీ భక్తి యనునవి సుఖవిరోధియగు దుఃఖముతో గూడిన ద్వేషాదులచే

సంవలితము లగుటచే రతిస్వభావము నెన్నటికిని పొందజాలవు. మిగిలిన రెంటియందు సత్త్వము ప్రధానముగా గలదు గనుక నివి సుఖమయములు. వీటియందు మాత్రమే రతిస్వభావము కన్పించును. పతంజలి సహితము "సుఖానుశాయీ రాగః", "దుఃఖానుశాయీ ద్వేషః" అనినాడు.

భక్తి శ్చతుర్విధా ప్యేషా భగవద్విషయా స్థిరా,
దృష్టాదృష్టోభయై కైకఫలా భక్తి స్త్రిధా భవేత్. ౨౨

చతుర్విధ మగు భక్తిని ప్రకారాంతరమున త్రివిధముగా గ్రహించ వచ్చును. భగవద్విషయక మైస్థిరముగా నున్న భక్తి దృష్టాదృష్టోభయ ఫలా యని, దృష్టమాత్ర ఫలా యని, అదృష్టమాత్రఫలా యని మూడు విధములు.

రాజసీ తామసీ భక్తి రదృష్టఫలమాత్రభాక్,
దృష్టాదృష్టోభయ ఫలా మిశ్రితా భక్తి రిష్యతే. ౨౩

రాజసీభక్తికి, తామసీభక్తికి కేవల మదృష్టఫలమే గలదు. మిశ్రితమైన భక్తికి దృష్టాదృష్టోభయ ఫలమే గలదు.

శుద్ధ సత్త్వోద్భవాఽప్యేవం సాధకే ష్వస్మదాదిషు,
దృష్టమాత్రఫలా సా తు సిద్ధేషు సనకాదిషు. ౨౪

దృష్టాదృష్టోభయ ఫలరూపమగు భక్తి శుద్ధసత్త్వ మగు భక్తిగాగూడ కన్పించ వీలున్నది. ఈవిధమైన భక్తి ద్వారా సుఖరూపమగు దృష్టఫలము, అభ్యుదయ నిఃశ్రేయ సాది రూపమగు నదృష్టఫలము సాధకులకు కలుగుచున్నవి.

నైసర్గికముగా నాప్తకాములైన సిద్ధులగు సనకాదులకు భక్తి ద్వారా దృష్టమాత్రఫలమే లభించుచున్నది. భజనీయమగు భగవత్స్వరూపమే లోకోత్తర శక్తియై ఆత్మారాములగు సిద్ధులను సహిత మాకర్షించు చున్నది.

దృష్టాదృష్టఫలా భక్తిః సుఖవ్యక్తే ర్ద్విధే రపి,
నిదాఘదూనదేహస్య గంగాస్నానక్రియా యథా. ౪౭

భక్తిద్వారా సుఖాభివ్యక్తి ప్రత్యక్షముగా ననుభూత మైనచో నీ సుఖమును దృష్టఫల మందుము. "ఆత్మే త్యేవో పాసీత" అను నుపనిషద్వాక్యములు,

"తస్మా ద్భారత! సర్వాత్మా భగవాన్ హరి రీశ్వరః,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్య శ్చేచ్ఛతాఽభయమ్."

అను భాగవతాది వచనములు సుఖప్రాప్తిని ఫలముగా గలవిధులను విధించుచున్నవి. భక్తిఫల మభయప్రాప్తి. ఎండలో నలసిపోయిన వానికి గంగాస్నాన మెట్లు సుఖకర మగుచు దృష్టఫలము నొసగుచున్నదో, అట్లే భక్తిగూడ దృష్టఫలము నీయ గల్గుచున్నది. ఈ దృష్టఫలముతో బాటు అభయత్వాది రూపమగు నదృష్టఫలమును గూడ భక్తి తీసికొని రాగల్గు చున్నది.

రజస్తమోఽభిభూతస్య దృష్టాంశః ప్రతిబధ్యతే,
శీతవాతాతురస్యేవ నాదృష్టాంశస్తు హీయతే. ౪౮

రజస్తమోగుణములచే నభిభూత మగు సత్త్వగుణము గలవానికి దృష్టఫలము విరుద్ధ మగుచున్నది. వర్తమాన దేహ సమాశ్రయమై కర్మ లాచరింప బడుచున్నవి. ఈ కర్మ ఫలోపభోగము ప్రారబ్ధకర్మవశ మగుటచే నీ ప్రారబ్ధకర్మ దృష్ట ఫలమునకు ప్రతిబంధక మగును. ఈరీతిగా నదృష్టఫలభాగము నిరోధింపబడజాలదు. కలుగబోవు జన్మలో నీ యదృష్టఫలము ననుభవించుటకు ప్రారబ్ధకర్మ ప్రతిబంధకముగా నుండక, సహకారి యగుచున్నది. శీతవాతాదులచే బాధింపబడువానికి గంగాస్నానమున సుఖము కలుగదు. ఇట్లే ఆముష్మిక మగు అభ్యుదయాదికము నశించదని తాత్పర్యము.

తత్రైవ జీవన్ముక్తానా మదృష్టాంశో న విద్యతే,
స్నాత్వా భుక్తవతాం భూయో గంగాయాం క్రీడతాంయథా.

రజస్తమో గుణములచే నభిభూతు లైనవారికి దృష్ట ఫలము లేనట్లు, జీవన్ముక్తుల కదృష్టఫలములేదు. జీవన్ముక్తుల కిది చరమదేహస్థితి యగుటచేతను, ప్రారబ్ధకర్మ ఇంకను వారిని బాధించలేదు గనుకను అదృష్టఫలము వీరికిలేదు. భోగార్థమైన దేహ మున్ననే ఫలాఫలవివేకము బయలు దేరును. గంగాస్నానము జేసినతర్వాత భుజించిన వారలకు మరల గంగాస్నానము చేసినను ఫలము లేనట్లే జీవన్ముక్తుల విషయమునగూడ చెప్పికొనవలెను.

వర్తమాన తనుప్రాప్యం ఫలం దృష్ట ముదాహృతమ్,
భావిదేహోపభోగ్యం య త్త దదృష్ట ముదీరితమ్. ౫౦

వర్తమానమగు దేహముచే ననుభూత మగునది దృష్ట ఫలమని, కలుగబోవు జన్మలో వచ్చు దేహములో గలుగు ననుభూతి అదృష్టఫలమని తెలియవలెను.

రజస్తమఃప్రచండత్వే సుఖవ్యక్తి రసత్సమా,
తీవ్రవాయువినిక్షిప్త దీపజ్వాలేవ భాసతే. ౫౧

తస్మాత్స్వయంప్రభాఽఽనందాకారాఽపి మతిసంతతిః.
ప్రతిబంధనశా న్న స్యా త్సుఖవ్యక్తిపదాస్పదమ్. ౫౨

రజస్తమో గుణాత్మకము లగు భక్తివిశేషములలో రతియను భావ ముదయించదు. రజస్తమోగుణము లుద్రిక్తము లైన అనుభూయమాన మగు సుఖము వాస్తవికముగాదు. ఈసుఖము స్వకార్యకృతమై సంభవించినది గాదు. తీవ్రమైన వాయువు వీచగా దీపజ్వాల దేదీప్యమానముగా ప్రకాశించి, ఆరిపోవు చున్నది. ఈప్రకాశము వాయువువలన జన్మించిన స్వాభావికఫలము గాకపోవుటచే, తర్వాత ప్రకాశాభావము వచ్చుచున్నది గదా! స్వతఃప్రకాశము, సుఖాత్మకము నగు చిత్సంతతి రజస్తమో గుణము లనబడు ప్రతిబంధకములచే నావృత మగుటచే సుఖాత్మకముగా భాసించుటలేదు.

రజఃప్రజలసత్త్వాంశా దీర్ఘ్యాజద్వేష మిశ్రితా,
మనోవృత్తిః పరానందే వైద్యస్య న సుఖాయతే. ౫౩

రజోగుణము ప్రబలముగా నుండ అందలి సత్త్వగుణమునుండి బయలుదేరున దీర్ష్య. ఏవంవిధమగు నీర్ష్య

నుండి వచ్చు ద్వేషముతో మిశ్రితమైన మనోవృత్తి సుఖావహము కాజాలదు. కావుననే శిశుపాలునకు సుఖప్రాప్తి లేకపోయినది.

తమఃప్రబలసత్త్వాంశా ద్భీతిజద్వేషమిశ్రితా.
మనోవృత్తిః పరానందే కంసస్య న సుఖాయతే. ౫౪

తమోగుణము ప్రబలముగా నుండ అందలి సత్త్వగుణమునుండి జన్మించిన భయముద్వారా ద్వేష ముత్పన్నమగును. ఈద్వేషముతో మిశ్రితమైన మనోవృత్తి సుఖావహము కాజాలదు. గనుకనే కంసుడు సుఖింపజాలక పోయెను.

తయో ర్భావిశరీరేతు ప్రతిబంధక్షయె సతి
సైవ చిత్తద్రుతిర్భక్తి రసతాం ప్రతిపద్యతే. ౫౫

శిశుపాల కంసులవంటి వారలకు తర్వాత జన్మలో పాప, కర్మాది భోగప్రతిబంధకములు నశించగా చిత్తద్రుతి కలుగును. ఈ చిత్తద్రుతియందు భగవదాకారత మనస్సునావేశించగా భక్తియోగము, తత్సుఖము లభించగలవు.

అధునాఽపి భజంతో యే ద్వేషా త్పాశుపతాదయః,
తేషా మప్యేవ మేవ స్యా దథవాఽనేన తుల్యతా. ౫౬

వర్తమాన సమయమునగూడ నెవరు భగవంతునిపై ద్వేషభావమును వహించి, భగవత్ప్రాతికూల్యము నాచరింతురో. అట్టివారలకు గూడ భగవత్కృపద్వారా మాత్రమే

భక్తిసుఖానుభూతి కలుగగలదు. భక్తులకు కలుగు సుఖానుభూతితో సమానమగు సుఖము వీరికి కలుగగలదు.

ద్రుతౌ సత్యాం భవే ద్భక్తి రద్రుతౌ తు న కించన
చిత్తద్రుతే రభావేన వేనస్తు కతమోఽపి న. ౫౭

చిత్తద్రుతి కలిగిననే భక్తి ఉదయించ గలదు. చిత్తద్రుతి లేనిచో భగవదాకారత మనస్సు నావేశించ లేకపోవుటచే భక్తి కలుగనేరదు. పరమ భాగవతి చక్రవర్తి యగు పృథుమహారాజు తండ్రియైన వేనుడు సాత్త్వికా, రాజస, తామస భక్తులలో నొకడును గాకపోవుటకు చిత్తద్రుతి కలుగక పోవుటయే కారణము.

రజస్తమోవిహీనా తు భగవద్విషయా మతిః,
సుఖాభివ్యంజకత్వేన రతి రి త్యభిధీయతే. ౫౮

రజస్తమో గుణరహితమై, భగవద్విషయకమైన చిత్తవృత్తి యున్నచో నీవిధ మగు స్థితి సుఖాభివ్యంజక మని అందుచే భగవద్విషయక రతిభావ సంపన్నమని చెప్పవలెను.

స్నేహస్యైవ వికారః ప్రియయో రత్యంతభావనా దనిశమ్,
విరహాసహిష్ణుతాఽఽత్మా ప్రీతివిశేషో రతి ర్నామ. ౫౯

ఒండొరు లొకరి కొక రాలంబనవిభావమైన నట్టివారిని ప్రియు లందురు. ఒండొరుల కనన్యత్వసంబంధము (అవినాభావము) గలదని భావము. ధారావాహికముగా, అవిచ్ఛిన్నముగా నత్యంత ముత్కంఠతో చింతనము చేయుటచే నీప్రియు

లకు కలుగు సంస్కారరాత్మక మగు స్నిగ్ధభావమును స్నేహ మందురు. అన్యభావములతో సంసృష్టముః గాని కేవలము స్నేహముయొక్క పరిణామమే రతియను భావము. అభీష్ట విషయము ప్రత్యక్షమున లేకపోయినచో కలుగు విరహమును వీరు సహింపజాలరు. అభీష్టవిషయ ప్రత్యక్షాభావజ్ఞానమును విరహమందురు. ఇట్టి విరహమును సహింపజాలక పోవుటచే కలుగు ప్రవృత్తినిమిత్తికమైన ప్రీతివిశేషమే రతి.

రజ స్తమః సముచ్ఛేద తారతమ్యేన గమ్యతే,
తుల్యేఽపి సాధనాభ్యాసే తారతమ్యం రతే రపి. ౬౦

సాధనాభ్యాసము సమానమైనను రజస్తమోగుణము లతో సంవలితమై, సముచ్ఛిన్నమైన రతియందు సుఖావహత్వము స్వల్పముగా నుండును. రజస్తమము లంత ప్రధానముగా లేని రతియందు సుఖావహత్వ మధికముగా నుండును.

విరహే యాదృశం దుఃఖం తాదృశీ దృశ్యతే రతిః,
మృదుమధ్యాధిమాత్రత్వ ద్విశేషోఽత్రాపి వీక్ష్యతే. ౬౧

విరహావస్థలో ఏపరిమాణాదికము గలదుఃఖ మనుభూత మగునో, అంత పరిమాణాదికము గల రతి గలదని చెప్ప వలెను. ఈ న్యూనాధికత్వము చిత్తద్రుతిభేదము నాశ్రయించు కొని వచ్చునది. విరహతాపము ననుసరించి యుండునది చిత్త ద్రుతి. చిత్తద్రవీభావము ననుసరించి రతి ఉద్భూతమగును విరహదుఃఖము ననుసరించి రతియను భావమున తారతమ్య

ములు కన్పించుచున్నను, మృదువుగను, మధ్యమముగను, తీవ్రముగను, రతివిశేష తారతమ్యము లనుభూతము లగుచున్నవి.

వైకుంఠే ద్వారకాయాం చ శ్రీమద్ బృందావనే తథా,
మృదుతీవ్రా మధ్యతీవ్రా తీవ్రతీవ్రా చ సా క్రమాత్. ౬౨

వైకుంఠమున రతి మృదుత్వముగా ననుభూత మగును. ద్వారకలో మధ్యమమగు తీవ్రత్వముతో రతి ప్రతీయమాన మగును. బృందావనమున రతి తీవ్రతమమై అవగత మగును.

ఇయం నిసర్గ సంస ర్గావమ్యాధ్యాత్మాభియోగజా,
సంప్రయోగాభిమానాభ్యాం సమారోపే స్థితా తథా. ౬౩

పైన రతిని త్రివిధమని వివరించితిమి. ఇక అష్టవిధముగా చెప్పుచున్నాము. మృదు తీవ్రత్వాది భేదవిశిష్టమైన రతి, ఎనిమిది విధముల గలదు. సంస్కారవిశేష మగు ఆత్మనుండి నిసర్గముగా వచ్చునది యొకవిధము. సంసర్గజనిత మైనది రెండవది. కులరూపాది సామగ్రీ గౌరవముతో కలుగు సంబంధమును సంసర్గమందురు. భగవత్సాదృశ్య విషయ భావననుండి వచ్చునది మూడవది. స్వరూపజనితము లేక అధ్యాత్మజనిత మైనది నాల్గవది. భావవ్యక్తి రూప మగు అభియోగము నుండి యుత్పన్న మగునది ఐదవది. సంప్రయోగజనిత మైనది యారవది. అభిమానజనితముగా నేడవది గలదు. సమారోప జనితమైన వైషయికరతి ఎనిమిదవది.

స్పర్శే శబ్దే తథా రూపే రసే గంధే చ కేవలే,
సముచ్చితే చ సా తత్రే త్యేకా షడ్విధా భవేత్. ౬౪

సమారోపజనిత మగు వైషయికరతియందలి విశేష మిచట చెప్పబడుచున్నది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను విషయములకు జెందుటచే నిది వైషయిక మనబడు చున్నది. కేవల స్పర్శాదులనుండి సముదితమై సమారోపిత మగుచున్న రతి విభేదములు విషయభేదము నాశ్రయించు కొని పంచవిధములుగా గలవు. కాని మృదు, తీవ్ర, తీవ్ర తమ భేదములుగల రతి వీటితో కలియగా నారవవిధ మగు రతిగూడ సంప్రాప్త మగును. స్పర్శజన్యము, శబ్దజన్యము, రూపజన్యము, రసజన్యము, గంధజన్యము, సముచ్చితవిషయ జన్యమునను ఆరు భేదములతో రతి యున్నది.

శుద్ధా వ్యామిశ్రితా చేతి పున రేషా ద్వివిధా భవేత్,
తత్రానుపాధిః శుద్ధా స్యా త్సోపాధి ర్మిశ్రితోదితా. ౬౫

పైన జెప్పబడిన భక్తి శుద్ధమని, వ్యామిశ్రితమని, రెండురకముల గలదు. ఉపాధిసహితమైన భక్తి, మిశ్రితమని, ఉపాధిరహితమైనది శుద్ధమని తెలియవలెను. ఇతర విషయము లతో కలుగు నభిసంధిని ఉపాధియందురు.

అనుపాధిః పరానంద మహిమైక నిబంధనా,
భజనీయగుణానంత్యా దేకరూపైవ సోచ్యతే. ౬౬

అనుపాధిక మగు భక్తి నిచట చెప్పుచున్నారు. సామ్యాతిశయ శూన్యమగు లోకోత్తరానంద మేకము, అద్వి

తీయము. ఇట్టి పరానందమును ప్రయోజకముగా గలిగిన భక్తి ఉపాధిరహితమైనది. భగవంతుని గుణము లనంతము లగుటచే వాటిని లెక్కింప వశము గాకపోవుటవలన పరానందమహిమ నేకమని అద్వితీయమని చెప్పవలసి వచ్చినది.

కామసంబంధ భయతః సోపాధి స్త్రివిధా భవేత్.
విభావాదిసమాయోగే శుద్ధభక్తిరసో భవేత్. ౬౭

ఉపాధిసహితమైన భక్తి కామసంబంధ భయములను ఉపాధులతో మూడు విధముల గలదు. భక్తిరసస్థాయియగు రతి భావాంతరమున సంకీర్ణముగాక, విభావాది సంయోగము నందిన, శుద్ధమగు భక్తిరసము నిష్పన్న మగును.

శృంగారమిశ్రితా భక్తిః కామజా భక్తి రిష్యతే,
సంబంధజారతి ర్యాతి పూర్వోక్తాం రసతాం ద్వయోః. ౬౮

ఏకో వత్సలభక్త్యాఖ్యః ప్రేయోభక్తి స్తథాఽపరా
భయజా రతి రథ్యాస్తే రసం ప్రీతిభయానకమ్. ౬౯

ఉపాధిరహితమగు భక్తి వివరించబడు చున్నది. శృంగారములో మిశ్రితమైన భక్తి కామమునుండి జన్మించు చున్నది. సంబంధజనితమైన భక్తి వాత్సల్య సఖ్య రసములుగా పరిణమించుచున్నది. సఖ్యరసము ప్రేయోభక్తిరసమని, వాత్సల్యరసము, వాత్సల్యభక్తిరసమని యెంచవలెను. భయకారణజనితమైన చేతోద్రుత్యాత్మకమగు రతి ప్రీతి భయానక మనబడు మిశ్రితరసముయొక్క స్థాయిభావ మగుచున్నది.

ఏకదా యద్యపి వ్యక్తి మిదం రతి చతుష్టయమ్,
తదా తు పానకరసన్యాయేన పరమో రసః. ౨౦

కామము, సంబంధద్వయము, భయము అనువాని నుండి జనించు రతి యను నాల్గురతి భావములు గలవు. ఈ రతిభావము లేకాశ్రయములై ఉదయించుచున్నను, ఇవి పానక రసమువలె అనుభూతమగు చున్నవి. పానకమున ననేక ద్రవ్య ములు కలియుచున్నను ఈ ద్రవ్యములరుచిని గాక తద్విలక్షణ మగు రుచిని పానకమున గ్రహించుచున్నాము. ఇట్లే వివిధ భావ మిశ్రణమునగూడ విశిష్టమగు ననుభూతిగలదు. ఇదియొక చిత్రరసమువంటి యనుభూతియగును. కాని ఇట్టి యనుభూతి సర్వజనులకు కలుగునా ? యను ప్రశ్నను తర్వాతి శ్లోకమున సమాధాన మీయబడుచున్నది.

ఏక ద్వ్యాది రస వ్యక్తి భేదా ద్రసభిదా భవేత్,
తస్మా త్క్వచి త్తదభ్యాసం కుర్యా ద్రతిచతుష్టయే. ౨౧

అభివ్యక్తములగు మార్గముల ననుసరించి రసములు పరస్పరము భిన్నములగుచున్నవి. హృదయసంవాద వశమున చిత్తమే రసమున కున్ముఖమగునో, ఆ రసమే ప్రతీతియోగ్యమై ఆస్వాదింపబడు చున్నది. సాధనేచ్ఛగల వ్యక్తి ఇట్టి రసప్రతీ తికే యత్నించవలెను. శుద్ధము, కామజము, సంబంధజనితము, భయజనితము నని నాల్గు విధముల రతిభావములు గలవని యంటిమి. భయజనితమగు రతియందు గౌరవ, మర్యాదా, రక్షణా, సంభ్రమాదులతోగూడ వినయ విధేయతలు కన్పించు

చున్నవి. శుద్ధరతినుండి శాంతము, భయజనితమగు రతినుండి దాస్యము, సంబంధజన్యమగు రతినుండి సఖ్య వాత్సల్యములు, కామజనితమగు రతినుండి శృంగారము వచ్చుచున్నవి. వీటిలో దేనియందు దున్ముఖత గలదో దానిని అనుభవించుటకే మానవుడు యత్నించవలెను.

వ్రజదేవీషు చ స్పష్టం దృష్టం రతిచతుష్టయమ్,
తచ్చిత్తాలంబనత్వేన స్వచిత్తం తాదృశం భవేత్. ౭౨

శాస్త్రప్రసిద్ధమగు రతిచతుష్టయము వ్రజసుందరుల యందు ప్రతీతమైనదని స్పష్టముగా మన కవగతమే. వీరల చిత్తము నాలంబనము గావించుకొని సాధన చేయగా తాదృశచిత్తత్వ మితరులకు సహితము సంప్రాప్తము కాగలదు. భగవద్విషయక మగు రతిచే రాజితమైన చిత్తమాలంబనమైన తాదృశచిత్తత్వము మనకుగూడ రాగలదు.

రసాంతర విభావాది సంకీర్ణా భగవద్రతిః,
చిత్రరూపవ దన్యాదృ గ్రసతాం ప్రతిపద్యతే. ౭3

హాస్యాది విభావాదులతో భగవద్విషయక రతి సంకీర్ణమై, చిత్రరసత్వము నందును. చిత్రరూపములోని వివిధాంగములకు విశిష్టమగు నూత్నరూపము సంభవించునట్లుగా నిట్టి భక్తిగూడ చిత్రత్వము నందును.

రసాంతర విభావాది రాహిత్యే తు స్వరూపభాక్,
దశమీ మేతి రసతాం సనకాదే రివాధికామ్. ౭౪

రసాంతర విభావములతో సంబంధములేని భగవద్రతి భగవత్స్వరూపభాజియై, సనకాది యోగులచే నాస్వాదింప బడు రతివలె విశిష్టమైన పదియవ రసము కాగలదు. శృంగారాది రసములకంటె విలక్షణమై రసముగా భక్తిప్రతీయమాన మగు నని తాత్పర్యము.

రతి ర్దేవాదివిషయా వ్యభిచారీ తథోర్జితః,
భావః ప్రోక్తో రసో నేతి యదుక్తం రసకోవిదైః. ౭౫

దేవాంతరేషు జీవత్వాత్ పరానందాప్రకాశనాత్,
తద్యోజ్యం; పరమానందరూపే న పరమాత్మని. ౭౬

కాంతాదివిషయా వా యే రసాద్యా స్తత్ర నేదృశమ్;
రసత్వం పుష్యతే పూర్ణసుఖాస్పర్శి త్వకారణాత్. ౭౭

పరిపూర్ణ రసాక్షుద్ర రసేభ్యో భగవద్రతిః,
ఖద్యోతేభ్య ఇవాదిత్యప్రభేవ బలవత్తరా. ౭౮

భగవద్విషయకరతి రసముగా పరిణమించునా? లేదా? యను ప్రశ్న కిచట సమాధాన మీయబడుచున్నది. దేవాది విషయకమై వ్యంజనద్వారా ప్రత్యాయితమై వ్యభిచారిభావముగా నున్న రతి యను భావము రసము గాదని రసకోవిదులనినారు. దేవతలు కానివారలయం దీరతి క్షుద్రానందాత్మకమై, లోకోత్తరానందావగతి నీయజాలక పోవుటచే నీవాదము యుక్తియుతమే. కాంతాదివిషయకములైన భావములు శృంగారాది రసములుగా పరిణమించునట్లు, పరమానందరూపమగు

పరమాత్మను విషయముగాగల భావముగూడ పరిణమించు నశరాదు. కాంతాదివిషయకమగు రసమున పూర్ణానంద స్వభావములేదు. పూర్ణము, దుఃఖాసంభిన్నమునగు సుఖము లేనపుడే భావము పుష్టమై రసముకాగలదు. మిణుగురు పురుగు ప్రకాశముకంటె సూర్యతేజము ప్రజలతేజోయుతమైనట్లు, లౌకిక క్షుద్ర రసములకంటె పరిపూర్ణ రసీభవనార్హమగు భగవత్ప్రీతి విశిష్టమైనది, ముఖ్యమైనది, గొప్పదియుగూడ నని తెలియవలెను.

క్రోధ శోక భయాదీనాం సాక్షా త్సుఖవిరోధినామ్,
రసత్వ మభ్యుపగతం తథాఽనుభవమాత్రతః. ౭౯

ఇహానుభవసిద్ధేఽపి సహస్రగుణితో రసః,
జడేనేవ త్వయా కస్మా దకస్మా దపలప్యతే. ౮౦

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ మధుసూదన సరస్వతీ విరచితే భగవద్భక్తిరసాయనే భక్తివిశేష ప్రతిపాదకో నామ ద్వితీయోల్లాసః

క్రోధము, శోకము, భయము మొదలగు భావములు సాక్షాత్తుగా సుఖప్రతికూలములు. దుఃఖాంశగల ఈ భావములు సహితము విభావాది సంయోగము కలుగగా రసరూపము నందుచున్నవని ఆలంకారికు లనినారు. ఈభావముల నుండి రౌద్ర, కరుణ, భయానకాది రసములు నిష్పన్నము

లగునని మన అనుభవమే చెప్పుచున్నది. భగవద్విషయక మగు రతినుండిగూడ వీటికన్న వేయిరెట్లు గొప్పది, లోకోత్త రాహ్లాద హేతువునగు మహత్తర రసము నిష్పన్న మగుచున్న దని శ్రుతి, స్మృతి, అనుభవములు వేనోళ్ళ చాటుచున్నవి. ఇది రసముగాదని అయుక్తికముగా, అసంబద్ధముగా ప్రల పించుటకు బుద్ధిహీనుడే త్వరపడ గలడు. రస మనగా భక్తి రసమే. ఇంతకు మించిన రసములేదు. భక్తిరసమును రసరాట్ అనవలెను. (మొదటి అనుబంధములో చివరి భాగములను చూడుడు.)

గద్య

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ మధుసూదన
సరస్వతీ విరచిత మగు భగవద్భక్తి రసాయనమున,
ఆంధ్రవివృతియందు, భక్తివిశేష ప్రతిపాదక
మను రెండవ యుల్లాసము
సమాప్తము.



# తృతీయోల్లాసము

నను కేయం రసో నామ? కింనిష్ఠో వా భవే దసౌ?
అస్య ప్రత్యాయకః కోవా? ప్రతీతి రపి కీదృశీ? ౧

భక్తియొక్క స్వరూపవిశేషములను జెప్పినతర్వాత భక్తిరసమును ప్రతిపాదింప గోరి మూడవ యుల్లాసమును మధుసూదను డారంభించు చున్నాడు. రసమునకు సంబంధించిన కొన్నిప్రశ్నలను వేసి, వాటి సమాధాన పూర్వకముగా భక్తిరసము ప్రతిపాదింప దలచినాడు.

రసమనగా నేమి? రసమున కాశ్రయ మేమి? రసమెట్లు ప్రతీయమాన మగును? రసప్రతీతి యననేమి? ఈ నాలుగు ప్రశ్నలకు వరుసగా సమాధానము నీయ బోవుచున్నాడు.

విభావై రనుభావైశ్చ వ్యభిచారిభి రప్యుత,
స్థాయీభావః సుఖత్వేన వ్యజ్యమానో రసః స్మృతః. ౨

చిత్తద్రుతిద్వారా కలుగు సంస్కారాత్మకమైన రతి యను భావము స్థాయిభావమై భక్తిరసముగా నిష్పన్న మగును. సజాతీయభావములచేగాని, విజాజాతీయభావములచే గాని తిరస్కృతము గాక, రసనిష్పత్తి యగువరకు నుండు భావము స్థాయిభావము. ఈ స్థాయిభావమునకు విభావ, అను

భావ, సంచారి భావములతో సంయోగము కలుగగా, సుఖ రూపముగా ప్రతీయమానమగు రసము నిష్పన్న మగును.

వాసనాత్మకముగా నున్న స్థాయిభావమును ఆస్వాదాంకుర యోగ్యము గావించుటకు విభావింపబడునది విభావము. స్థాయిభావమును రగుల్కొలుపు కారణభూతము లగు విషయము లాలంబనవిభావములు. శత్రుదర్శన మను ఆలంబనవిభావము క్రోధ భయాది భావములను రగుల్కొలుపును. ఈ భావము నుద్దీపింపజేయు మలయానిలాదికము నుద్దీపనవిభావ మందురు. స్థాయిభావ ముద్దీపితము కాగా శరీరమునకు కన్పించు మార్పులను అనుభావములందురు. స్తంభ, స్వేద, రోమాంచ, స్వరభంగ, వేపథు, వైవర్ణ్య, అశ్రుపాత, ప్రలయములను సాత్త్వికానుభావము లని పిలుతురు. స్మిత, గీత, కటాక్ష, భుజక్షేప, హుంకృత్యాదులు గూడ అనుభావములనబడుచున్నవి. విషయదర్శన భావనాదులచే మానసమున కొన్ని భావములు బయలుదేరి, స్థాయిభావమును ప్రవృత్తిపరముగా జేయుచున్నవి. ఇట్లొనరించు భావములను సంచారి భావములందురు. సంచారి భావములే శారీరకముగా సాత్త్వికా ద్యనుభావముల రూపమున నభివ్యక్తములగుచున్నవి. విభావములచే రగుల్కొలుపబడి, సంచారిభావములచే ప్రవృత్తి పరమై, అనుభావముల ద్వారా అభివ్యక్తమై, పరిపుష్టమైన స్థాయిభావమును రసమని యనుచున్నాము. (రెండవ అనుబంధము చూడుడు).

సుఖ స్యాత్మస్వరూపత్వా త్తదాధారోన విద్యతే,
తద్వ్యంజికాయా వృత్తే స్తు సామాజికమనఃస్థితి. ౩

రసము సుఖరూపముగా ప్రతీయమాన మగునదని యనినాము. ఈ సుఖ మైహికమగు వైషయికసుఖము గాక, లోకోత్తరాహ్లాదము. లోకోత్తరాహ్లాదము నానంద మని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. "ఏష హ్యేవానందయాతి" అని, "రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" అను ఉపనిషద్వాక్యములలో రస మాత్మస్వరూపమని, ఆత్మ ఆనందాకారమని తెలియనగును. ఆత్మస్వరూపమగు సుఖ మనబడు రసమున కాధారము లేదు. సర్వ జగదాధార మగు ఆత్మ కాధార ముండజాలదు. ఆధారశూన్య మైనను, ఆత్మ కొన్ని ఉపాధులద్వారా వ్యక్తమగుచున్నది. ఇట్లే సర్వాధార మగు రసము నభివ్యక్తము జేయు ఉపాధులు గలవు. రసము నభివ్యంజకము చేయు చిత్తవృత్తికి సామాజికుల మానసమే ఆధారముగా కన్పించుచున్నది. సామాజిక మానస మనబడు ఉపాధి ద్వారా రస మభివ్యక్త మగును.

కావ్యార్థనిష్ఠా రత్యాద్యాః స్థాయినః సంతి లౌకికాః,
తదోద్బుద్ధనిష్ఠా స్త్వపరే తత్సమా అ వ్యలౌకికాః. ౪

కావ్యమున వర్ణనీయముగా గాని, అభినేయముగా గాని యున్న విషయము నాధారముగా జేసికొనిన రత్యాది భావములు లౌకికములు. ఈ భావములు సుఖకారణ సహకృతము లైనచో సుఖజనన స్వభావము గలవి యని, దుఃఖకారణ సహకృతము లైనచో దుఃఖజననస్వభావము గలవి యని మనము

వ్యవహరించు చున్నాము. కావున నివి లోకసిద్ధమగు నియమము ననుసరించునవి.

రసము నాస్వాదించు సామాజికులయందు ప్రతీయమానము లగు రత్యాది భావములు, సమానవిషయకతాద్వివశమున తత్తుల్యములై, అలౌకికము లనబడు చున్నవి. లౌకికభావములు రసాస్వాదమున అలౌకికములుగా నవగతము లగుచున్నవి.

బోధ్యనిష్ఠా యథాస్వం తే సుఖదుఃఖాదిహేతవః,
బోద్ధృనిష్ఠాస్తు సర్వేఽపి సుఖమాత్రైకహేతవః. ౫

వర్ణనీయ విషయమున, అభినేయ విషయమున గల రత్యాది భావములు లోకనియమము ననుసరించుచు సుఖదుఃఖాది జనన స్వభావము గల్గి యున్నవి. ఇవే భావములు రసాస్వాద సమయమున సామాజిక నిష్ఠములై కేవలము సుఖము నే కలుగజేయు చున్నవిగాని, దుఃఖమును కలుగజేయ జాలకున్నవి. దుఃఖజనక మగు భావముగూడ రసాస్వాదమున సుఖము నే కలుగజేయు చున్నది.

అతో న కరుణాదీనాం రసత్వం ప్రతిహన్యతే,
భావానాం బోద్ధృనిష్ఠానాం దుఃఖాహేతుత్వనిశ్చయాత్.

సామాజికనిష్ఠము లగు స్థాయ్యాదిభావములు దుఃఖజనకములు గాకపోవుటచేతనే దుఃఖాంశ గల కరుణ, భయానక, బీభత్సములు రసములు కాగల్గు చున్నవి. ఈ రసములు

దుఃఖజనన స్వభావములను గల్గి యున్నచో నివి రసములుగా పతీయమానములు కాజాలవు. రసప్రతీతి యను ప్రవృత్తిలో ఇష్టసాధనత్వ జ్ఞానమే కారణమని, దుఃఖ మిష్టవిషయము కాదని మనకు తెలిసిన విషయమే.

తత్ర లౌకికరత్యాదేః కారణం లౌకికం తు యత్,
కావ్యోపదర్శితం తత్తు విభావ ఇతి కథ్యతే. ౭

లౌకిక వ్యవహారమున విషయములతో మనకు సంబంధము కలుగగా రత్యాది భావములు బయలుదేరు చున్నవి. ఇట్టి విషయసంబంధముచే రగుల్కొల్పబడిన రత్యాదిభావములే కావ్యములయందు వర్ణింపబడు చున్నవి. విషయముతో సంబంధము కలుగగా విషయముచే మేల్కొలుపబడిన భావ మవగత మగుటచే విషయమును కారణమని యెంచవలెను. కారణమునే కావ్యజగమున విభావ మందురు. కావ్యమున కలుగు హృదయసంవాదవశమున సాధారణీకరణము రాగా భావము విభావింపబడు చున్నది.

లౌకికస్యైవ రత్యాదే ర్లోకే య త్కార్య మీక్షితమ్
కావ్యోపదర్శితం తత్ స్యా దనుభావపదాస్పదమ్. ౮

లోకవ్యవహారమున రత్యాదు లనుభావము లైనచో భ్రూవిక్షేప, కటాక్షాదికములు బయలుదేరు చున్నవి. ఇట్లు త్పన్నములగు కార్యజాతములను అనుభావములని కావ్యములయందు వ్యవహరించు చున్నాము, అలౌకికానుభావన

వ్యాపార వంతము లగుటచే నివి యనుభావము లనబడు చున్నవి.

లౌకికస్యైవ రత్యాదేః ర్యే భావాః సహకారిణః,
కావ్యోపదర్శితా స్తే తు కథ్యంతే వ్యభిచారిణః. ౯

లోకవ్యవహారమున నుత్పన్నము లగు రత్యాది స్థాయి భావములకు నిమిత్తభావములై సహకారిణులైన భావములను కావ్యములయందు వ్యభిచారిభావములు లేక సంచారిభావ ములు అని యందుము. నిర్వేద, వ్రీడాదు లిట్టివి.

అలౌకికస్య రత్యాదేః సామాజికనివాసినః,
ఉద్బోధే కారణం జ్ఞేయం త్రయ మేత త్సముచ్చితమ్. ౧౦

సామాజికనిష్ఠములై అలౌకికములైన రత్యాది స్థాయి భావములను మేల్కొలుప జేయువిభావానుభావ సంచారి భావ ములను మూటిని రసప్రతీతి కారణములని యెంచవలెను.

జ్ఞాతస్య పరసంబంధా దన్యే సాధారణాత్మనా,
అలౌకికం బోధయంతి భావం భావా స్త్రయోఽప్యమీ.౧౧

విభావ, అనుభావ, వ్యభిచారి భావములను మూటి యొక్క స్వరూపము, స్వభావము, ఆశ్రయము మొదలగు వాటిని తెలిసికొనినచో, వీటికి స్థాయిభావములకుగల సంబంధ మవగతము కాగలదు. వీటితో సంయోగము చెందిన స్థాయి భావము కేవల మేకవ్యక్తినిష్ఠమై, ఏకవ్యక్త్యను భూతి యోగ్యమై భాసించక, సర్వజనాను భవ యోగ్య మగు

చున్నది. ఏవంవిధ మగు యోగ్యత్వమును సాధారణీకరణ మందురు. ఒకేఒక వ్యక్తిచే నసాధారణముగా ననుభూత మగుచున్న భావము సర్వజనకారణమై అలౌకికముగా ప్రతీయ మాన మగు నని భావము. ఈ యలౌకిక సాధారణీకరణము భావనావ్యాపార సమాశ్రితమై వచ్చునది. స్థాయిభావ మలౌ కిక సాధారణీభూతమై రసరూపమున పరిణమించును.

భావత్రితయ సంసృష్ట స్థాయిభావావగాహినీ,
సమూహాలంబనాత్మికా జాయతే సాత్త్వికీ మతిః. ౧౨

విభావానుభావ సంచారిభావములను మూటితోను సంసృష్టమై, ఉద్బోధితమై, ప్రత్యాయితమై, పరిపోషమును పొందునది స్థాయిభావము. నానాప్రకారతా నిరూపితము, నానావిశేష్యతానిరూపకము నగు స్థాయిభావవిషయిక మైన జ్ఞానముద్వారా సాత్త్వికమతి కల్గును. సముద్రిక్తమైన సత్త్వ ముగల చిత్తవృత్తి బయలుదేరునని తాత్పర్యము.

సాఽనంతరక్షణేఽవశ్యం వ్యనక్తి సుఖ ముత్తమమ్,
త ద్రసః కేచి దాచార్యా స్తా మేవ తు రసం విదుః. ౧౩

పైన చెప్పబడిన సాత్త్వికమనోవృత్తి బయలుదేరిన వెంటనే ఉత్తమము, సంశయరహితము నగు లోకోత్తరానం దము వ్యంజనా వ్యాపారవశమున అవగత మగుచున్నది. ఈ వ్యక్తీకృత మగు సుఖమే రసమని చెప్పబడుచున్నది.

కాని కొందరు శాస్త్రజ్ఞులు పైన వివరించబడిన సమూ హాలంబనాత్మక మగు చిత్తమునే రస మని యెంచుచున్నారు.

విభావానుభావ సంచారి భావములకు స్థాయిభావముతో సంయోగము కలుగగా రసనిష్పత్తి కలదని భరతుడు సూత్రించెను. ఈ సూత్రమును పలువురు పలువిధముల వ్యాఖ్యానించిరి. మూడు విధముల భావముల సంయోగము రసనిష్పత్తికి హేతువుగా వ్యాఖ్యానించినవారు కొందరు గలరు. ఈసంయోగము కారణహేతువుగాని, జ్ఞాపకహేతువుగాని కాదనుచు, విభావాదుల సంయోగ వశమున రసముత్పన్న మగుచున్నదని లొల్లటాదు లనినారు. భావనావశమున సముత్పన్నమైనట్లు ప్రతీయమానమగు అనిర్వచనీయ స్థితియే రస మని మరికొంద రనినారు. రసమును మానసిక భ్రమ యనినవారు గూడ గలరు. విభావాది హేతువులచే ననుమేయ మగునది రస మని శంకుకాదులవాదము. భావనావ్యాపారవశమున హృదయసంవాదము కలుగగా సంభవించు సాధారణీకరణమున సత్త్వోద్రేకము కలుగుననిః ఈస్థితియందు భోగీకృతమగు నానందరూపమే రసమనిభట్టనాయకునివాదము గలదు. సాధారణీకరణమను వ్యాపారమహిమచే ఆవరణరూపమున నున్న ఉపాధులు భగ్నములు కాగా ప్రతీయమాన మగు చిద్విశిష్ట స్థాయిభావమే రస మని అభినవ, మమ్మటుల వాదసారాంశము. ఈ చివరివాదమును మధుసూదనుడు కేచిత్పక్షముగా నొసగినాడు. "రసో వై సః" ఇత్యాది శ్రుతివాక్యములలో రసమును బ్రహ్మగా అంగీకరించినట్లు కన్పించుటచే చిద్విశిష్ట స్థాయిభావమును రసముగా నిర్వచింపరాదని నిర్విశేషమగు చిత్పదార్థమునే రస మని తెలియవలె

నని జగన్నాథు డనినాడు. జగన్నాథుని వాదమునకు మధు సూదనుని వాదమునకు భేదములేదు. ఈ రస ముపహితమై సవిశేషముగా మన కవగత మగుచున్నది గనుక స్థాయిచే నుపహితమైన చిదాత్మను రస మని యెంచవలెను. ఇక్కడ చిదాత్మ యనగా సచ్చిదానందస్వరూపమగు పరమాత్మయని అర్థము.

తేషాం ప్రత్యేకవిజ్ఞానం కారణత్వేన తైర్మతమ్,
స్థాయీభావో రస ఇతి ప్రయోగ స్తూపచారతః. ౧౪

విభావాదుల ప్రత్యేక విజ్ఞానము రసప్రతీతికి కారణ మని, కార్య కారణములకు గల అభేదావస్థ నాశ్రయించుకొని స్థాయిభావమే రస మగుచున్న దని చెప్పుట కేవల మౌప చారిక ప్రయోగమని వాదించువారు సమూహాలంబనాత్మక మగు మతియే రస మనుచున్నారు.

ఏవ మ వ్యవధానేన క్రమో యస్మా న్న లక్ష్యతే,
అసంలక్ష్యక్రమవ్యంగ్యం ధ్వనిం తస్మా దిమం విదుః. ౧౫

సమూహాలంబనాత్మక మగు మతి యనగా నానా ప్రకారతానిరూపితము, నానావిశేష్యతానిరూపకము నగు జ్ఞాన మని అర్థము. ఇట్టి జ్ఞానము కలిగినవెంటనే, అవ్యవహిత ముగా రసము వ్యక్త మగుచున్నదనినచో జ్ఞానము మొదట కల్గునని, తర్వాత రసవ్యక్తి యని క్రమము కన్పించవలెను. రెండును ఒకే ఒక కాలమున రాజాలవు. కావున విభా వాను భావ వ్యభిచారి భావములే రసము గావని, రసము వీటిచే

వ్యంజింపబడుచున్నదని, ఇచట క్రమవివక్ష గలదని మమ్మటు డంగీకరించినాడు. కాని ఈ క్రమమును గుర్తించుట కష్ట మగుటచే దీనిని అసంలక్ష్యక్రమ మనుచున్నారు. సమూహా లంబనాత్మకమగు మతి, తదవ్యవహితోత్తర క్షణమున రసము, గలవు. ఇచట గన్పించు అవ్యవధానమున ఒకదాని తర్వాత నొకటి వచ్చుచున్నదను క్రమము గుర్తింపబడుట లేదు. దీనిని అసంలక్ష్యక్రమ వ్యంగ్యమగు ధ్వని యను చున్నారు.

శబ్దములకు సామాన్యముగా గల అర్థమును అభిధా యందురు. కొన్ని శబ్దములు కలియగా అన్వయము కుదిరినను అర్థమును మార్చి చెప్పుకొనుట గలదు. "గంగపై కుటీరము కలద"ని నపుడు "గంగయొడ్డున కుటీరము గల ద"ని చెప్పు చున్నాము. ఇట్టి అర్థమును లక్షణాయని, ఇది లక్షణాశక్తి ద్వారా శబ్దమునుండి గ్రహించబడిన అర్థమని తెలియవలెను. భుజించువేళ "సైంధవము" నడిగినవానికి సైంధవ మనగా గుఱ్ఱమును తెచ్చినచో నిష్ఫల మగును. ఏ సందర్భములో నిట్లడిగినాడో, ఏ ఉద్దేశముతో నడిగెనో, తెలిసికొని, సైంధవ మనగా ఉప్పు అని తెలిసికొనుటలో శబ్దమునకు తాత్పర్యశక్తి గలదని గ్రహించవలెను. అభిధా, లక్షణా, తాత్పర్యముల ద్వారా శబ్దము లర్థవంతము లగుచున్నవి.

ఒక ప్రియుడు తన ప్రియురాలిని ఏకాంతముగా కలసి కొనుచోట ఒక సన్యాసి విడిది చేసెననుకొనుడు. ఇత డిచట్ను

నుండగా వీరు కలసికొని సంభాషించజాలరు. క్రమేణ ఈసన్న్యా
సికి కుక్కలనిన భయమను సంగతి వారికి తెలియగా, ప్రియుడా
ఎవరితోనో మాట్లాడుచున్నట్లు "నీ ఇచ్ఛ వచ్చినట్లు ఇచట
విహరించుము. నిన్న మొన్నటిదాకా ఇచట స్వేచ్ఛగా తిరుగు
శునకమును నిన్ననే ఇచట సింహము చంపివేసినది. ఇక నీకు
శునకభయము లేదు." అని యనెననుకొనుము. శునకభయము
గల సన్న్యాసికి ఆభయము పూర్తిగా తీరెననుట స్పష్టమే.
కాని శునకము పోయి, సింహమువచ్చుట మిక్కిలి ప్రాణసంక
టము. కనుక స్వేచ్ఛగా దిరుగుటకు శునకభయము లేకపోయి
నను, ఆసన్న్యాసి అచట ఎంతమాత్రము నుండజాలడు. ఇచ్చట
అన్వయము పూర్తిగా కుదురుచున్నది. లక్షణార్థమునకు సావ
కాశము లేదు. "స్వేచ్ఛగా తిరుగుము" అని తాత్పర్యము
గూడ గలదు. కాని ఈ తాత్పర్యార్థ మభిప్రేతము గాదు.
"ఇచ్చటనుండి ఈసన్న్యాసి లేచిపోవలెను" అనునదియే అభిప్రేత
మగు నర్థము. ఇట్టి యర్థమును ధ్వని యని, ఇది వ్యంజనా
శక్తిచే నవగత మగునని యందురు. వ్యంజనావ్యాపారమును,
తదర్థమును గూడ ధ్వనియని వ్యవహరింతురు.

అభిధావ్యాపారము నాశ్రయించుకొని వచ్చుధ్వనిని
అభిధామూల మని, లక్షణావ్యాపారాశ్రయ మైనది లక్షణా
మూలమని, పిలువబడు చున్నవి. ఏవంవిధ మగు వ్యంజన,
వివక్షితాన్యపరవాచ్య మని, అవివక్షితవాచ్య మని రెండు
తెరగుల గలదు. ఇట్లే అర్థాంతర సంక్రమిత వాచ్యమని,
అత్యంత తిరస్కృత వాచ్య మని, మరియొక విభాగము గలదు.

అభిధామూల మగు వివక్షితాన్యపరవాచ్య మగు ధ్వనియందు వ్యంగ్యప్రతీతిక్రమము లక్ష్యమైన యొకవిధము, అలక్ష్యమైన మరియొక విధమురాగా సంలక్ష్యక్రమ వ్యంగ్యము, అసంలక్ష్య క్రమ వ్యగ్యము, సిద్ధించగలవు.

వ్యవధానా త్క్రమో లక్ష్యో వస్త్వలంకారయో ర్ధ్వనౌ,
లక్ష్యవ్యగ్యక్రమం తస్మాద్ ధ్వని మేతం ప్రచక్షతే. ౧౬

వాచ్యార్థము తెలియబడిన తర్వాత వ్యవధానపూర్వక ముగా వంగ్యార్థ మవగత మైనచో నట్టిదానిని సంలక్ష్యక్రమ వ్యంగ్య మందురు.

అనేకార్థములు గల శబ్దము వాచకము కాగా ఈశబ్ద మున కితరశబ్దములతో సంయోగాది సంబంధములు కలిగి నపుడు, వాచ్యార్థముకంటె భిన్నమైన అర్థము ప్రతీయమాన మైనచో నట శాబ్దవ్యంజన గలదనవలెను. ఇట్లే ఒక అర్థము మరియొక అర్థస్ఫూర్తికి హేతువైనచో అర్థవ్యంజన గలదన వలెను. అప్పుడు శబ్దశక్తిజనితము, అర్థశక్తిజనితము, శబ్దార్థో భయశక్తి జనితము అను మూడు విధముల ధ్వని గలదు. ఈధ్వని మరల అలంకారాత్మకమని, వస్త్వాత్మక మని, రెండు తెరగుల గలదు. శబ్దమునుండి గాని, అర్థమునుండి గాని, అన్యవస్తుస్ఫూర్తి కలుగగా వస్తుధ్వని, అన్యాలంకారస్ఫూర్తి కలుగగా అలంకారధ్వని, సిద్ధమగునని భావము. సంలక్ష్య క్రమధ్వనియందు శబ్దధ్వని, అర్థధ్వని, శబ్దార్థధ్వని యను

విభేదములు గలవు. ఈమూటినుండి ప్రత్యేక ప్రత్యేకముగా వస్తుధ్వని, అలంకారధ్వని వచ్చుచున్నవి.

రస భావ తదాభాస భావశాంత్యాది రక్రమః,
అనంతరక్షణే యస్మాద్ వ్యజ్యతేఽవశ్య మేవ సః. ౧౭

ఇక అసంలక్ష్యక్రమ వ్యంగ్యము వివరించబడు చున్నది. అసంలక్ష్యక్రమ వ్యంగ్యమై ప్రతీయమాన మగు దానిని సర్వదా రసమని యెంచ వీలులేదు. ఈ వ్యంగ్యమున రసాభాసము, భావాభాసము, భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలత్వము, రసము, భావము నను ఎనిమిది పదార్థములు గలవు.

అనౌచిత్య సమాయోగమున రసము రసాభాస మగును; భావము భావాభాస యగును.

శ్రుతిదుష్టాదయో దోషా యే రసప్రతిబంధకాః,
తదభావోఽపి సామగ్ర్యాం నివిష్టోఽనిష్టహానికృత్. ౧౮

శృంగారరసమున చెవికి కటువుగా నుండు శబ్దములు వినబడిన శృంగారము పరిణతము కాజాలదు. రౌద్రరసమును మృదుశబ్దములు పోషించ జాలవు. అనగా శ్రుతిదుష్టాది దోషములు రసపరిపోషణకు ప్రతిబంధకములు లేక విరోధులు. ఇట్టి దోషములు లేకపోయినను రసవ్యక్తికి తోడ్పడు సామగ్రి నొకచో చేర్చక తప్పదు. ఇట్టి సామగ్రీఘటనను చేయనిచో రసప్రతీతికి ప్రతిరోధము గొలుపు వసువు బయలుదేర గలదు.

యా రీతయో యే చ గుణా స్తజ్జ్ఞాన మపి కారణమ్,

అలంకారాశ్చ విజ్ఞాతా భవంతి పరిపోషకాః. ౧౯

శబ్దసంఘటనాత్మక వ్యాపారవిశేషములగు భారత్యాది రీతులు, రసోత్కర్షకములగు రసధర్మములైన మాధుర్యాది గుణములు, కావ్యశరీరమున గల వైచిత్ర్యమును భాసింపజేయు ఉపమాద్యలంకారములు అనునవి సాక్షాత్పరంపరా సాధారణ్య వశమున రసోపకారకములగుచున్నవి.

గుణాలంకారరీతీనాం భావానాం చ నివేదకః,

తస్య ప్రత్యాయకః శబ్దో వృత్త్యా వ్యంజనరూపయా. ౨౦

గుణాలంకారరీతులకు, భావములకు బోధకమగు శబ్దము వ్యంజనావృత్తిద్వారా రసమునకు వ్యంజకమగుచున్నది. అర్థబోధకనుకూలము, శబ్దనిష్ఠమునైన శబ్దార్థ సంబంధ విశేషమును వృత్తియందురు. వ్యంజనారూపమగు వృత్తిద్వారా శబ్దము రసము నభివ్యక్తము చేయగల్గునని తాత్పర్యము.

వృత్తిః కార్యాఽపరోక్షాఽస్య శబ్దస్య సుఖగర్భిణీ

దశమ స్త్వ మసీ త్యాది వాక్యోత్థమతివృత్తివత్. ౨౧

శబ్దముద్వారా రసము ప్రతీతమగుచున్నను, రసప్రతీతిని అపరోక్షానుభూతి యని చెప్పవలెను. రసప్రత్యాయకమగు శబ్దమునకు సుఖవిషయికమగు అపరోక్షవృత్తిని అంగీకరించవలెను. శబ్దప్రమాణమున కపరోక్షవృత్తియే ఫలాత్మకమగు ప్రమితియని గూడ జెప్పవచ్చును.

ఇందుల కుదాహరణముగా "దశమ స్త్వ మసి" యను వాక్య మీయబడినది. పరమానందయ్యశిష్యులవంటి వా డొకడు తన సహాధ్యాయు లగు తొమ్మిది మందిని మాత్రము లెక్కించి, పదియవవా డేమైనాడని వాపోవగా, దారిన బోవు వివేకు డొకడు వచ్చి మరల నందరను లెక్కించి, వెనుక లెక్కించినవానితో "నీవు పదియవవాడవు" అని నాడు. ఈవాక్యమును విని తనను పదియవవానినిగా సాక్షా త్కరింప జేసికొన గలిగినాడు. ఈయనుభూతి శబ్దజన్య మైనను ప్రత్యక్షముగా ప్రతీయమాన మైనది యని మరువరాదు. కావుననే శాబ్దమగు రసాభివ్యక్తిని ప్రత్యక్షానుభూతిగా గ్రహించవలెను.

నిత్యం సుఖ మభివ్యక్తం "రసో వై స" ఇతి శ్రుతేః,
ప్రతీతిః స్వప్రకాశస్య నిర్వికల్పసుఖాత్మికా. ౨౨

"రసో వై సః" అను తైత్తిరీయోపనిషద్వాక్యమున బ్రహ్మను రసముగా నిర్వచించుట గలదు. "విజ్ఞాన మానందం బ్రహ్మ" యనుచో బ్రహ్మను ఆనందముగా గ్రహించినారు. లోకోత్తరానందము బ్రహ్మపదార్థము నగు రసము నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తముగా నభివ్యక్త మగును. స్వయంప్రకాశము, స్వతఃసిద్ధము నగు రసప్రతీతిని నిర్వికల్ప సుఖాత్మికమనవలెను. సంసర్గరహిత మైనది నిర్వికల్పము. సంసర్గాసంగి యై, అఖండార్థరూపమున నున్నది నిర్వికల్పక జ్ఞానము. ఇట్టి జ్ఞానావగతియే రసప్రతీతి. * (* మొదటి అనుబంధము చూడుడు)

ఆబాలగోచరమగు లౌకికసుఖము సత్త్వగుణ పరిణామ రూపము, దుఃఖానువిద్ధము, సాదర ముపాదేయమానము నైనది. లోకోత్తరమగు సుఖము నిత్య చిదానంతాత్మ స్వరూపము, సుఖపదవాచ్యము, ఉపేయము నైనది. అవిద్యావృత మగు లోకోత్తరసుఖము ఆవరణభంగ మైననే అనుభూత మగును. ఆవరణభంగమున అభివ్యజ్యమాన మగు అలౌకిక సుఖము రసముగా సాక్షాత్కృత మగుచున్నది. రసప్రతీతి యందు విభావాది జ్ఞానప్రయుక్త మగు సాధారణీకరణ నిబంధనమై ఆవరణభంగ మగుట గలదు. ఇట్టి సుఖప్రతీతి విగలిత వేద్యాంతరము.

కార్యజ్ఞాప్యాది వైధర్మ్యం య త్తు కైశ్చి న్నిరూపితమ్,
త ద ప్యే తేన మార్గేణ యోజ్యం శాస్త్రావిరోధతః. ౨౩

మట్టినుండి కుమ్మరి కుండను జేయునట్లు, విభావాదుల నుండి జన్మించునది రసమను వాద మొకటి గలదు. చీకటిలో నున్న వస్తువును దీపము బహిర్గతము చేయునట్లు, విభావాదులచే జ్ఞాప్య మగునది రసమని మరియొక వాదము గలదు.

విభావాదులను రసకారణముగా గ్రహించ వీలులేదు. కారణమే కార్యరూపమున పరిణమించుటచే కారణత్వస్వభావము కార్యమున కన్పించుటయేగాక, కార్య ముత్పన్నము కాగా కారణరూపముతో కారణ ముండజాలదు. పాలనుండి పెరుగురాగా పాలయొక్క స్వభావము పెరుగున గలదు; పాలు పాలుగా నిలచుటలేదు. కాని రసప్రతీతిలో విభావాదులు నశిం

చుటలేదు. రసము నాత్మగా అంగీకరించవలెనని సిద్ధాంతించి తిమి. ఈ యాత్మ కారణజన్యము గాదని స్పష్టము.

రసమును జ్ఞాప్యముగాగూడ నెంచ వీలులేదు. దీపము నకు, తదభివ్యక్త వస్తువునకు విషమసత్తాకస్థితి లేనిచే ఇచట జ్ఞాప్యత్వము సిద్ధించదు. జ్ఞాప్యమగు వస్తువు వేరు, జ్ఞాపక మగు దీపము వేరు. ఇట్లు స్థాయిభావము వేరు, స్థాయిభావ ముతో సంయోగము నందని విభావాదులు వేరు అని చెప్ప జాలము. విభావాదులకు స్థాయితో సమసత్తాకత్వము గలదు.

పరమానంద ఆత్మైవ రస ఇత్యాహు రాగమాః,
శబ్దత స్తదభివ్యక్తి ప్రకారోఽయం ప్రదర్శితః. ౨౮

పైన వివరించిన యుక్తులు, ఉపనిషద్వాక్యములు గూడ పరమానందస్వరూపమగు ఆత్మయే రసమను సిద్ధాంత మును ప్రతిపాదించుచున్నవి. చిదాత్మకుగల ఆవరణ భగ్నము కాగా ప్రతీయమానమగు పరమాత్మయే రసము. శబ్దరూప మున రస మెట్లు అభివ్యక్త మగుచున్నదో వివరించితిమి. శబ్దముద్వారా సుఖాభివ్యక్తి యగు ప్రకారమును వివరించి తిమి. మీమాంసకులు సహిత మిట్టి ప్రక్రియ నంగీకరించు చున్నారని తర్వాతిశ్లోకమున చెప్పబోవుచున్నాడు.

అర్థవాదాధికరణే నవశైలాదివర్ణనమ్,
శ్రోతౄణాం సుఖమాత్రార్థ మితి భట్టై రుదాహృతమ్.

పూర్వమీమాంసా దర్శనమున మొదటి అధ్యాయ ములో రెండవపాదమున అర్థవాదాధికరణము గలదు. ఇందు

"విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః" అను సూత్రము గలదు. అర్థవాదములు విధులలో జెప్పఁబడిన ఉద్దిష్ట విషయమును ప్రశంసించునవగుటచే, వీటికి విధులలో నేక వాక్యత్వము నంగీకరింపవలెనని అర్థము. ఈ సూత్రముపై గల శబరభాష్యమును వ్యాఖ్యానించుచు కుమారిలభట్టు "కేచిత్ స్వయమేవ శ్రూయమాణ గంధమాదన వర్ణక ప్రభృతయః ప్రీతిం జనయంతి" అని వ్రాసెను. గంధాది శబ్దములను వినగా శ్రోతలకు సుఖమాత్రార్థమే ప్రతీతమగు నని అర్థము. ఇచట శబ్దమునుండి సుఖవ్యక్తి కలుగగలదని అంగీకరింప బడినది.

కార్యాన్వితత్వవాదేఽపి న విరోధోఽస్తి కశ్చన,
యస్మాత్ కృతీప్సితత్వేన కార్యం సుఖ మపీష్యతే. ౨౩

కార్యాన్విత పదార్థములకు మాత్రమే శాబ్దబోధ గలదని వాదించు ప్రాభాకరమీమాంసకులకు గూడ కార్య పదార్థముగా చెప్పబడ దగు సుఖాభివ్యక్తి సమ్మతమే యగు ననుట నిర్వివాదము.

అలౌకికనియోగే తు న కించి న్మాన మీక్ష్యతే
లోకే వాచాం చ సర్వేషాం తత్పరత్వం న యుజ్యతే. ౨౪

లోకానవగత ప్రవర్తనా పర మగు వాక్యమే ప్రామాణికమని వాదించువారలు పై జెప్పిన సుఖాభివ్యక్తి నంగీకరించ జాలరు. కాని వేదవాక్యములు ప్రవృత్తి నివృత్తి ప్రయోజకము లైనట్లు, లౌకికవాక్యము లన్నియు ప్రవృత్తినివృత్తి

ప్రయోజకములు కాజాలవనుట అనుభవసిద్ధము. కావున నీ వాదము ప్రామాణికముగాదు.

ప్రయోజనవ దజ్ఞాత జ్ఞాపకత్వం చ మానతా,
శబ్దస్య కార్యపరతా త్వాచార్యై రేవ ఖండితా. ౨౭

అజ్ఞాతవిషయమును జ్ఞాపకము చేయుట ప్రమాణము యొక్క ప్రయోజనము. ప్రమాణాంతరానధిగతమై అజ్ఞాతమైన విషయమును గూర్చిన జ్ఞానమును కలుగజేయుటయే ప్రవర్తక జ్ఞానముయొక్క ప్రమాణత. శబ్దము కార్యపరము గాదని, అజ్ఞాతజ్ఞాపక మని తాత్పర్యము. ప్రమాణభూత మగు శబ్దమునకు కార్యపరత్వమును వేదాంతసూత్రభాష్యమున సమన్వయాధికరణమున శ్రీ శంకర భగవత్పాదులు ఖండించి యున్నారు. గనుక శబ్దమును కార్యపరముగా గ్రహించ నీలులేదు.

దేవతాధికృతిన్యాయాత్ పదై రన్యపరై రపి,
ప్రయోజనవ దజ్ఞాతా బాధితార్థమతి ర్భవేత్. ౨౮

బ్రహ్మసూత్రములలో మొదటి యధ్యాయమున మూడవ పాదమున దేవతాధికరణాలో "భావంతు బాదరాయణోఽస్తి హి" అను సిద్ధాంతసూత్రము గలదు. ఈసూత్ర వ్యాఖ్యానావసరమున అర్థవాదములకు విధిస్తావకత్వమును శ్రీ శంకర భగవత్పాదులు సిద్ధాంతించినారు. విధేయ స్తుతి తాత్పర్యము గలిగిన అర్థవాదములు విధివాక్యములను బాధించ జాలనివి. ప్రమాణాంత రాబాధితములై, ఫలభూత

ములగు నర్థవాదములకు ప్రవృత్త్యంగత్వమును చెప్పవలెను. అనగా అన్యవిషయపరము లగు శబ్దములు స్వీయార్థమును ముందు అప్పగించినతర్వాతనే అన్యార్థము నొసగ గలవని తాత్పర్యము.

తస్మా దన్యపరత్వే వా స్వాతంత్ర్యే వాపదానినః,
వ్యంజయంతి పరానందం సహకార్యానురూప్యతః. ౩౦

ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ మధు
సూదన సరస్వతీ విరచితే శ్రీ భగవద్భక్తిరసాయనే
భక్తిరస ప్రతిపాదకో నామ
తృతీయోల్లాసః

అర్థవాదములను వ్యాఖ్యానించినరీతిగా శబ్దముల నన్యపరములుగా గాని, స్వతంత్రములుగా గాని గ్రహించవచ్చును. భక్తిరసమున గూడ శబ్దములు స్వఘటితవాక్యప్రతిపాద్యేతర తాత్పర్యకములు గావచ్చును. లేక స్వప్రయోజ్య తాత్పర్య పరములు గావచ్చును. విభావానుభావ వ్యభిచారి భావముల వ్యాపారముతో నానుకూల్యము గలిగిన శబ్దములు సామ్యాతిశయ వినిర్ముక్త మగు పరానందమును వ్యంజనావృత్తిద్వారా ప్రతిపాదించు చున్నవి. ఈ పరానంద మనబడు రసమునే భక్తిరస మని వ్యవహరించవలెను. ఆలంకారికులు వ్యవహరించు శాంతరసము, భక్తు లనుభవించు భక్తిరసము వేదాంతులు ప్రసంగించు రసముఅనున వన్నియు పర్యాయ పదములు.

భావై ర్యస్యా విలసితా నిజచిత్తవృత్తి
రాసస్నే లక్ష్యోపపదై శ్చ రసాదిరూపాన్
ఆస్వాదయోగ్యసుభగాన్ పరిదీక్షితోఽహం
నిర్ణేష్యే కుత్ర రసభావవికల్పమార్గే.

గద్య

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ మధుసూదన
సరస్వతీ విరచిత శ్రీ భగవద్భక్తి రసాయనమును,
ఆంధ్రవివృతియందు, భక్తిరస ప్రతిపాదక
మను మూడవ యుల్లాసము
సమాప్తము.



# అనుబంధము ౧

భారతీయం చ శాస్త్రార్థం తథాఽభినవభారతీమ్,
సాకల్యేన సమాలోచ్య రసవ్యాఖ్యాం సమారభే.

యత్రైవ నాట్యే సుఖ మాలభేయుః
యతశ్చ నిర్వాణ మశేషలోకైః
తం నాట్యవేదం స్వధియా విచార్య
రసస్వరూపం తు బ్రవీమి దృష్ట్వా.

కావ్యమున, నాటకమున రసము ప్రతీయమాన మగును. అనుభూతి లేనిచో రస మవగతముకాదు. కావ్యమున గల అనుభూతిని రసప్రతీతి యందురు. ఈ రసప్రతీతి యెట్టిదో తెలిసికొనిన రసస్వభావము తెలిసినట్లే యగును. రసప్రతీతి హేతుకమగు విషయము, తదుద్దీపనము, సంచారిభావము మేల్కొనుటకు తగిన కారణము, సంచారిభావము, అనుభావ ములు, భావన, నిష్పన్నమగు అర్థము మొదలగున వన్నియు రసప్రతీతిలో గలవు. వీనిద్వారా చిత్తద్రవీకరణ, నిష్కామ భావన, లోకోత్తరానందము కలుగుటచే నివి రసప్రతీతియొక్క ముఖ్యస్వభావములుగా కన్పించుచున్నవి. పురుషార్థములలో ముఖ్యమైనదగు సౌందర్యమును ప్రత్యక్షముగా నవగతముచేయ జాలిన దగుటచే రసప్రతీతి అర్థవంతము, ప్రయోజనవంతము నగుచున్నది.

ఈవిధమగు రసానుభూతియొక్క స్వభావమేమి? ఇది అన్యార్థసాధకము గాదు. సాధ్యరూపమగు నీ అనుభూతి స్వతఃసిద్ధశక్తి గలిగియున్నది. ఈ స్వతఃసిద్ధశక్తిని గ్రహించుటయే రసానుభూతి ప్రయోజనము. యశస్సు, అర్థము, శివేతరక్షతి, వ్యవహారవేత్తృత్వము మొదలగునవి కావ్యముద్వారా లభించినను, ఇవి రసానుభూతియందుగల ప్రయోజనములు కాజాలవు. భావనానుప్రాణితమైన చిత్తమును సంతృప్తి పరచుటయందే రసానుభూతికి పరమ ప్రయోజనము గలదు. యశస్సు మొదలుగా గలవి కావ్యమొసగు ఉపయోగములే కాని, కావ్యప్రయోజనములు కావు. కావ్యసమీక్ష చేయ గోరినచో కావ్యానుభూతిని వదలిన లాభములేదు. ఈ యనుభూతి లౌకికజగత్తులోని భాగము కాదు; లౌకికజగత్తునకు అనుకృతికూడ గాదు. ఇది స్వయంసిద్ధము, స్వయంపోషకము, స్వతంత్రము, సమగ్రము నగు వేరొక జగత్తు. ఈజగత్తు నవగతము చేసికొనగోరినచో నీప్రపంచమున ప్రవేశించి, అందలి నియమములకు కట్టుబడి, లౌకిక జగన్నియమానుగతమగు దేశకాలాదులను పరిత్యజింపవలెను. ఐనను కావ్య లౌకిక జగత్తులకు అంతర్లీన సంబంధము కలదు. కాని, కావ్యనిష్ఠమగు రసానుభూతిలో వివిధాంశముల కనన్యత్వము గలదు. మహత్తరమగు భావాన్వితమై, సౌష్ఠవాన్వితమైన ఈ యనుభూతి సుందరముగా ప్రతీయమాన మగుచున్నది. ఈవిధముగా 'బ్రాడ్లే' యను సాహిత్యసమీక్షకుడు నిర్వచించినాడు.

రసప్రతీతిలో విశిష్ట విషయముల సన్నివేశము గలదు. విభావానుభావ వ్యభిచార్యాది విశిష్ట విషయములు విశిష్టార్థమును రసముగా నభివ్యక్తము చేయుచున్నవి. ఈ విషయములన్యోన్య సంబంధము కలిగి, పరస్పరోపకారకములై, భిన్న విషయముల నేకసూత్రమున గ్రథింప జాలి రసమనబడు అనుభూతి నిచ్చుచున్నవి. భిన్నవిషయముల కేకత్రానుసంధాన మేరీతిగా వచ్చుచున్నది? తజ్జనిత సమగ్రానుభూతిస్వభావ మేది? అను ప్రశ్నలను రసప్రతీతివిచారమున వివేచింపవలెను. సౌందర్యముగా నభివ్యక్తమగు నీ స్వభావము విషయగత గుణము కాదు; వ్యక్తిగతగుణము కూడ కాదు. ప్రమాతృ ప్రమేయముల కనన్యత్వమును నిరూపించు రసానుభూతియే సౌందర్యము.

2. రసానుభూతిని విమర్శించుటకు ముందొక చిన్న విషయమును గమనింపవలెను. కావ్యసృష్టియందు కవికిగల యనుభూతికూడ రసానుభూతిశబ్దముచే చెప్పబడుచున్నది. కావ్యమును వ్రాయుటకుముందు కవికిగల అనుభూతి కావ్య రచన చేయునప్పుడు గల అనుభూతికంటె విలక్షణమైనది. ఈ వైలక్షణ్యమును గుర్తించుకొని కవియొక్క అనుభూతికి, పాఠకుని అనుభూతికిగల సంబంధమును విచారింపవలెను.

ఈ రెండు అనుభూతులు విలక్షణములైనవని అలెగ్జాండర్ యొక్క వాదము. భావనానుప్రాణితమై సంపూర్ణమైన అనుభూతినుండిగాక, విషయముద్వారా ఉత్పన్నమైన సంచారిభావోద్దీపనమునుండి కవి, కావ్యరచనకుపక్ర

మించుచున్నాడు. ఉచ్చరితములైన శబ్దములే భావనావశమగు అనుభూతిని లక్షించుచున్నవో, దానికి మించిన అనుభూతి కవికిలేదు. ఏమి చెప్పవలయునో, ఎట్లు చెప్పవలయునో గూడ కావ్యము పూర్తియగువరకు కవికిగూడ తెలియకపోవుటచే కావ్యము కవియొక్క భావనను ప్రదర్శించుచున్న దనరాదు. భావనాలక్షితమైన అనుభూతి, కావ్యారంభమున కవికిలేదు. ఉచ్చరిత శబ్దములలో ఆ శబ్దములద్వారా నవ్యముగా ఆవిర్భవించునది రసానుభూతియని ఈవాదసారాంశము.

కవికిగల భావోద్దీపన అతని నాకర్షించిన విషయమునకు చెందినది. ఈవిషయము కావ్యముకన్న విలక్షణమైనది. భావోద్దీపనగల కవియొక్క అనుభూతియే రసానుభూతి యని అలెగ్జాండర్ చెప్పుటతప్పగు. కావున కావ్యరచనావశమున కవికిగల అనుభూతికి తుల్యమగు అనుభూతిని శ్రోతృక సామాజికులుగూడ పొందగలరు. కవియొక్క అనుభూతినే ప్రధానముగా మనముస్వీకరించి, అదే రసానుభూతియని యంటిమేని, కావ్యము నిరర్థక మగును. కావ్యమున నిరర్థకమైన రసానుభూతియే ఉండదు. అందుచే కావ్యరచనకు పూర్వముగల కవిమనస్థితులతో సాహిత్యమీమాంసకు ప్రసక్తి ఏమియు లేదు. ఆమనస్థితులను విమర్శించునది మనస్తత్వశాస్త్రము. మనస్తత్వశాస్త్రము విమర్శించువిషయమే సౌందర్యమీమాంసలో గల విషయమని భ్రమించుటచే నిట్లు అలెగ్జాండర్ పొరబడినాడు. ఇంతేగాక అలెగ్జాండర్ వాదములో కావ్యమునగల భావ రూపములు అత్యంతభిన్నములు. కాని, భావరూప

సంయోజనగిలిగి, భావరూపము ల నభిన్నముగా జూపజాలిన కావ్యముననే కావ్యత్వము గలదని విస్మరింపరాదు.

కావ్యరచనలో కవికిగల అనుభూతి, కావ్యానుశీలన మున సాకర సామాజికులకుగల అనుభూతి, భిన్నములు కావని చెప్పుటకు తమతమ యనుభూతులను వివరించి చెప్పిన కవుల వాక్యములే ప్రబలాధారములు. రసమయస్థితి కావ్యమున ఉపహితమై యున్నది. ఇట్టి కావ్యముద్వారా కవికి గలిగిన అనుభూతిని తనదిగా చేసికొని అనుభవించుటకు సామాజికుడు యత్నించును. అనగా కవిగత సాధారణీభూత సంవిన్మూలమైనది కావ్యపురస్సర మగు నటవ్యాపారము. ఈ సంవిత్ వాస్తవమైన రసము. దేశకాలా ద్యుపహితమగు వ్యక్తిత్వము మాటుపడి నవ్యస్వరూప స్వభావావిర్భావము ననుభవింప జాలిననే కవి కావ్యరచన చేయగల్గును. దేశకాల ప్రమాతృ భేదములచే ననియంత్రితమైన కవియనుభూతి, స్వార్థరహితమై బాహ్యజగదంతర్లీన మగును. ఇతరుల అనుభూతులను కవి యనుభవింపగలుగుచున్నాడు. ఇతరులతో తాదాత్మ్యము నందగా సంభవించు అనుభూతులు కావ్యమున నుచ్చరింప బడుచున్నవి. ఈవిధముగా అనుపహితమై పురుషవ్యాపార నిష్పముగానిది, అపౌరుషేయము నగు స్థితిని నిర్దేశించునది రసానుభూతి. ఈవిధముగ అనుభూతి, కవికి, సామాజికులకు గూడ కలదు. కవియొక్క అనుభూతియే సామాజికునకు కలుగనిచో కవి చెప్పుమాటలలోని భావ మవగతము కాజాలదు. కవి ఉచ్చరించిన భావాదు లనుభూయమానములు

కాలేవు. కావున కవి సామాజికతుల్యుడని అభినవగుప్తు డనగలిగినాడు. సామాజికులతో తాదాత్మ్యము నందుట చేతనే కవి, కవియని పిలువబడుచున్నాడు.

కవి ప్రదర్శించు అనుభూతి మనలో నంతర్లీనమై యున్నది. మనలో లేని అనుభూతులను మన మనుభవింప లేము. ప్రమాతృ ప్రమేయముల కనన్యత్వము సిద్ధించగా, దేశకాలాద్యనుపహితముగా ప్రమాతయందు కన్పించు పరి ణామమే అనుభూతియొక్క సామాన్యలక్షణము. ఈ పరిణామ మితఃపూర్వ మంతర్లీనముగా కారణరూపమున ప్రతివ్యక్తిలోను గలదు. అందుచే నవ్యముగా కన్పించు ప్రతి అనుభూతియు ఆత్మలో సంస్కారముగా నుండుటచే రసానుభూతిలో మన నిజస్వభావము మనలో నభివ్యక్తమగుచున్నది. జ్ఞానము సంచా ర్యాదులతో మేళవించగా; మనోహృదయము లనన్యములుగా కన్పించునట్లు చేయునదే యనుభూతి యగుటచే ఉత్తమ మైనదిగా మనము భావించుచున్నాము. ఈవిధమైన అనుభూతి మానవస్వభావమునకు విరుద్ధమై కవులచే మనపై నారోపితము గావింపబడిన దైనచో మనము దీనిని అనుభవింపజాలము. మన భావములను, మనోవృత్తులను భావలావణ్య యోజన ద్వారా కవి ప్రదర్శించుచున్నాడేగాని, వేరుగాదు.

దీనినిబట్టి కవి, సామాజికు లత్యంత విలక్షణ వ్యక్తులని భావించరాదని తెలుచున్నది. వీరికి కేవలము తరతమభేదమే కలదు. కవికి, నాయకునకు, సామాజికునకు సమానాను భవము కలదని తౌతభట్టు చెప్పినాడు. దేశాకాలా ద్యనుప

హిత తత్త్వమున కవి యనుభవించు భావాదికము కావ్యగత శబ్దమున స్పందించుటచే నీ సమానానుభవము రాగల్గు చున్నది. కావ్యానుశీలనమైన వెంటనే మనల నేవిధమగు భావనానుప్రాణితమైన అనుభూతి ఆవేశించుచున్నదో, అట్టిదే. కావ్యారంభము కాగానే కవినిగూడ ఆవేశించి యుండును. సంశ్లిష్టభావాదికములతో గూడిన అనుభూతి పూర్తిగా సమగ్ర ముగా కవి మానసమున నవతరించగనే తదుపాధిభూతమైన కావ్యముగూడ నవతరించుచున్నది. కావ్యానుశీలనానంతరము కూడ మనలో నీ యనుభూతి యున్నట్లు శబ్దోపహితము కాకముందు సహితము కావ్యావచ్ఛిన్నమైన అనుభూతి కవిలో గలదని భావము. భావనానుప్రాణితమైన రసానుభూతి శబ్దములచే నభివ్యక్త మగుచున్నది. రసానుభూతికి రూపనిష్పా దన చేయు శబ్దములకు పూర్వమే సమగ్రముగా, స్వయంసిద్ధ ముగా నీ యనుభూతి కలదు.

పైవిచారణలో కావ్యరచనకు తోడ్పడునది ఆవేశమని చెప్పబడినది. దేశకాలాద్యుపాధులను భగ్నము చేయునది ఆవేశము. ఇందు భావనాసమున్మిషితములైన స్థాయి సంచారి భావము లుద్దీపితము లగును. ఈ ఉద్దీపనావస్థ శబ్దరూపమున నుండదు; కాని శబ్దములద్వారా బహిర్గతమగును.

బాహ్యజగత్తులోని ఒకానొక విశిష్టవిషయము ననుభ వించుట, కవిగతమైన ఉద్దీపితావస్థలోగలదు. ఈయనుభూతిలో భిన్నవిషయములకు సమన్వయము కన్పించుటచే నిది ప్రయో

జనసంవలిత మగుచున్నది. కాని కావ్యోత్పత్తి లేక కావ్య రచన యనబడు ప్రవృత్తికి సమన్వయావస్థ సహకారి గాదు. సమన్వయావస్థనుండి కావ్యరచనాప్రవృత్తి కలుగుచో నీ యవస్థలో సమన్వయము నాటంకపరచు అంశ ముండక తప్పదు. అన్యవిషయములతో సంఘర్షణ కలిగి, బహిర్నిర్గమన మునకు ప్రయత్నించు అంశమిది. దీనిద్వారా కావ్యము వచ్చుచున్నది. ఉద్దీపితమైన మనోవృత్తి త్వరత్వరగా మారి పోవుటచే నీయంశ వచ్చుచున్నది. ఈమార్పువలన గతించిన అనుభూతికి కవి చేతులుసాచుచు, గతమును స్మరింపసాగును. ఈస్మరణమున గతించినది స్పష్టతను క్రమక్రమముగా కోల్పో వుటచే గతించిన అవస్థను కవి చిత్రించుచు, కాలవేగమున వచ్చిన మనోదుఃఖమును పోగొట్టుకొన దలచును. గతించిన అనుభూతి పూర్తిగా పునరుజ్జీవిత మగుట దుర్లభము. కాని స్వాభీష్టమగు నీయనుభూతిని తన మనోవృత్తులద్వారా ప్రదర్శింప జాలుటచే కావ్య మీ ఆశా స్మరణములను మాత్రమే స్పష్టముగా చెప్పగలుగుచున్నది. కావున కావ్య మున కవికి గలిగిన పూర్వానుభూతి యథామాత్రకముగా నుండదు. ఇందుచే కావ్యరచనకు పూర్వము కవికిగల యను భూతి కావ్యరచనలో గల అనుభూతికంటె కొంతవరకు విలక్ష ణమే యని చెప్పవలెను.

కావ్యరచనలో కవికిగల అనుభూతి కావ్యానుశీలనమున పాఠకునకు గలుగు అనుభూతికంటె భిన్నమైనది కాదు. విభావ ములచే నాహృతమైన అర్థము వాచి కాంగిక సాత్త్వికాభి

నయములద్వారా అభివ్యక్తమగుచున్నది. త్రివిధాభినయముల ద్వారా కవియొక్క భావమును భావనావ్యాపారవశమున మనము అనుభవించుటచే దీనిని భావ మనుచున్నాము. బాహ్యజగత్తు కొన్నిభావములను మనలో రగుల్కొలుపు చున్నది. ఇవి అభినయములద్వారా తెలియుబడుచున్నవి. భావనావశమున వీటిని అనుభవించి కవి మన కర్పించు చున్నాడు. వీటిని శబ్దరూపమున నుచ్చరింపకముందు వీటినిగురించిన స్పష్టమగు జ్ఞానము కవికి లేకపోవచ్చును. కాని ఈ అనుభూతికి కావ్యరూపము నీయగా భావనద్వారా మనకిది అవగతమగుచున్నది.

కావ్యరచన సాగుకొలది కవియొక్క భావము క్రమ క్రమముగా పరిపుష్ట మగును. ప్రతినవ్యశబ్దముతో భావము పరిణత మగుచున్నది. భావనారూపమున అస్పష్టముగా నున్న భావము అభివ్యక్తిని, పరిపోషమును గోరుచు కవిలో ఉండును. తాను చెప్పదలచిన దంతయు కవిమానసమున మొట్టమొదటనే యున్నచో కావ్యరచనకు పూనుకొనవలసిన అవసరము లేదు. కాని తానేమి చెప్పదలచినాడో అది కావ్యము పరిసమాప్తి యైనపుడే కవికి స్పష్టముగా తెలియ గలదు. కావ్యరచన కుపక్రమించినపుడు, కావ్యరచనలో నున్నపుడు, కావ్యమందలి భావము కవియొక్క అధీనమున లేదు. భావాధీనుడై యున్నవాడు కవి. నిష్పన్నమైన కావ్యాత్మ శరీరము నర్థించుటలేదు. అస్పష్టములైన కొద్దిభావములతో,

కొద్దిశబ్దములతో ప్రతీయమానమై యున్నది. ఈభావములు
పరిపుష్టములై, సమగ్రములైన రసము క్రమక్రమముగా అభి
వ్యక్తమై స్వయంసిద్ధముగా కన్పించును. ఇట్లు సిద్ధించు
కావ్యములు అనిర్వచనీయమైన శక్తినిగలిగి సృష్టింపబడినట్లు
కన్పించుచున్నవి. కావుననే 'ఈవిధమగు కావ్యమందలి భావ
మేమి?' యని ప్రశ్నించుటకూడ అసందర్భప్రలాప మగును.
కావ్యమందలి భావము రసనిష్ఠము. రసము అనుభూయమాన
మగునది. కాగా 'కావ్యగత భావ మేమి?' అను ప్రశ్నకు
'అనుభూతి యననేమి?' అను నర్థము వచ్చుచున్నది.

తన కతీతమై లోకోత్తరమైన శక్తి కవి నావేశించి,
కవియొక్క చిచ్ఛక్తిని దేశకాలాతీతముగా అపౌరుషేయము
గావించినపుడు ఉత్తమకావ్యము సృష్టింపబడుచున్నది. భట్ట
నాయకుడు "యావత్ పూర్ణో నచైతేన తావ న్నైవ వమ
త్యముం" అనినాడు. రసము విషయోపహితమై ప్రతీయ
మాన మగుచున్నది. దేశకాలాద్యనవచ్ఛిన్నమైన నిజస్వరూ
పమును కవి అనుభవించి, ఇతరులకుగూడ నీ యనుభూతి
కలుగునట్లు దీనిని కావ్యరూపమున ఉపహితము చేయు
చున్నాడు. ఇట్లు చేయునపుడు స్వాత్మావేశమగు నిజస్వరూ
పమును వమనము చేయుచున్నట్లు కన్పింప గలడని భట్ట
నాయక వాక్యములోని అభిప్రాయము.

రసానుభూతి యనగా కవియొక్క మనస్సును పరిశీ
లింపగల్గుట కాదని ఇంతవరకు తేలినది. కావ్యము పూర్తి

యగుటతో సంపూర్ణమైన అనుభూతియే రసానుభూతి. అం దుచే "ప్రతీయమాన మగునది రసము; ప్రతీతి యనగా విశిష్టమైన రసనావ్యాపారము" అని లోచనలో అభినవ గుప్తుడు పల్కినాడు. గుణాలంకారౌచిత్యాదికము ద్వారా వ్యంజనావ్యాపారముతో కావ్యమున రసమును భావింప గల్గు చున్నాము. గుణాలంకారాదియుత మైనను కావ్యము రసాను భూతిని సమగ్రముగా ప్రదర్శింప జాలక కేవలము ధ్వనింప గలుగు చున్నదని భావము. ఈ రసానుభూతిని సూచింప గలు గుటతోనే కవి ధన్యుడగుచున్నాడు. ఉపహిత చైతన్యము గల వ్యక్తు లందరిలోను స్వభావసిద్ధముగా అనుపహిత చైతన్యము వ్యంజిత మగుటచే అట్టివ్యక్తుల కావ్యము లీ వ్యంజనావ్యాపా రము నతిక్రమింపజాలవు. కావున చిద్గతమగు ఆవరణశక్తిని భంగము చేయుటయే రసచర్వణ యని జగన్నాథు డనినాడు. ఒకభావమును మనస్సులో నుంచుకొని వ్రాయ నారంభించి నపుడు, ప్రవృత్తమైన మనస్సు మండుచున్న నిప్పుకణము వలె నుండును. నిప్పుకణము మండుచు క్రమముగా బూడిద యగునట్లు, ప్రవృత్తమగు మనస్సు పూర్వభావమును తనముం దదేరీతిగా ఎక్కువకాలము నిలుపుకొనలేదు. అందుచే అను భూతికి కేవలము ప్రతీక యగు కావ్యమున భావము నుప హితముచేయు శబ్దము ఉపాధి యనబడు ఆవరణమును వ్యం జనా వ్యాపారవశమున భంగము చేయగల్గుచున్నది. తద్ద్వారా కావ్యరచనలో కవికి గల రసానుభూతి కావ్యానుశీలమున మనకుగూడ గల్గుచున్నది.

౩. ఈ విధమగు రసానుభూతియొక్క స్వరూపమును తెలిసికొనవలసి యున్నది. రసానుభూతి యను రసచర్వణలో ఇంద్రియ ప్రత్యక్ష ముండక తప్పదు. కవి చెప్పువిషయమును భావనద్వారా మనము గ్రహించునపుడు మానసప్రత్యక్షముగా నీ విషయమును చిత్రించుకొనుట గలదు. చూచుట, భావించుట అను రెండు ప్రక్రియలు ఇచట గలవు. కావున కావ్యమును భావములతో కాక శబ్దములతో వ్రాయుదుమని యొక ఫ్రెంచి సాహిత్య సమీక్షకు డనినాడు. అర్థప్రత్యాయకమగు శబ్దము శ్రవణేంద్రియ సన్నికర్ష గలిగి సౌందర్యపరిపోషక మగుచున్నది. చెవిటివానికి శబ్దసౌందర్యము తెలియదు. అనగా శ్రవణేంద్రియము వ్యాపృతము కానిదే కావ్యోపహితమైన రసానుభూతి కలుగనేరదు.

"వర్షేషు యద్భారత మార్య ధుర్యాః
స్తువంతి గార్హస్థ్య మివాశ్రమేషు,
తత్రాస్మి పత్యు ర్వరివస్యయాఽహం
శరోర్మిర్మి కిమ్మ్మరిత ధర్మలిప్సుః"

అను శ్లోకమును పైకి చదువునపుడు కలుగు వివిధ బాహ్య సంచలనములద్వారా మన మిందలి భావమును ముందు గ్రహించుచున్నాము.

"యత్పథావధి రణుః పరమ స్సా యోగధీ రపి నపశ్యతి యస్మాత్
బాలయా నిజమనఃపరమాణౌ హ్రీందరీశయహారేకృత మేనమ్"

అను శ్లోకమునగూడ ఇంద్రియసంచలనముల ద్వారా భావ మవగతమగుచున్న దనిన నతిశయోక్తిగాదు.

సామాన్య ప్రత్యక్షమున నొకవస్తు వన్యార్థోపయోగి యగుచున్నది. కాని రసప్రత్యక్షమున నీవస్తువున కన్యార్థాపేక్ష లేదు. ఈవస్తువు తాత్త్వికమా? కాదా? అను ప్రశ్నల నిట వివేచింపము. అన్యార్థ నిరపేక్షకములుగా, స్వయంపోషకములుగా వస్తువులు స్వీకరింప బడుచున్నవి. ఏదియో ఒకపురుషార్థము నిట నవగాహనము చేసికొని దానితో తృప్తిపడుటచే నిట్లు ప్రవర్తించుచున్నాము. వస్తువుల"ను" చూచుటయేగాక, వస్తువుల "లోనికి" చూచుటకు కన్నులను వినియోగించుచున్నాము. కావుననే విమలప్రతిభానశాలి యగు హృదయము కలవాడే రసప్రత్యక్షమున కధికారియని అభినవగుప్తుడనినాడు. కావ్యానుశీలనాభ్యాస వశమున మనస్సు అను దర్పణము విశదీభూతము కాగా, వర్ణనీయ తన్మయీభవన యోగ్యత గలిగి స్వహృదయసంవాదము ననుభవింప గలిగిన ఈ యధికారిని సహృదయు డందురని సహృదయ శబ్దమును లోచనకారుడు నిర్వచించినాడు. హృదయసంవాదమును చేకూర్చు భావము రసోదయకారకమై, ఎండుకట్టెను అగ్ని ఆవేశించునట్లు, శరీరము నంతయు ఆవేశింప గల్గుటయే రసానుభూతిలో సహృదయునకు గోచరించునని భరతుడు సహితము నిర్వచించినాడు.

శ్రవ్యప్రాధాన్యమైనది కావ్యము. దృశ్య శ్రవ్యాత్మకమైనది నాటకము. రూపకావలోకమున కలుగు అవగతి

సామాన్యానుభూతులకంటె విలక్షణ మైనది. ఈయవగతిలో మనస్సు విశదీభూత మగును. అర్థవంతము, ప్రయోజనవంతము నగు భావము సుపహితము గావించి, ధ్వనింపగలిగినది రూపక మగుటచే నీవైశద్యము చాల అవసరము. ప్రత్యక్షముగా భావనావ్యాపారవశమున మన మవగతము చేసికొను ఈ భావము మనల నుద్దీపింప జేయుచున్నది. కాని, అవగతము చేసికొనిన భావము ప్రత్యక్షవిషయమునందలి భాగము కాదు. ప్రత్యక్షవిషయ మీ భావముచే ననుప్రాణితమై సార్థక మగు చున్నది. ప్రత్యక్ష విషయమున ఇంద్రియ గ్రాహ్యముగా భాసించురూపము భావాభివ్యంజకముగా పర్యవసిత మగు చున్నది.

రసప్రతీతిలో ఇంద్రియములేగాక, నరములు, కండర ములు మొదలగున వన్నియు వ్యాపృతము లగుచున్నవి. వస్తుస్వరూపము మన మనోవృత్తుల నొకప్పుడు దిద్దగల్గు చున్నది. నీలిరంగుకన్న ఎఱుపు త్వరగా మనల నుద్దీప్తము చేయగలదు. ఇట్లే ఉచ్చైస్స్వరముకూడ చేయగలదు. ఈవిధ మగు ఉద్దీపన, శబ్దముల స్వరూపము నాశ్రయించుకొని కావ్య మున గలదు గనుక కావ్యప్రతీతిని కేవలము మానసికస్థితిగా చెప్పరాదు. మనస్సు బాహ్యజగత్తుతో ననన్యత్వము నందగా కలుగు పరిణామమే కావ్యరూపమున భాసించుచున్న దని మరువరాదు. మానసికమగు కావ్యము వస్తుతంత్రముగా నావిర్భవించుచున్నదని భావము. బాహ్యవిషయముల ననుసం ధింప జేయబోవు కవి తద్విషయాధీను డగుచున్నాడు. ఏతత్సం

బంధముద్వారా అంతర్లీనముగా, గుప్తముగా నున్న భావ మభివ్యక్త మగుటచే మహత్తరమైన హృదయసంవాదము కలుగుచున్నది. వస్తుగతమగు బాహ్యరూపము కేవల ముపాధిగా గోచరించుటచే ఈరూపము అంతర్లీనమై, అంతర్యామిగా నున్న తత్త్వమునకు తీసికొనిపోవుచున్నది. ఇట్లు రసావస్థను మేల్కొల్ప జాలిన వస్తుస్వరూపము తదనంతరోత్పన్నమగు కావ్యశక్తిసంవలితమై యున్నదని ఎంచవలెను.

దీనినిబట్టి రసప్రతీతిలో భావరహితమైన వేదన లేక అనుభూతి కలదని చెప్పుట ప్రామాదికము. భావోపహితమగు కావ్యము నాశ్రయించుకొని వచ్చు రసచర్వణను శాబ్దీప్రతీతిగాను అపరోక్షాత్మికాప్రతీతిగాను జగన్నాథుడు గ్రహించెను. ప్రత్యక్షగోచరమగు రూపమును అనుభూయమాన మగు భావముతో ననన్యముగా చూపునది కావ్యము. ఇట్టి సంబంధమునే భావాన్వితరూపముగా 'క్లైవ్ బెల్' ప్రతిపాదించినాడు. ఈరూపము భావాన్వితమైనను రూపనిష్పాదనకు హేతుభూతమగు భావమును ప్రధానముగా 'క్లైవ్ బెల్' గ్రహించుటలేదు. భావమును వదలి రూపమునే స్వీకరించుచో రసచర్వణ లభింప నేరదు.

భావరూపముల కవినాభావ సంబంధము కలదు. భావము ఇంద్రియ ప్రత్యక్షయోగ్యమగు రూపమున భాసించుచున్నదని "హెగెల్" వచించినాడు. రసచర్వణలో భౌతికాధ్యాత్మికము లనన్యములుగా ప్రతీయమానములై భావనా

వ్యాపారముల ద్వారా అనుభూయమానము లగుచున్నవి. అస్వార్థసాధకముగా గాక నిరపేక్షముగా అనుభూయమాన మగు రసచర్వణావిషయము అర్థమును లేక భావమును ఉప హితము చేయుచున్నట్లు భాసించును. ఇట్టి భావలావణ్య యోజన అనన్యత్వలక్షణలక్షితమని చూపించుచు పార్వతీ పరమేశ్వరుల సంబంధమును మహాకవి కాళిదాసు వాగర్థముల సంబంధమునకు పోల్చినాడు.

రసచర్వణలో నింద్రియగ్రాహ్య మగు రూపమెట్లు వర్తించుచున్నది? సాహిత్యమున నింద్రియజన్యమగు సుఖ మేమియు లేదని 'రోజర్ఫ్రై' చెప్పుచున్నాడు. "కేవలముగా నున్న రంగున కర్థ మేమియులేదు. స్వరములుకూడ తమంత తాము మనలను మేల్కొలుప లేవు. వర్ణతూలికతో రంగులను వేయు చిత్రకారులు 'రంగు లభివ్యక్తము చేయు గుణములే ప్రధానమైనవి' అని చెప్పుచున్నారు. రంగులరూపములు, ఈ రూపముల కలయికలు అనువానిద్వారా చిత్రకారుని వైదగ్ధ్య మును మనము గ్రహింప గలుగుచున్నాము. రూపముగా పరిణమించినపుడే రంగు అర్థవంత మగుచున్నది" అని 'క్లైవ్ బెల్' యొక్క వాదము. క్రమవిన్యాసానుసారియగు రేఖావర్ణ సంయోగమే రూపము. స్థాయిభావప్రవృత్తిలోని భావముల సంపర్కము లేనిదై చిత్రలేఖకుని దృష్టి యుండుటచే ఈ రూపమును నిరపేక్షబుద్ధితో నవగాహనము చేసికొనగలుగు చున్నామని 'రోజర్ఫ్రై' చెప్పుచున్నాడు. కావున భావరూప ములలో రూపమే రసచర్వణయందు ప్రధానమైనదని వీరి

వాదసారాంశము. ఈసూత్రమును కావ్యమునకుగూడ వర్తింప జేయవచ్చును. శబ్దములు కేవలము శబ్దములుగా అర్థవంత ములుకావు. అందుచే శ్రుతికటుత్వాది దోషములుకల వర్ణములు సందర్భవశమున దోషరహితము లగుచున్నవి. శబ్దములరూప ములు, ఈరూపముల సంయోగములుమాత్రమే రసచర్వణలో అర్థవంతములు కాగలవు. కావున రసభావాదికమువలన కావ్య మర్థవంత మగుటలేదు. కేవలము శబ్దస్వరూపవిన్యాసవశమున కావ్యము ప్రయోజనవంత మగుచున్నది.

కాని, రసచర్వణను భావచర్వణగాను, రూపచర్వణ గాను, విభజించుట అనుభవవిరుద్ధము. రూపనిష్ఠములైన గుణములుమాత్రమే రసచర్వణలో గలవనుట యుక్తియుక్తము కాదు. కావ్యసృష్టిలో రూపమును భావాసంబద్ధముగా గ్రహించి కవి నిష్పన్నము చేయుటలేదు. ఉపాధిగా భాసించు రూపమే, అనగా ఉపహితమైన భావముగల రూపమే, కవి సామాజికు లపేక్షించునది. రూపముయొక్క స్వభావము భావము నాశ్రయించుకొని యున్నది.

శబ్దములకు గల అన్యోన్య సంబంధముల ద్వారా శబ్ద ములు సౌందర్యమున పర్యవసితము లగుచున్నవని రూపవాదు లనుచున్నారు. కాని సంబంధమును పొందు వ్యక్తులగు శబ్ద ములను వదలి సంబంధములనే ప్రధానముగా స్వీకరించునపుడీ సంబంధములు మృగతృష్ణికవంటివని మఱువరాదు. శబ్దముల నాశ్రయించుకొనిన సంబంధములు శబ్దములు లేకుండా వచ్చు నవిగావు. శబ్దనిష్ఠమైన శ్రవణేంద్రియ వ్యాపారమును రస

చర్వణనుండి తీసివేయలేము. పైగా శబ్దములను గ్రహించు
నపుడు, శబ్దములయం దుపహితమైయున్న భావమును పరి
త్యజించలేము. కావుననే వివిధరీతులను నిర్వచించునపుడు
ప్రాచీనాలంకారికులు శ్రవణేంద్రియప్రవృత్తిని, మనఃప్రవృత్తిని
కూడ గ్రహించియున్నారు. శ్రుతిదుష్టాది దోషములుగల
వర్ణములు కొన్నిసందర్భములలో రసపోషకము లగుచున్నవి.
శృంగారమున యోగ్యముకాని వర్ణములు రౌద్రమున సామం
జస్యము నందుచున్నవి. శ్రుతిదుష్టత్వ మున్నంతమాత్రమున
నొక వర్ణమును రసభంగహేతువుగా గ్రహించరాదు. ఈ
న్యాయము ననుసరించి దోషము లనబడునవి సందర్భవశమున
గుణములుగా పరిణమించగలవని మహిమభట్టు, భోజుడు
మొదలుగాగల సమీక్షకులు పలికినారు. కావున ఇంద్రియ
గ్రాహ్యమగు రూపము సందర్భవశమున అనుస్యూతముగా
వచ్చు భావమున పర్యవసితమగుచున్నదని తెలుచున్నది.

రూపవివేకమున నుపయుక్తము లగుటచే రసప్రతీతి
యందు ఉత్తమేంద్రియములగు చక్షుః శ్రవణములు పూర్తిగా
ప్రవృత్తములగుచున్నవి. రసచర్వణలో నీ రెండు ఇంద్రియ
ములు కన్పించుటచే క్రీడనీయకమగు రూపకమును "దృశ్యం
శ్రవ్యం" అని భరతుడు పలికినాడు. దృశ్యమగుటచే ప్రీతి
ప్రదము, శ్రవ్యమగుటచే వ్యుత్పత్తిప్రదము నగుచున్నది.
ప్రీతి వ్యుత్పత్తులు రెండును వసరమైనవే. వ్యుత్పత్తిప్రద
మైననే ప్రీతి ముఖ్యముగా కన్పించుటచే కావ్యము ప్రధాన
ముగా బుద్ధిగ్రాహ్య మగుచున్నది. కేవలము బుద్ధిచేతనే

గ్రహింపబడదగిన అర్థము నుపహితముగా ప్రదర్శించునది రూపమగుటచే రూపము భావాభివ్యక్తికి అతిముఖ్యమైనదగుచున్నది. రూపమున నంతర్యామిగా నున్న భావమూ రూపసద్భావమునకు హేతువగును. అనుభావములను మేల్కొలుపు రూపము జ్ఞానానుస్యూతమని భావము.

ఒక స్వరము మరియొక స్వరముతో గాని, ఒక రంగు మరియొక రంగుతో గాని సమన్వయము నందుచో నీ స్వరమున ఆరంగులోను స్వతఃసిద్ధ మగు వ్యంజనావ్యాపారము కలదని చెప్పవలెను. ఒక లయ మరియొక లయకు సమగ్రత్వము నాపాదించినను, ఒక స్వరము మిగిలిన స్వరములతో గలసి శ్రవఃపేయ మైనను, వర్ణవిన్యాసవశమున మరియొక వర్ణము నియంత్రిత మైనను, ఇంద్రియగ్రాహ్యములగు నీరూపములలో జ్ఞాన మంతర్లీనమై ప్రవృత్త మగుచున్నదని గ్రహించక తప్పదు. అంతర్లీనమైన జ్ఞాన మీ రూపముల నన్యార్థపర్యవసితములుగా చేయుచున్నది. అన్యార్థ మిచట రస మని యనవలెను.

భావ రూప సంయోజన గల కావ్యమున భావమును గాని, రూపమునుగాని, త్రోసివేయలేము. ఒక్కొక్కచో రూపజనితములగు అనుభావములు రసచర్వణలో వైశిష్ట్యమును చూప గల్గుచున్నవి. భావభేదము ననుసరించి కవులు ఛందస్సును మార్చుట గలదు. రతీవిలాపమున, అజవిలాపమున మహాకవి వియోగినీవృత్తమును గ్రహించినాడు. యతి

విలాపమున మందాక్రాంత వచ్చినది. ఛందో లయతాలాది
కము ద్వారా అభిహితమగు భావమురూపహితము కాజాలదు.
కావున ఛందస్సును, లయను, శబ్దములను తీసివేసినచో
కావ్యము నిరధిష్ఠానమై అభావరూపమున నుండగలదు. కాని
భావములో సంబంధము లేని రూపమునకు రసచర్వణలో ప్రసక్తి
లేనేలేదు. భావనావ్యాపారమును చక్కగా ఉద్దీపింపచేయ
జాలిన భావముయొక్క రూపమే కావ్యమున కన్పించును.

మనస్సునకుమాత్రమే సంబంధించియుండునది సౌందర్య
మని 'క్రోచే' యను ఇటలీదేశ సమీక్షకుడు పల్కుచున్నాడు.
మనోవృత్తి సౌందర్యప్రతీతిలో ముఖ్యముగా నున్నను, సౌంద
ర్యము కేవలము మానసికస్థితి గాదు. మానసికస్థితిగా సౌంద
ర్యమును గ్రహించుచో కావ్యమునగల రూపమునకు రసచర్వ
ణలో స్థానమే యుండదు. రసములు మనస్సుచే నాస్వాదింప
బడుచున్నవని భరతుడు చెప్పుచున్నను, ఇంద్రియగ్రాహ్య
మగు రూపమును నిరసించుటలేదు. "క్రోచే" వాదమున
కనుగుణముగా నవ్యులు కొందరు 'రత్యాదులకు లౌకిక సాక్షా
త్కారము లేకపోవుటచే విషయసద్భావ మనపేక్షిత మగు
చున్నది' అని పల్కుచున్నారని జగన్నాథుడు చెప్పుచు
న్నాడు. కావ్యమిట్లు నిరధిష్ఠానభ్రమాత్మక మైనచో ప్రయో
జనవంతము, అర్థవంతము అని చెప్పుట స్వవాదవ్యాఘాత
మగును. కావ్యమునకు విషయసద్భావము నంగీకరించవలెను.
తద్ద్వారా కావ్యము బుద్ధీంద్రియములను మేల్కొల్పి రస
చర్వణకు దోహద మొసగుచున్నది.

సౌందర్యమును రూపానువృత్తము చేయుటకు సంవి
త్సంవేదన యవసరము. కాని సంవేదన అర్థవంత మగుటకు
రూపముకూడ అవసరమే. విషయము లశరీరములుగా మనః
ప్రత్యక్షయోగ్యములు కావచ్చునని యెంచుటచే, సంవేదన
బాహ్యవిషయముల నపేక్షించదని చెప్ప సాహసించు సమీ
క్షకులను మనము పరిత్యజించక తప్పదు. నిర్విషయకముగా
సంవేదన ఉండలేదు. బాహ్యజగత్తునుండి భావములను
గ్రహించి, అర్థవంతమై ఆవిర్భవించునది సంవేదన ప్రత్యక్షవిష
యమును పరిత్యజించుటచే సమీక్షకులు అపమార్గమును
త్రొక్కినారు. చిత్రకారుని భావనావాహినిలోగల చిత్రములు
బాహ్యవిషయముల ననుశీలించుటవలన బయలుదేరుచున్న
వని యెంచకపోవుటచే "క్రోచే" అపమార్గమున పడినాడు.
ప్రత్యక్షముగా నొక విషయము ననుశీలించిన తర్వాతనే
దానిని భావింపగలుగుచున్నామని విస్మరించరాదు. బాహ్యజగ
త్తులో వ్యక్తికి కలుగు అనన్యత్వసంబంధము తదుపహితభావా
భివ్యక్తికి హేతువగుచున్నది. ఈ భావాభివ్యక్తిని తెలుపు
వానిలో సాహిత్య మొకటి. కేవల మాత్మానుశీలనమే
చేసికొనువాని కీతత్త్వ మవగతము కాజాలదు.

కొన్ని స్థలములలో "క్రోచే" తనవాదమునే తాను
ఖండించుచున్నట్లు కన్పించును. సంవేదనము భావరూపసంవే
దనమని, రూపము సంవేద్యమని చెప్పుచున్నాడు. స్వరము
శబ్దములయందే సమభివ్యక్తమై అస్తిత్వమును పొందు నని
నాడు. నోటిలోని వివిధభాగములను కదల్చుచు, చెవులలోపల

మ్రోగుచు, శబ్దములు మానల నావరించు నని పలికినాడు. గానము పరిపుష్టమైనచో స్వరపేటికయందు, శ్రోతృయందు సమభివ్యాహృత మగు నని కూడ పలికినాడు. కవియొక్క భావన ఎల్లప్పుడు సశరీరముగానే యుండును అవభాసమానత్వము అవభాస్యనిష్ఠ మగుటచే రసచర్వణయందు విషయధర్మత్వము లేక అర్థధర్మత్వము కలదని అలంకారసర్వస్వవ్యాఖ్యానమున జయరథుడు వచించినాడు. కావున రసచర్వణలో ప్రమాతృ ప్రమేయములు రెండును అత్యావసరములే. ఈ రెంటికిగల అనన్యత్వ మతిసన్నిహితమై కొన్నివేళలపూర్తిగా అభిన్నముగా భాసించును. ఇట్టి అభేద సాక్షాత్కారము గానమున కన్పించుటచే లలితకళ లన్నియు గానావస్థలో పర్యవసించ యత్నించుచున్నవని "పేటర్" ప్రపంచించినాడు.

4 రసచర్వణయందు దేహము, మనస్సు అను రెండును వ్యాపృతము లగుచున్నవి. శూన్యమునుండిగాని, తననుండియే గాని, మనస్సు సౌందర్యమును సృష్టించుటలేదు. సౌందర్యాస్తిత్వావగతులకు మనస్సు అవసరము. మనస్సుద్వారా సౌందర్యావగాహన కల్గుచున్నది. సౌందర్యావగాహనకు విషయము లుండితీరవలెను. సౌందర్యము బుద్ధీంద్రియముల యుగపత్ప్రవృత్తిద్వారా ప్రతీయమాన మగుటచే రసప్రతీతియందు ఆత్మ, మనో, దేహములు ఏకముఖముగా వ్యాపృతములగుచున్నవి. మనో, దేహములు, విషయములు మొదలగునవి ఆత్మానుభూతియందు సమన్వయము నందగల్గుచున్నవి.

ఈసమన్వయమున ప్రతిభాగము స్వస్వప్రవృత్తిని నెరవేర్చుచు అన్యార్థమునకంగమై ఏకార్థీభావయోగ్య మగుచున్నది. సంగీతమున లయాన్వితములగు నాలాపముల వినుచున్నాము. ప్రతి ఆలాపము తత్తన్నిష్ఠ యోగ్యానుభూతి నిచ్చుచున్నది. ఈయనుభూతులు రసచర్వణలోనికి పరిణమించుచున్నవి. ఆలాపములకు గల అన్యోన్య సంబంధమును పరిశీలించి తద్ద్వారా వీటికి సౌందర్యమనుగుణము నారోపించుచున్నామని 'అలెగ్జాండర్' చెప్పుచున్నాడు. కాని అనుభూయమానములగు విషయములకు సంబంధించనది సౌందర్యమను గుణమని యెంచుట పొరబాటు. సౌందర్యము కేవలము మనోనిష్ఠమైనచో భ్రమాత్మకమే యగును. వినబడు శబ్దములలో సామ్యాసామ్యములు మనస్సుచే గుర్తింపబడుచున్నవనుట వాస్తవమే. కాని శబ్దములే ఈ సామ్యాసామ్యముల నభివ్యక్తము చేయనిచో మనస్సు గుర్తింపజాలదు. పైగా సౌందర్యమును ఇంద్రియగ్రాహ్యమగు గుణముగా గ్రహించరాదు. ముఖము, తీగ, గృహము, గానము అనునవి సౌందర్యవిషయములుగా మనకు కన్పించునపుడు బాహ్యవిషయముచే నభివ్యక్తము గావింపబడునది సౌందర్యమని నిశ్చితమగుచున్నది. ఈసౌందర్యమును బాహ్య విషయమున అవగాహనము చేసికొను మనస్సు తద్ద్వారా సౌందర్యానుస్యూత మగుచున్నది. ఈ సౌందర్యానుస్యూతమగు స్థితిని మాత్రమే గ్రహించి, పూర్వావస్థను త్రోసివేసి, సౌందర్యము బాహ్యవిషయములయం దారోపింపబడునది యని కొందరు సమీక్షకు లనినారు.

రసచర్వణయందుగల సంవేదనము ఇంద్రియగ్రాహ్యములకు గుణములచే మేల్కొలుపబడుటలేదు. ఈగుణములతో నవినాభావ సంబంధముకూడ కలిగియుండుటలేదు; కాని గుణములలో నంతర్లీనముగా నున్నదని చెప్పవచ్చును. కావ్యమున మాధుర్యము ననుభవించుచున్నాము. గానమున నుదాత్తానుదాత్తములు ప్రతీయమానము లగుచున్నవి. మాధుర్యాదులు తత్తద్విషయ నిష్ఠములా? లేక మనస్సుచే విషయములపై ఆరోపింబడుచున్నవా? రసచర్వణలో విషయములకు మనస్సునకు సాత్మ్యసంబంధము కలదు. ఈసంబంధమతిసన్నిహిత మగుటచే ఎంతవరకు విషయము లున్నవో, ఎంతవరకు మనస్సుగలదో, నిర్ణయింపలేము. విషయములలో మనస్సు, మనస్సులో విషయములు సంవలితములై భాసించుచున్నవి. ప్రమేయరహితుడైన ప్రమాత, ప్రమాతృరహితమగు ప్రమేయము, ఉండజాలవని భావము. కావున విషయసంవలనముచే ఈ రసభోగము బ్రహ్మాస్వాద సవిధవర్తియని చెప్పబడుచున్నదని జగన్నాథు డనినాడు.

ఆరోపవాదు లీసిద్ధాంతము నంగీకరించలేరు. లలితకళలయందు విషయములతో మన మనస్సును మనము కలుపుచున్నాము. వాస్తవిక జగత్తునుంచి కవి యోగ్యవిషయముల నేరికొని, అనుపయుక్తము లగువాటిని వదలి, ఈ విషయములలో నొకదానితో నొకదానిని సంయోజించును. కవి మనోగత భావానుగుణముగా, తద్భావప్రదర్శకముగా, నీ సంయోజన జరుగుచున్నది. మనోవృత్తుల స్వభావలక్షణముల

యందు కావ్యగతములైన పాత్రలు లీనమగుచున్నవి. విశిష్ట విషయమును కవి సృష్టించగా, ఈవిషయముపై మనోగత భావము లారోపితము లగుచున్నవి. కావున కావ్యముతో మనస్సును సంయోజించగా రసచర్వణావిషయము సంప్రాప్త మగుచున్నది. ప్రకృతిలోని సౌందర్యము ననుభవించునపుడు గూడ నీ ఆరోప ప్రక్రియ గలదని 'అలెగ్జాండర్' అను చున్నాడు. అందుచే మనోనిష్ఠమైన సౌందర్యము విషయము లోనికి చొప్పింపబడి ఆరోపితము కాగా, విషయము సుందర ముగా భాసించునదని వీరి వాదము.

రసచర్వణయందు మనోవృత్తులు, బాహ్యానుభావ ములు విషయములోనికి ప్రవేశించునట్లు కన్పించునని ఆరోప వాదమున ముఖ్యసిద్ధాంతము. ఇచట ప్రమేయమును లౌకిక వ్యవహార యోగ్యముగా అర్థసాధకముగా గ్రహించము. ప్రమేయమును నిరపేక్షబుద్ధితోనే చూచుచున్నాము. ఈ నిర పేక్షభావనలో మనోవృత్తులను గూడ ఆత్మస్థలములుగా గ్రహించక వస్తునిష్ఠములుగా అనుభవింప గలిగినపుడే రస చర్వణ కల్గుచున్నదని ఏవం విధమగు నిరపేక్షభావన రసప్రతీ తియందు ముఖ్యమైనదని 'ఎడ్వర్డ్ బుల్లే' చెప్పుచున్నాడు. నిరపేక్షభావనగల యనుభూతు లన్నిటిలోను రసప్రతీతిలేదు. కాని రసప్రతీతిలో నిరపేక్షభావన ఉండితీరవలెను. నిరపేక్షభావ నతోబాటు వివిధ విషయముల సమన్వయముకూడ రసప్రతీతి కవసరమని ఇతని వాదము.

పూర్వానుభూతులలో ఘనకందరములకు, నరములకు గల సన్నివేశములను స్మరించుటచేత, మన మిప్పుడొక రాతిని చూడగానే, రాయి బరువుగా కన్పించగలదు. ఈబరువుగా కన్పించుట రాతిలోగల గుణమా? లేక కేవలము మన మనోగత గుణమా? 'కార్ల్ గ్రూస్' అను సమీక్షకుడీ రాతినిచూడగానే మనోవృత్తులలోపూర్వానుభూతులను మనమనుకరించుట గూడ కలదని చెప్పుచున్నాడు. కాని మనోవృత్తులను, బాహ్యానుభావములను రాతిలోనికి చొప్పించుచుంటి మను జ్ఞానము మనకున్నచో రాతిని బరువుగా నున్నట్లు భావించలేము. సాదృశ్యాది సంబంధవశమున, మన యనుభూతులను మనకు తెలియకుండానే రాతికిఆరోపించుచున్నామని'ఎఫ్.టి.ఫిషర్' చెప్పుచున్నాడు. పూర్వవృత్తులను, అవయవ స్పందములను ప్రతిరూపము మనలను స్మరింపజేయుచున్నదని ఇతని భావము. కాని ఈస్మరణలో స్మృతియను జ్ఞానము లేనిదే పూర్వప్రవృత్తులు స్ఫురించజాలవు. పైగా ప్రతి యనుభూతియందు విషయమును గమనించగనే సాక్షాదపరోక్షము గలదు. ఏవంవిధమగు అపరోక్షప్రతీతిలో పూర్వవృత్తులు ప్రకృతవస్తువుతో ననన్యత్వము నందుచో లౌకికస్మరణ విలక్షణమైన దీ స్మృతి యనవలెను. ఇట్టి అలౌకికస్మృతియందు తెలిసిగాని, తెలియకగాని, మనోవృత్తు లారోపింపబడు చున్నవనుట అసంబద్ధప్రలాపమే యగును.

రసచర్వణలోగల విషయము (వస్తువు లేక ప్రమేయము) అనబడునది భావరూపములను గల్గియున్నది. విష

యాకారమగు రూపమున భానమున్నట్లు భావింపబడుచున్నది. ఈభావమును రూపమునుండి వేరుజేయలేము. భావమును వేరుజేసినచో రూపముండదు, భావముకూడ యుండలేదు. రెంటికి అవినాభావ సంబంధము కలదు. కాని 'రీడ్' మొదలగు సమీక్షకులు భావము రూపముతో సంవలితము అగుచున్నదని పల్కుచు, భావరూపములను రెండు ప్రత్యేక విషయములుగా గ్రహించుచున్నారు. ఉపాధి యగు రూపములో భావనా వశమున సంవలిత మగుచున్న భావమును ప్రయోజనము (పురుషార్థము) గా గ్రహించుచున్నారు. ఈ పురుషార్థము మనస్సునకు మాత్రమే సంబంధించి యున్నది. ఏవంవిధ పురుషార్థానుభూతియే రసచర్వణలో గలదనినచో పురుషార్థములు పురుషవ్యాపార నిష్ఠములై సర్వజనాదరణీయములు కాకపోవలెను. కాని 'రీడ్' పురుషార్థములను వస్తుతంత్రములుగానే స్వీకరించి యుండుటచే, పురుషార్థములు విషయమందారోపితము లగుచున్నవని పలుకరాదు.

ఇచ్ఛా జ్ఞానానందములు ప్రతి పురుషార్థమున గలవు. ఒక ప్రవృత్తి నెరవేరినచో కలుగు సద్భావాత్మకమగు భౌతికాధ్యాత్మిక ప్రశాంతియే పురుషార్థమని 'రీడ్' నిర్వచించినాడు. కాని పురుషార్థము వ్యక్తియొక్క మానసోద్భూతమైనదికాదు. సర్వత్ర గోచరించుచు, సమస్త జగత్తులోను అనుస్యూతముగా భాసించు తత్త్వము ఏయే విధములుగా నభివ్యక్తమగుచున్నదో, ఆ అభివ్యక్తిని పురుషార్థమనవలెను.

ఈ పురుషార్థ ప్రతీతిలో విషయమంతయు సామాన్యముగ ప్రతీయమాన మగుచు, మనఃప్రవృత్తులను, భావనను నియంత్రితము చేయుచున్నది. విషయవిషయకమగు రూపము అన్యవిషయసంవలిత మైనను, భావనమున కుపాధిగా ప్రతీయమాన మగుటచే న్వయంసిద్ధ మగుచున్నది. రూపముచే నుపహిత మైన భావము వస్తునిష్ఠమే కాని, మన మనోగతమై వస్తువు నావేశించునది మాత్రము కాదు.

భావ సంవలనములను కొన్నిటిని గమనించిన నీవిషయ మింకను సుగమము కాగలదు. కొన్ని భౌతిక సంచలనములతో నైతికాధ్యాత్మిక వ్యాపారములు సంవలితము లగుచున్నవి. భౌతికాధ్యాత్మికాక్రోశము లాకేయొక వ్యాపారముద్వారా వ్యక్తములగుచున్నవి. కంఠ్యాక్షరముల పారుష్యము క్రోధాది మనోవృత్తులను సూచించుట గలదు. భౌతికాకృతులకుగూడ నాధ్యాత్మిక భావములు చెప్పబడుచున్నవి చతురశ్రము ధర్మమును తెల్పునదని 'పైథాగొరస్' పల్కినాడు. కొన్ని విషయములయందు విశిష్ట వర్ణములు, రూపములు, ధ్వనులు కన్పించుచున్నవి. వర్ణ రూప ధ్వనుల సామ్యమున అన్య విషయముతో నీ వస్తువు సంబద్ధముకాగా రెంటిని అభిన్నముగా గ్రహించు నవకాశము కలుగును. ఇట్లు నలుపును శోకపరముగాను, ఎఱుపును అపాయమును తెలుపునట్లుగాను తీసికొనుచున్నాము. ఇచట పూర్వావధీరిత సంబంధములు మనకు తెలియకుండానే వ్యాపృతములగుచు, వివిధవిషయములకు, భావములకు, చక్కని సమన్వయము చేకూరుచున్నది.

ఈసమన్వయమున అంగిగా ఉన్న ప్రధానవిషయము అతీంద్రియ
ప్రత్యక్షయోగ్య మగుచున్నది. జ్ఞానవశమున నిర్మింపబడి,
భావనద్వారా అనుభూయమాన మగునది రసచర్వణయందలి
విషయమగుటచే నీ యలౌకిక చమత్కారాత్మకమగు రసా
స్వాదము స్మృతి, అనుమానము, లౌకిక స్వసంవేదనము అను
వాటికన్న విలక్షణమైన దగుచున్నదని అభినవగుప్తుడు చెప్పు
చున్నాడు.

కవియొక్క భావన విషయగతస్వరూపావగతితో తృప్తి
పడక, తత్తద్రూపోపహితమైన భావావగతికై ప్రవృత్తమగు
చున్నది. అధ్యవసాయాత్మకమగు బుద్ధి కతీతముగానున్న ఆత్మ
సర్వానుగ్రాహక మైనపుడే ఈ అవగతి కల్గును. లౌకికవ్యవ
హారమున మన కగోచరమైనను, జగదాధారభూతమగు నద్భుత
తత్త్వమును గ్రహించి, అనుభవించుటయే భావనావ్యాపారము
యొక్క ఉద్దిష్టార్థము. ఈ భావన అందరకు గలదుగనుక ప్రతి
వ్యక్తియు తనకు తోచినరీతిగా బాహ్యజగత్తును సమన్వయ
పరచుకొనుచు జ్ఞానగమ్యముగా చేసికొనుచున్నాడు. మానవ
జీవితమున అంతర్యామిగా భావనకలదని తేలుచున్నది. కావున
బుద్ధి, ఇచ్ఛ మొదలగువానికి అతీతమై, కేవలము స్వసంవిత్సం
వేద్యముగా కావ్యము కన్పించుచున్నది.

ఇట్టిచో ఆరోపవాద మనంగీకార్యము కాగలదని
వేరుగా చెప్పనక్కరలేదు. ఆరోపవాదమున సౌందర్యము
మనోనిష్ఠమైనదగుటచే విషయమున కన్పించలేదు. విషయగత
సౌందర్యము భ్రమాత్మకము కావలసివచ్చును. కావ్యశిల్పము

సమగ్రమై, పరివృష్టమైనకొలది తనలో లేని గుణములను కావ్య విషయ మభివ్యక్తము చేయగల్గుచున్నదని 'అలెగ్జాండర్' అనుచున్నాడు. కాని శ్రావ్యమైన గీతమును వినునపుడు, గీత మభివ్యక్తము చేయుభావములు మనలోనుండి బయటకు వెడలి గీతము నావహించుచున్నవే యని చెప్ప సాహసించ లేము. గీతములోని వర్ణ లయ తాలాదులలో సౌందర్యము ప్రతీయమాన మగుచున్నది కాని, మన మనస్సులో కాదు. గీతాస్వాదమునగాని, తర్వాతగాని, భ్రమలో పడితిమను బుద్ధికూడ మనకు లేదు. పైగా భ్రమ జ్ఞానము, అసత్యమై ప్రయోజనరహిత మగునది.

సౌందర్యముతో బాటు అసాధు వగు హేయత్వము (Ugliners) కూడ రసచర్వణకు సంబంధించినదే. మనోనిష్ఠ మైన సౌందర్యమును విషయముపై నారోపించి విషయము సుందరముగా నున్నదని యెంచితిమేని, హేయత్వములో భాసించు వస్తువును చూచునపు డీ హేయత్వమును కూడ మనోనిష్ఠముగా గ్రహింపవలసి వచ్చును. సౌందర్యము మన మనస్సులలో గలదని ఒప్పుకొనుటకు అందరు నంగీకరించగలరు. కాని హేయత్వమను అవగుణము కలదని చెప్పుకొనుటకు సాహసించరు. అట్టిచో వస్తువుయందు హేయత్వము ఆరోపింపబడుట లేదని చెప్పవలెను. ఆరోపవాదమున కిది ప్రబల వ్యాఘాతము.

ప్రమాతకు ప్రమేయమునకు విశిష్ట సంబంధము కలదు. విషయ మనుభవింపబడుటచే విషయమునకు సత్తా గల దని

చెప్పుచున్నాము. సంవిదధీనమైన విషయసత్తాను గుర్తించి
నప్పుడు విషయము లేదనిగాని, విషయముపై మన మనోగత
భావము లారోపింపబడుచున్న వనిగాని చెప్పుట అతిసాహస
మని శాస్త్రదీపికాకారుడు పలికినాడు. కావున విషయసౌంద
ర్యము ప్రతీయమాన మగునప్పుడు ఈ సౌందర్యమును విషయా
భిన్నముగనే గ్రహించవలెను. గాని మనోనిష్ఠమని చెప్పరాదు.
విషయము సుందరమని, విషయసౌందర్యమును మనము మనస్సు
ద్వారా అనుభవించుచున్నామని అందరకు తెలిసినవిషయమే.
ఈ సామాన్యానుభవమునకు విరుద్ధముగా వర్తించవలసిన
అవసర మేమియులేదు.

ఈసిద్ధాంతము నింకొక విధముగా ప్రదర్శించవచ్చును.
క్రమబద్ధమై ప్రవృత్త్యాత్మక మైనది అనుభూతి బాహ్య
విషయ సన్నివేశములచే కొంతవరకు నియంత్రితమై సదా
మారుచున్న అనుభూతిలో నప్పుడప్పుడు తద్వేగావరోధము
కల్గుచున్నది. అవరోధము కల్గినప్పుడు వర్తమానదశలో నున్న
అనుభూతి విస్పష్టముగా భాసించును. మనల నాకర్షింపజాలి,
మనన నిదిధ్యాసనలను తనపైకి త్రిప్పుకొన గలుగు వస్తువు
(విషయము) వలన అనుభూతియను ప్రవాహమున కవరోధము
వచ్చుచున్నది. అన్యార్థాపేక్షముగా గాక, నిరపేక్షబుద్ధితో
నీ వస్తువును భావించునపుడు సుఖాత్మకమగు సంతృప్తి కల్గు
టచే నీ యవరోధమును మనము నిరసింప లేకున్నాము. ఈ
వస్తువు పురుషార్థాభివ్యంజకము కానిచో నిరపేక్షభావన

కలుగ నేరదు. పురుషార్థ మనబడు ప్రయోజనము వస్తు
స్వభావనిష్ఠమై, సమగ్రము, స్వయంప్రకాశము నగుచున్నది.
ఇట్టి భావనయే రసచర్వణలో గలదు. ఈ భావనయందు దేశ
కాలాద్యవధుల నతీతముగా ప్రమాత వర్తించును. దీనిని
హృదయసంవాద మందురు. ఇతరుల చిత్తవృత్తులను ఆస్వాదకుని
చిత్తవృత్తితో నభిన్నముగా గ్రహించి యనుభవించుటయే
హృదయసంవాద మని జయరథుడు నిర్వచించినాడు.

వ్యావహారిక జీవితములోని సందర్భముల ననుసరించి
వ్యాపృతములగు ఇంద్రియములు విశిష్టప్రవృత్తుల నలవరచు
కొనుచున్నవి. ఏవస్తువు నెంతవరకు గ్రహించిన మనకృత్యము
నెరవేరగలదో అంతవరకు తెలిసికొనుటకే ఇంద్రియము లుప
యుక్తము లగుచున్నవి. ఇట్లు మనము తెలిసికొను విషయ
మతిస్వల్పము. ఈ స్వల్పజ్ఞానముతో వస్తువును గుర్తించి,
స్మరింపగల్గుచున్నాము. గుర్తింపబడినతర్వాత, వస్తువు విస్మ
రింప బడుచున్నది. వ్యావహారిక ప్రత్యక్షమున వస్తువుల
బాహ్యాకృతులతో తృప్తిపడుచున్నాము. కాని నిరపేక్ష
భావనలో భావరూపసంవలితమైన వస్తుజ్ఞానము కల్గుచున్నది.
ఈ భావము రూపోపహితమైయుండి భావనచే సమున్మీలిత
మగుచున్నది. తద్ద్వారా కలుగు సమగ్రజ్ఞానము అనుభూతి
నిష్ఠము. మనోగతభావమును విషయమందారోపించక విషయ
ములయం దంతర్లీనముగా ఉన్న భావ మభివ్యక్తమై సము
న్మిషితమగుటకు విషయముతో మనస్సు సహకరించుచున్నది.

౬. ఒక వస్తువు సుందరముగా భాసించునప్పుడు ఈ సౌందర్యము వస్తుస్వభావము నాశ్రయించుకొనినట్టుగానే ప్రతీయమానమగుచున్నదని నిశ్చయించితిమి. సహజసౌందర్యము లేని వస్తువునందు సౌందర్యము నారోపించి, అందలి ఈ సౌందర్యమును భావించుట ఉన్మత్తప్రవృత్తి యనిపించుకొనును. మనోగతసుఖమును పరస్థముచేసి తద్ద్వారా వస్తుసౌందర్యమును మనము భావించుటలేదు. వస్తుస్థ సౌందర్యవశమున మనోగతసుఖము బాహ్యమగుచున్నది. ఒకేమారు వస్తువొకప్పుడు సౌందర్యముగాను, మరొకప్పుడు సౌందర్యరహితముగాను భాసించునప్పుడు కూడ ఆరోపప్రక్రియ లేదు. సౌందర్యరహితముగా వస్తువు భాసించునప్పుడు వస్తుగత సౌందర్యము నశించుటలేదు. కాని వస్తుస్థ సౌందర్యము మన ప్రతీతిలోనికి వచ్చుటలేదు. 'బొశాంకెట్' అనినట్లు ఇట్టి సందర్భములలో మనమనస్సు సమ్మెకట్టుచున్నది. విషయముల నొకతీరుగా సమన్వయపరచుచు, వాటి కంగాంగిభావమును చేకూర్చు మనఃప్రవృత్తిద్వారా వస్తుతంత్రమగు సౌందర్య మభివ్యక్తమగుచున్నది.

ఒక విశిష్టమగు అనుభూతిని భాషారూపమున ఉచ్చరించగా కావ్యము వచ్చుచున్నది. జగత్తులో తీసికొనిరాబడిన పరిణామము లేక మార్పు పొందు రూపమును కావ్యమన వచ్చును. కాని బాహ్యజగత్తులో నేవిధమైన మార్పు రావలెనన్నను భౌతికశక్తి ప్రవృత్తము కావలెను. కవి ఇట్టిశక్తి నుపయోగించుటలేదు. కవియొక్క మనస్సులో కేవల మొక

భావము కలదు. ఈభావముద్వారా బాహ్యవిషయములను నే
కొనుట, ఒకదానితో నొకటి కలుపుట, ఒకదానితో నొకదా
నికి సంబంధము కుదుర్చుట, మొదలగు పనులను చేయగలుగు
చున్నాము. ఈ సంబంధములు అన్నియు జగత్తులో సంశ్లిష్టములు
గానున్నవే. భావముద్వారా ఈ సంబంధముల నభివ్యక్తము
చేయగలుగుచున్నాము. కవియొక్క భావము బాహ్యవిషయములనుండి
ఆవిర్భవించినది కాదని, అసత్తునుండి సద్భావమును కవి
సృష్టించుటలేదని తెలియుచున్నది. విషయములను, వానిని
అన్యోన్యసంబంధములను కూర్చునపుడు, వస్తుస్వభావపరిశీల
నము, వస్తువులలో సంశ్లిష్టముగా నున్న పరస్పర సంబంధావ
గాహనము కవికి కావలెను.

జగత్తులో సంశ్లిష్టముగా నున్న తత్త్వము నావిష్క
రింపజేయుటకు బాహ్యప్రమేయములతో కవి సహకరించక
తప్పదు. జగత్తులో దాగియున్న శక్తిసామర్థ్యములు భావన
ద్వారా కలిగి అవగతము లగుచున్నవి. వీటినే భావము లను
చున్నాము. విషయసామర్థ్యములతో బాటు కవియొక్క
సామర్థ్యములుగూడ జగత్తులో దాగియున్నవే కాని, వేరు
కాదు. దీనినిబట్టి కేవలము కవివలనగాని, కేవలము విషయ
ముల వలనగాని, కావ్య ముత్పన్నమగుట లేదని చెప్పవలెను.
కవి అతని యనుభూతిలో గల సన్నివేశములు, అను రెంటికి
అనన్యత్వ సంబంధము సిద్ధించును. ప్రమాతృ ప్రమేయ సంవ
లితమైన జగత్తు కవియొక్క చైతన్యముద్వారా అభివ్యక్త
మగుచున్నది. ఈ యభివ్యక్తిలో అర్థము. అర్థవంతమగు

రూపము అను వాని నీజగత్తు పొందుచున్నది. ఈ యనన్య త్వమున నీ జగత్తు కవియొక్క చైతన్యముద్వారా చేతన మగు చున్నది. జగత్తులో నంతర్లీనముగా నున్న చైతన్యము అభివ్యక్తికై పైకి ఉబుకుచు కవిద్వారా అర్థవంత మగు చున్నది. కవియొక్క ఇచ్ఛాశక్తి నుద్దీపించు బాహ్య సన్నివేశములను తీసివేసినచో ఇచ్ఛాశక్తియే ఉద్దీపించక పోవుట వలన కవియొక్క ఇచ్ఛాశక్తిజనితమైనది కావ్య మని చెప్ప వీలులేదు. తాను నిర్మించు చిత్రము చలువరాతిలో దాగి యుండగా గుర్తించినానని శిల్పి చెప్పుచున్నాడు. గాజుపని చేయువాని చేతిలోనికి గాజు సజీవముగా వచ్చుచున్నదను అనుభూతి కలదు. అయోభావన లేనిదే కమ్మరి ఇనుపపని చేయలేడు. ఈ యనుభూతులవలన లలితకళలలో ప్రమాతృ ప్రమేయముల కనన్యత్వము కలదని, ప్రమేయముతోబాటు ఆయా కళల కుచితమైన ఉపాధి యనబడు రూపముకూడ అతిముఖ్యమైనదని, ఈ యనన్యత్వమున దాగియున్న తత్త్వా విష్కృతియే కావ్యమని' నిశ్చయింపవలె నని 'మారిస్' 'బొశాంకెట్' అను సమీక్షకులు చెప్పియున్నారు.

ఏవంవిధమగు అనన్యత్వము నాధారము జేసికొనినచో రసచర్వణయందలి భావము సుస్పష్టము కాగలదు. జ్ఞానా నందపరముగా రసచర్వణను వ్యాఖ్యానించుచు ప్రమేయాది సన్నివేశములు అనుభూతిలో సమన్వయము నందుచు నతి ముఖ్యము లగుచున్నవని అభినవగుప్తుడు చెప్పినాడు. చేతను డగు వ్యక్తితో అనన్యత్వసంబంధము నందజాలని వస్తువులకు

సత్తా లేదు. సత్తా యనగా స్ఫురద్రూపత్వము కలిగియుండుట. స్ఫురద్రూపతయే ప్రకాశమానత. విషయములకు ప్రకాశమానత్వము కలదని యంగీకరించవలెను గనుకను, ప్రకాశమానత్వము చైతన్యలక్షణ మగుటచేతను, జడపదార్థమనునది లేదని, ప్రకాశమానత యన ప్రకాశాభేదమని ఉత్పలదేవుడు శివదృష్టివ్యాఖ్యానావసరమున పల్కినాడు. కావున రసచర్వణలో సహితము ప్రమేయమునకు జడత్వము లేదని పరమ గురువగు ఉత్పలదేవుని అనుసరించుచు అభినవగుప్తుడు పలుకగలిగినాడు. అంతర్లీనముగా నున్న చైతన్యమును విషయములచే నభివ్యక్తమగునట్లు చేయుటయే కవియొక్క వ్యాపారము.

వస్తుస్వభావానుగుణము లగు భావములనే మనము అనుభవించగలుగుచున్నాము. మన మనుభవించు భావములు వస్తుస్వభావముతో సంవలితములై యున్నవని భావము. రసచర్వణలో గల సౌందర్యావగతి నాశ్రయించుకొనివచ్చు ఈ సంవలనము కావ్యమున అర్థవంతముగా ఉపహిత మగుచున్నది. కావున రసచర్వణలోగల అర్థమును అనుభావముగా గాని, భావరహితమగు సంవేదనముగా గాని స్వీకరింపలేము. ప్రత్యక్షగోచరములగు సన్నివేశములతో జ్ఞానాకారమగు భావము సంవలితమైనచో, రసచర్వణావిషయము వచ్చుచున్నదని చెప్పితిమి. ఈ సంవలనమున ఒకదానినుండి మరొకదానిని వేరుచేయలేము. ఇచట గల జ్ఞానాకారమగు భావము అతీంద్రియప్రత్యక్షయోగ్యమై, ఉత్తమపురుషార్థము లన్నిటియందును అనుస్యూతముగా కన్పించుచున్నది.

ఇట్లు నిష్పన్నమగు రసచర్వణ నిర్వికల్పక ప్రత్యక్షముననుభూత మగుచున్నది. సంసర్గాసంగియగు జ్ఞానమైన నిర్వికల్పమున విభిన్న సన్నివేశములు ఏకరూపముగా, సమగ్రముగా భాసించుచున్నవి. విన్యాస వైదగ్ధ్యవశమున నీవిధమగు ప్రతీతి కావ్యమున కల్గుచున్నది. యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి, తాత్పర్యబోధ, ఛందస్సు, లయ మొదలుగాగల రచనాపరికరములన్నియు విన్యాసశబ్దముచే సంగృహీతము లగుచున్నవి. స్వేచ్ఛామయమైన ఆత్మాభివ్యక్తి ఈ విన్యాసవశమున నియంత్రితమై కావ్యమున ప్రతీయమాన మగుటయే కావ్యవైశిష్ట్యము. తద్ద్వారా స్థాయి భావజనితప్రవృత్తులు జ్ఞానాకారములోనికి పరిణమించుట కన్పించగలదని 'శాల్వీక్ బ్రాక్' చెప్పుచున్నాడు. ఈపరిణామము కావ్యమున ఛందోలయాన్వితమగు భాషారూపమున గ్రథితమగుచు, రసచర్వణలో నపరిత్యాజ్య మగుచున్నది. జీవితమునగల ఒడుదుడుకులు మచ్చికచేయబడగా వచ్చు ప్రశాంతరూప పరిణామమే ఈ గ్రథిత వస్తువు. దీనిని నిరపేక్షబుద్ధితోనే భావింపగల్గుచున్నాము. ఈభావనలో ప్రశాంతరూపమగు చిత్తవిస్తారమును కవి సామాజికు లనుభవింతురు. కవి సామాజికులకు ఈయనుభూతి రాకముందున్న స్వరూప స్వభావములు, ప్రమేయముల స్వరూప స్వభావములు, ఈచిత్తవిస్తారమున నంతర్గతములై భాసించును. ఉత్తమ అనుభూతులలోను, ఈయనుభూతులు పొందు కావ్యాదులయందును, అనుపహిత తత్త్వావగతి కలదు. ఇట్టి సంవిత్సంవేదనమున మహత్తరభావము, అలౌకికభావన, హృదయ

స్పందము, అశేషవస్తుసంవాదము ప్రతీయమానము లగు చున్నవి.

విభావాదులచే సముద్దీపితములైన స్థాయి సంచారి భావములద్వారా రసచర్వణ కల్గుచున్నది. భావములనగా చిత్తవృత్తి విశేషములు. వ్యక్తిభేద మున్నను ఒకవ్యక్తి యొక్క చిత్తవృత్తికి మరియొక వ్యక్తియొక్క చిత్తవృత్తికి అత్యంత వైలక్షణ్యములేదు. ప్రతిచిత్తవృత్తియందు ఇతర ఉపహిత విషయములు సంవలితములై కన్పించుచున్నవి. కావుననే రసము కవిగతమైనదని, కవి సామాజికతుల్యుడని అభినవగుప్తుడు పలికినాడు. రసచర్వణయందు దేశకాలోప హిత లక్షితుడైన కవి ప్రవర్తించుటలేదు. బాహ్యవిషయము లతో తాదాత్మ్యము లేక అనన్యత్వము సంభవించినపుడే కవి ప్రవర్తింప గలుగుచున్నాడు. దీనిని సాధారణీకరణ మని యందురు. కవిగతసాధారణీభూత సంవిన్మూలమై కావ్యపురస్సర మైనది నటవ్యాపారము. ఈసంవిత్తుకు రసమునకు భేదములేదు. కావ్యరచనావసరమున కవికి, తదవలోకనావసరమున సామా జికునకు కలుగు అనుభూతియే రసప్రతీతి.

రసమును సంవిదభిన్నముగా చెప్పితిమి. రసమని మనము వ్యవహరించు సంవిద్రూపము ఉద్దీపింపబడినపుడు రస ప్రతీతి కల్గుచున్నది. పూర్వానుభూతులద్వారా సమావిష్ట మగు వాసనాసంస్కారవశమున నీ సంవిద్రూపము విశిష్టముగా భాసించును. ప్రాక్తన సంస్కారములు భావస్థిరములై ప్రతి యనుభూతిలోను ఉద్దీపింపబడుచున్నవి. ఇట్టి ప్రాక్తనసంస్కార

రహితులగు వారికి రసాస్వాదనము కలుగనేరదని ధర్మదత్తుడు చెప్పియున్నాడు. సంస్కారశూన్యులగు సామాజికుల మనస్సులు మనస్సులే కావుగనుక భావాదిక మనుభూయమానము కాజాలదు. వాసనారూపముననుండు సంస్కారములు స్మృతి రూపమున మనచే అనుభూయమానము లగుచున్నవని, స్మృతి సంస్కారముల కేకరూపమే గలదని యోగసూత్రము చెప్పుచున్నది. పూర్వానుభూతమగు అర్థము లేనిదే స్మృతి కలుగదు. కాని ఇచ్చట అబోధపూర్వముగా నావిర్భవించు స్మృతికి ప్రతిభానాపరపర్యాయమగు సాక్షాత్కార స్వభావమునే చెప్పవలెనని అభినవగుప్తుడు సిద్ధాంతించినాడు.

విభావాదులతో భావింపబడు సాధారణీకరణ వ్యాపారము రసచర్వణలో నతిముఖ్యమైనది. దీనినే భావనావ్యాపార మని యందురు. భావనావ్యాపారవశమున ప్రమేయాభిన్నముగా ప్రమాత వ్యవహరించగల్గుచున్నాడని విశ్వనాథుడు విశదీకరించినాడు. ప్రమేయములు పరిదృశ్యమానములు కాగానే మనస్సు ఉద్దీపింపబడి హృదయసంవాదము కల్గుచున్నది. భావనాసమున్మిషితమైన హృదయసంవాదమున చిత్తవిస్తృతి కలదు. తద్ద్వారా కవి సామాజికులు ప్రమేయాంతర్వర్తు లగుచున్నారు. ఈ వ్యాపారమున ప్రమేయనిష్ఠమైన భావము (అర్థము) మనస్సు నావేశించి తత్సంవలితమగుచున్నది. ప్రమేయనిష్ఠమగు భావము చిత్తము నావహించుటచే చిత్తము ద్రవావస్థ నందగా రసచర్వణ నిష్పన్నమగుచున్నది.

6. ప్రమేయమున అనుస్యూతముగా కన్పించు తత్త్వము ప్రమాతృ సంబంధి యగుటచే కవి సామాజికులు ప్రమేయ మును రసబుద్ధితో గ్రహింపగలుగుచున్నారు. ప్రతి వ్యక్తి యొక్క స్వభావమున బాహ్యజగత్తుతో అనన్యత్వసంబంధము ననుభవించు అవకాశము లేక లక్షణము కలదు. ఆత్మాభిన్న ముగా బాహ్యజగత్తు గ్రహింపబడునపుడే ఈ అనన్యత్వము సిద్ధించుటచే సౌందర్య దర్శనావసరమున చిత్తసంవాదరూప మగు అనుభూతి కల్గుచున్నది. భావనానుప్రాణిత మగు చిత్త సంవాదము రసప్రపంచమును విశదముగా స్ఫుటముగా భాసింప జేయుచు, ఆత్మాభిన్నముగా ప్రమేయజాలమును కన్పింపజేయుచున్నది.

వ్యుత్పత్తి, అభ్యాసము అనువానిద్వారా నిష్పన్న మగు చిత్తసంవాదము సహృదయమున కుండు ముఖ్యలక్ష ణము. ఈ సహృదయుడు రసచర్వణయందు సౌందర్యమును దర్శించును. తత్త్వాభివ్యంజకములలో నిట్టి సౌందర్యము ప్రముఖమైనది. తన నిజస్వరూపము నాత్మ యనుభవించ గల విషయములలో సౌందర్య మొకటి యని "లార్డ్ హాల్డేన్" పలికినాడు. పారమార్థికాత్మావలోకనము సౌందర్యానుభూ తిలో గలదని భావము. సౌందర్యప్రతీతిలో నిరూపిత మను ఆత్మయొక్క స్వరూపస్వభావములు చిత్తసంవాద వశమున అవగతము లగుచున్నవి. కవి, నట పాఠక సామాజికుల కీ చిత్తసంవాదము లేనిచో రసప్రతీతి కలుగనేరదు. వాసన లన

బడు సంస్కారములవలన ప్రమేయములయందు ఆత్మాను ప్రవేశము కలుగుటయే చిత్తసంవాదముయొక్క లక్ష్యము.

గుణాలంకారాదియుతమై మనోహరశబ్దార్థములు కలిగిన కావ్యములో సౌందర్యమనబడు రస మనుస్యూతముగా కలదు. ఇట్టి కావ్యమును సమీపించగా చిత్తము ద్రవావస్థ నందుచున్నది. అప్పుడు తద్వ్యక్తిలో క్రమక్రమముగా సంభవించు పరిణామవశమున చిత్తవిస్తారము, చిత్తవికాసము రాగలవు. హృదయసంవాదవశమున సమగ్రాకారక మగు చిత్తవృత్తి కలుగును. ప్రమేయమున చిత్తవృత్తి మగ్నము కాగా ప్రమాతృప్రమేయములకు గల వ్యావహారిక వైలక్షణ్యము సమసిపోయి అనన్యత్వము వచ్చుచున్న... ప్రమాతృ ప్రమేయములను సమన్వయింప జాలి, విశ్రాంతిలక్షణ లక్షితమైన అనుభూతి ప్రమాతకు కల్గుచున్నది. ఇట్టి అనుభూతికి గల ఆక్రోశమే కావ్యరచనకు, కావ్యానుశీలనమునకు హేతువు. స్వాత్మావేశవశమున సిద్ధించు రసచర్వణలో నీ యాక్రోశము సఫలమగును. ఆక్రోశ మున్నంతవరకు అనుభూతిలో గల వివిధవిషయములకు సమన్వయము కుదరదు. సమన్వయము సిద్ధించగా విశ్రాంతిలక్షణోపేతమైన అనుభూతి వచ్చుచున్నది. ఈ విశ్రాంతిచే లక్షితమగు అనుభూతిలో ప్రవృత్తి నశించుట లేదు.

ఈ యనుభూతి కేవల మానందమయమని, సర్వరసములకు నానందరూపత్వము కలదని అభినవగుప్తుడు చెప్పినాడు. తర్వాతి ఆలంకారికు లనేకు లీ వాదమును విమర్శించ

కుండా స్వీకరించి యున్నారు. ఐనను రసప్రతీతిలో కేవల మానందమే కలదా? అనుప్రశ్నను వివేచించవలసి యున్నది. దుఃఖాదిభావములచే సస్పృష్టమైన దీ యనుభూతియని చెప్పుట సాహసమాత్రము.

రసప్రతీతిలో వివిధ విషయములు సమన్వితములై యున్నవి. ఈవిషయముల కన్యోన్యసంబంధము కలదు. రసమున కంగములుగా వర్తించు నీవిషయములకు తత్తదుచిత స్వభావములు కలవు. ఇందు కొన్ని విషయములు సుఖహేతుకములు గాకున్నను, సుఖపరిపోషకములు గావచ్చును. అంగియగు రసమునగల అంగములలో నొకటిగా దుఃఖమున్నప్పుడు రసప్రతీతిలో దుఃఖప్రతీతి యున్నదా? లేదా? భిన్నాకారములతో రసప్రతీతి కన్పించుటలేదు. అంగములయొక్క అన్యోన్య సంబంధబలమున అంగి సిద్ధించినను, అంగములసముదాయము కన్న విశిష్టమైన శక్తి స్వభావములు అంగియందు కలవనుట నిర్వివాదాంశము. దుఃఖమొక అంగముగా నున్నను తద్భిన్నమగు అంగియందీ దుఃఖము దుఃఖముగా ప్రతీయమానము కాదని చెప్పవలెను. కాని అంగియొక్క స్వభావము అంగములలో ననువృత్తముగా లేనిచో అవి అంగములు కాజాలవు. ప్రతిఅంగము అంగియందు పర్యవసితము కావలెను. భావనా సమున్మిషితమైన రసప్రతీతి అర్థవంత మైనది, అర్థవంతమగు రూపములో నన్వితమైనది యని చెప్పినాము. ఇచట ప్రమాతృ ప్రమేయముల కభేదము కలదనికూడ వివరించినాము. నిరపేక్షభావనతోనున్న ఈ రసప్రతీతిలో సర్వసామా

న్యముగా అనుభూతమగు దుఃఖము కన్పించదనుట సాహస వాక్యము.

విషాదాన్వితమగు గర్భసంధి నవలోకించునపుడు పాత్ర లనుభవించు దుఃఖము మనప్రతీతిలో గలదు. కరుణరస పూర్ణములగు రూపకములలో సుఖము ప్రతీయమాన మగుట వాస్తవమే. దుఃఖప్రతీతియే యున్నచో కరుణరసప్రతీతి కెవ డును ఉన్ముఖుడు కాజాలడు. ఇచట సుఖదుఃఖములు రెండును ప్రతీయమానము లగుచున్నవని చెప్పవలెను. ఇట్టిచో నీ రెంటికి గల సంబంధము వివేచనార్హము.

రసప్రతీతిలో విభిన్నాంగములు కలవని, రసము అంగి యని, విభిన్నాంగములకుగల అన్యోన్యసంబంధమువలన రసము ప్రతీయమాన మగుచున్నదని, విభిన్నాంగములప్రతీతి లేకుండా రసప్రతీతి లేదని, ఈ అంగములు అంగి యను రసమున పర్యవ సితములై రసమున నంతర్యామిగా గలిగియున్నవని చెప్పి యున్నాము. భావనావశమున నీ యంగములు రసమున పర్యవ సితము లగుచున్నవి. భావనావ్యాపారము నిరపేక్ష మగుటచే లౌకికవ్యవహారముకంటె విలక్షణమైనది. విభావాదులు అలౌ కిక విభావనా వ్యాపారవశమున లౌకికవిలక్షణములుగా కావ్య నాట్యములలో ప్రతీయమానము లగుచున్నవి. కావున సకల మైన విభావాది వస్తుజాతము కావ్యమున సుఖసమర్పక మగు చున్నదని విశ్వనాథుని వాదము. ప్రయోగించుటకు అరమణీ యములగు పదార్థములు సహితము అలౌకికాహ్లాదము నిచ్చుటయే లోకోత్తరమగు కావ్యవ్యాపార మహిమయని

నవ్యులు చెప్పుచున్నారని జగన్నాథుడు పలికినాడు. కాని మానవజీవితములో నతిముఖ్యమైనదగు దుఃఖము ఈయలౌకికానుభూతిలో లేనిచో నిది మానవజీవితమును చిత్రించునది కాని, మానవుల అనుభూతిని చూపునదికాని, కాజాలదు. దుఃఖప్రతీతి వలననే మానవజీవిత మర్థవంత మగుచున్నది. పైగా దుఃఖాసంభిన్నమగు సుఖము మరుమరీచిక వంటిది.

మానవజీవితము సుఖ దుఃఖ సమ్మిశ్రితమని మొదటి అధ్యాయమున భరతుడు చెప్పియున్నాడు. సుఖదుఃఖములు ఏకరూపమున ఒకే యనుభూతిలో భాసింపగలవు. సుఖములో దుఃఖము, దుఃఖములో సుఖము కలవు. ప్రమేయముల నవలోకించుటవలన మనోవృత్తులు బయలుదేరుచున్నవి. ఇందు ప్రమేయములను తనలోనికి సంవలితములుగా చేసికొనుచు మనస్సు తన స్వరూపమగు సత్త్వమును విషయముల కాపాదించుచున్నది. ఈ సత్త్వమున రజస్తమస్సులు అంగములుగా కలవు. రజస్తమోగుణములలో దుఃఖ మంతర్లీనముగా నున్నది. ద్రవీభూతమైన చిత్తము, సత్త్వమయ మగుటచేతను, సత్త్వరహితమైనచో స్థాయిభావాసంభవము కల్గుటచేతను, సుఖరూపమైనది సత్త్వగుణ మగుటచేతను, సమస్తభావములు రజస్తమాంశ మిశ్రణతో సుఖమయము లగుటచేతను, సమస్తరసములయందు తుల్యసుఖానుభూతి కలదని చెప్పరాదని భగవద్భక్తిరసాయనకారుడు ప్రపంచించినాడు. రసములలో గల సుఖానుభూతులయందు తరతమభేదము నంగీకరించవలెను. విప్రలంభశృంగార ప్రతీతిలో సుఖానుభూతి అతిస్వల్పమని రస

కలికాకారుడు చెప్పుచున్నాడు. సుఖదుఃఖావస్థారూపములు రసములని శృంగారప్రకాశకారుడు, రసము సుఖదుఃఖాత్మక మని నాట్యదర్పణకారుడు గూడ చెప్పుచున్నారు. విషాద నాటకములలో కన్పించు ఆధ్యాత్మికప్రభ్రంశము కూడ ఈ సిద్ధాంతమునే స్థిరపరచ గలదని 'బ్రాడ్లే' యొక్క సమీక్ష యందు గాననగును. ఈ సిద్ధాంతము నంగీకరించిననే శోక, క్రోధ, భయాదులకు రసత్వము సిద్ధించగలదని మధుసూదన సరత్వతి చెప్పుచున్నాడు.

కాని రసప్రతీతిలోగల దుఃఖానుభూతి మనలను విషాద మున ముంచలేదు. సుఖము ఆత్మస్వరూపమని, ఆత్మస్వరూప మనగా రసమని, సామాజికుడు సుఖవ్యంజకయగు వృత్తి ద్వారా తదనుభూతిని పొందుచున్నాడని, సుఖస్వరూపమగు ఆత్మ దుఃఖమున కాధారము కాజాలదని, మధుసూదన సరస్వతి పలుకుచున్నాడు. సత్త్వముచే మనస్సు పూర్తిగా విష్టమైనచో కేవలము సత్త్వవృత్తియే రసావస్థ నభివ్యక్తము చేయ గలుగును. సాత్త్వికమైన మనస్సు ఉత్తమసుఖమును అవశ్య మభివ్యక్తపరచును. ఇట్టి అభివ్యక్తియే రసమనెదరు. కాని సమగ్రమగు సత్త్వావస్థ రానంతవరకు రజస్తమోగుణము లుండక తప్పవు. కాని సుఖదుఃఖాది హేతువులు బోధ్యనిష్ఠము లైనను బోద్ధృనిష్ఠము లైనపుడు సుఖమాత్రైక హేతువులే యగుచున్నవి. రసప్రతీతిలో దుఃఖాసంభిన్నమగు సుఖమే అనుభూయమాన మగుచున్నదని చెప్పునపు డీసుఖమునకు జ్ఞానమని అర్థము చెప్పికొనవలెను.

7. ఆహార్యాభినయ ప్రకరణమున అభినవగుప్తు డిట్లని నాడు "యథా పరమాత్మా స్వచైతన్య ప్రకాశ మత్యజన్నపి దేహకంచుకోచిత చిత్తవృత్తి రూషిత మివ స్వరూప మాదర్శ యతి, తథా నటోఽపి ఆత్మావష్టంభ మత్యజ న్నేవ లయతా లాద్యనుసరణయోగా ద్దేహస్థానీయే నర్తనాదివేషపరివర్తనే తదుచిత స్వభావాలింగిత మివ స్వాత్మానం సామాజికాన్ ప్రతి దర్శయతి." స్వచైతన్యప్రకాశమును వదలివేయకుండా పరమాత్మ జీవుడుగా భాసించుట గలదు. కాని జీవత్వము నంతగా ఆయా దేహకంచుకోచితములగు చిత్తవృత్తులచే నుపహితుడగుచున్నాడు. ఐనను నిజచైతన్యప్రకాశము తిరోగ మించుటలేదు. ఇట్లే నటుడుగూడ నిజస్వభావాదికమును రంగ స్థలమున కోల్పోవుటలేదు. లయతాలాద్యనుసరణ యోగమున నర్తనాది వేష పరివర్తనములలో, ఆయా వేషములకు తగిన స్వభావములతో సామాజికులకు కన్పించుచున్నాడు. అనగా నటుడొక పాత్రతో నభేదము ననుభవించుచున్నా డనువవుడు విశేష మొకటి గలదు. నటునకు కలుగు హృదయసంవాద మాత్మవిస్మృతిని, ఆత్మవికాసమును చేకూర్చ జాలినది. ఈ ఆత్మవిస్మృతిలో ప్రమేయములతో నభేదప్రతిపత్తి కలదనగా ప్రమేయములం దంతర్లీనములు, అంతర్భూతములు నగుచున్న వని తాత్పర్యము. ఇట్లు తనలో ప్రమేయ మంతర్లీనమై, చైతన్యాకారమున భాసించుచున్నదను జ్ఞానము కలుగుటయే నటునకుగల సాధారణీకరణము. నటునకు ఆయాపాత్రలకు ఎట్టి సంబంధమును చెప్పితిమో అట్టి సంబంధమే సామాజికునకు

నటునకు గలదు. కాగా దుష్యంతాది పాత్రలు, నటులు, సామాజికులు అను వారలయం దొకరిలో నితరు లంతర్లీనులై భాసించుటయే ఇచట కన్పించు అభేదప్రతిపత్తి. దీనినే సాధారణీకరణమని వ్యవహరించితిమి. ఈ రీతిగా సిద్ధమగు రసప్రతీతిని సమ్యగ్జ్ఞానమని యెంచక తప్పదు.

8. రసచర్వణ, భక్తిభావనలోగల తన్మయీభవనము, బ్రహ్మాస్వాదము అను మూడింటిలోను కొంత సామ్యము కన్పించుటచే వీటికిగల అన్యోన్యసంబంధమును విచారించ వలసి యున్నది.

"సత్త్వోద్రేకము వలన అఖండ స్వప్రకాశానంద చిన్మయము, వేద్యాంతర స్పర్శశూన్యము, బ్రహ్మాస్వాద సహోదరము, లోకోత్తర చమత్కార ప్రాణము నగు రసము స్వాకారాభిన్నముగా నాస్వాదింప బడుచున్నది." అని విశ్వనాథుడు చెప్పియున్నాడు. రజస్తమోగుణములచే నస్పృష్టమగు మనస్సును సత్త్వమని యందురు. సత్త్వమయ మగు మనస్సునకు ఆత్మకు భేదములేదు. ఈ ఆత్మను సంవిత్ అని, చైతన్యమని వ్యవహరించినాము.

రసప్రతీతియందు ప్రమేయావభాసకన్న సంవిత్స్వభావాభివ్యక్తియే ప్రధానమైనది. దేశకాలాద్యుపాధి రహితముగా భాసించు ఆత్మ రసచర్వణలో సర్వానుగ్రాహక మగుచు విస్తరవికాసముల నందుచున్నది. ఆత్మవికాసమున అనుభూతి విశదమగుచున్నది. ఈ విశదీకరణయందు ఇద మనిదం రూప

చైతన్య మనుభూత మగుటచే ప్రమాతృప్రమేయముల కభేద ప్రతిపత్తి కలదని చెప్పవలెను. ఈ యనుభూతి బ్రహ్మానుభూతి వంటిదని సిద్ధమగుచున్నది. ఇందు సంవిన్నిజరూపము సౌందర్య ముగా భాసించుచున్నది.

సంవేదనమున విభిన్నవిషయముల కేకత్రానుసంధానము కలుటచేతను, సంవేదనరహితమగు అనుభూతి లేకపోవుట చేతను, ప్రతి యనుభూతియందును సంవిత్ ఆధారభూతముగా కలదని చెప్పవలెను. విభిన్నవిషయములు సంవిదధీనము లగుటచే సంవిత్సంవలితములై భాసించుచున్నవి. ఈవిధముగా సంవిత్సూత్రమున సిద్ధమగు సమన్వయము ప్రతి యనుభూతి లోను లక్ష్యముగా కన్పించుచున్నది. ప్రకాశానందచిన్మయ మగు సంవిత్ స్వతఃసిద్ధమైనది. కావున "అద్వితీయమగు ప్రకాశము స్వతంత్రము, స్వతఃసిద్ధము. స్వాతంత్ర్యవశమున నీప్రకాశము దేశకాలాకారము లనబడు అవచ్ఛేదములతో నుండదు. సర్వవ్యాపకమై నిత్యమై, సర్వాకార నిరాకార స్వభావమైన దీప్రకాశము" అని తంత్రసారమున అభినవగుప్తుడు పలికినాడు. ఈవిధమగు సంవిదనుభూతియే ఉత్తమమైనది. దీనికి మించిన అనుభూతి లేదు. దేశకాలాకారావచ్ఛిన్నమగు వ్యక్తికి, తదనవచ్ఛిన్నమగు నీ ప్రకాశమునకు నుపాధిభేదమే కన్పించునుగాని పారమార్థికభేదము లేదు. ఈ యభేదము భావశూన్యమగు అభేదము కాదుగనకనే ఇచ్ఛా క్రియా జ్ఞాన సంవలితముగా నీసంవిత్ భాసించునని చెప్పబడినది. "ప్రకాశ మనబడు సంవిత్ అభివ్యక్తముచేయు స్వాతంత్ర్య మానంద

శక్తి, తచ్చమత్కార మిచ్ఛాశక్తి, ప్రకాశరూపత చిచ్ఛక్తి, ఆమర్శాత్మకత జ్ఞానశక్తి, సర్వాకారయోగిత్వము క్రియాశక్తి" అని తంత్రసారమున నభినవగుప్తుడు వివరించినాడు. స్వాతంత్ర్యము, అధ్యక్షత్వము, అంతర్యామిత్వము, స్వసంవిత్సంవేదనత్వము, సర్వానుగ్రాహకత్వము అనువాటిచే తెలియబడు పారమార్థికతత్త్వము క్రమముగా ఆనందము, ఇచ్ఛా, చిత్, జ్ఞానము, క్రియా అను ఐదు శక్తులద్వారా భాసించుచున్నది. శివాద్వయదర్శనకర్తయగు సోమానందనాథుడు ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులనే గ్రహించినాడు.

అభినవగుప్తుడీ శివాద్వయదర్శనము ననుసరించి రసప్రతీతిని వ్యాఖ్యానించినాడు. ఈదర్శనమున రసప్రతీతికి బ్రహ్మానుభూతికి అభేదము చెప్పబడజాలదు. కాని రెంటికి విశేషసాదృశ్యము కలదని మాత్ర మీదర్శన మంగీకరించగలదు. బ్రహ్మశబ్దమిచట శివపరముగా గ్రహించబడుచున్నది.

బ్రహ్మానుభూతియందు ఆనందము, ఇచ్ఛా, చిత్, జ్ఞానము, క్రియా అను శక్తులకు సమన్వయము కుదురుచున్నది. ఇచ్ఛా క్రియా శక్తులు తిరోహితములైనగాని రసప్రతీతి కలుగజాలదని అభినవగుప్తుని వ్యాఖ్యలో కన్పించుటచే రసాస్వాదమసమగ్రమైనదని చెప్పవలెను. అందుచే రసాస్వాదమును బ్రహ్మాస్వాద సహోదరమని అభినవగుప్తుడు పలికినాడు. పైకారణములను వివేచించక ఈసిద్ధాంతమును తర్వాతిసాహిత్యసమీక్షకు లంగీకరించినారు. భట్టనాయకాభినవగుప్తుల వాదములను చక్కగా నవలోకించి, శివాద్వయదర్శనములోని

గుణదోషములను విచారించి, సంప్రదాయసిద్ధమగు శాంకర వేదాంతమున కనుగుణముగా రసచర్వణను వివేచించిన జగన్నాథు డొక్కడే బ్రహ్మాస్వాద సహోదరత్వమును రస ప్రతీతికి అంగీకరించలేదు.

రసపరిపోషముచేయు నటాదిసామగ్రి రససాక్షాత్కారమున కుపకరించును. ఈ సాక్షాత్కారము దేశకాల ప్రమాత్రాది నియంత్రిత మైనదికాదు. హృదయసంవాదవశమున కలుగు సాధారణీభావమున దేశకాల ప్రమాత్ర నియంత్రితమగు రసము ప్రతీయమాన మగుచున్నది. ఈసాధారణీభావమున కలుగు అద్భుత భోగాత్మ స్పందావేశమును చమత్కారమని, లోకోత్తరాహ్లాద మని యందురు. భయోత్సాహ క్రోధ శోకాదులను సమన్వయింప జాలిన ఈ యద్భుత సంవేదనమున విశ్రాంతిలక్షణలక్షితమగు భోగావేశము కలదు. ఈవిధమగు అనుభూతి స్వయంసిద్ధము, స్వయంపోషకము నగుటచే లోకోత్తరమని, నిత్యమని, అబాధ్యమని చెప్పబడుచున్నది. ఇది మిథ్యగాని, భ్రమగాని, అనిర్వచనీయముగాని, ఆరోపాధ్యవసాయాది రూపముగాగాని గ్రహింపబడరాదు.

ఇక భక్తిపూర్వకమగు సగుణేశ్వరప్రతీతిని గమనింతము. ఇచట పరిచ్ఛిన్నమగు వ్యక్తికి, తత్ప్రమేయమగు సగుణేశ్వరునకు సంబంధము కలదు. ప్రమాతృప్రమేయముల కిచటగూడ నవినాభావసంబంధము కలదు. ప్రమేయముగా భాసించుటచేతను, సగుణేశ్వరుడు పరిచ్ఛిన్నవ్యక్తి యగుచున్నాడు. కాని భక్తిసమావిష్టుడగు మానవు డీశ్వరుని అనరి

చ్చిన్నాడని యెంచుచున్నాడు. భక్తిభావనలో నీ ప్రమాతృ ప్రమేయములకు సమగ్రమగు అనన్యత్వమే ఉద్దిష్టార్థ విషయము. కాని ఈ అనన్యత్వమున సమవాయాది సంబంధములు నిరస్తములు కాగలవు. అట్టిచో భక్తిభావన కతీతమగు ప్రవృత్తి, ప్రతీతి కన్పించగలవు.

ఇదేవిధమగు ప్రవృత్తి కావ్యజగమునకూడ కన్పించుచున్నది. కావ్యానుభూతిలో ప్రమేయములు స్వతఃసిద్ధములుగా భాసించక, అన్యోన్యసంబంధములు కలవిగా ప్రతీయమానము లగుచున్నవి. ప్రమాతలో నంతర్లీనముగా ఉండి, అభివ్యక్త మగుచు సమగ్రత్వమునందు సంవిత్స్వభావమే బాహ్యప్రమేయములయందు కన్పించుటచే, సంచార్యాదికమగు సంవేదనము బాహ్యజగన్నిష్ఠముగా అనుభూయమానమగుచున్నది. కీచకరంధ్ర భాగములు గాలిచే పూరింపబడునపుడు కలుగు ఆక్రోశమును తీసికొందము. సమీరణ మాక్రోశించుచున్నదని కవి పల్కుచున్నాడు. ఈ యాక్రోశము వాస్తవికము కాదని, కవి యొక్క ఊహయని యెంచుటకు వీలులేదు. వాయువు యొక్క నిజస్వభావ మనేకవిధములుగా అనేకులకు భాసించుచున్నది. ఈ యవభాసనము లన్నియు కలసిననే వాయువుయొక్క నిజస్వభావమును పూర్తిగా వ్యక్తము కాగలదు. సామాన్యానుభవమున వాయుస్వభావములలో నొక అంశము మాత్రమే కన్పించుచున్నది. భౌతిక రసాయనాది శాస్త్రములు మరికొన్ని అంశములను గ్రహించుచున్నవి. సామాన్యముగా అవలోకించ

బడనటువంటి అంశము కావ్యభావనలో గ్రహించబడుచున్నది. భౌతిక రసాయనాది శాస్త్రములకు వాయుగతమగు నాక్రోశ మసత్యముగా కన్పించవచ్చును. కాని ఈ యాక్రోశము సంవేదన సంవేద్యమగుటచే కవియొక్క ఊహా కాజాలదు. ప్రతిభాశాలియగు కవి భావనావిశేషమున సమీకరణనిష్ఠమగు ఆక్రోశమును గ్రహించ గలుగుచున్నాడు.

సమీకరణనిష్ఠముగా ఆక్రోశము కావ్యానుభూతి యందు భాసించుచున్నది. కాని ఈ ఆక్రోశము మన బుద్ధిని తృప్తిపరచ లేకున్నది. నాదమునకు ఏవిధముగ సంబంధ మెట్లు కలుగుచున్నదో సమగ్రముగా తెలిసిన గాని మన తార్కికబుద్ధికి సంతృప్తికలుగదు. అందుచే బుద్ధిద్వారా ప్రమేయములను విశ్లేషించి చివరకు ప్రతివస్తువునందు ద్రవ్యత్వము, క్రియాత్వము మూలభూతములుగా గలవని చెప్పుచున్నాము. కాని అమూర్తమగు ద్రవ్యముగా గాని, సంచలనరహితముగా గాని మన యనుభూతిలో ఏవస్తువునకు అనుప్రవేశము లేదు. భావరూప సంయోజనముతో, భావాభివ్యక్తి కనుకరించు నట్లుగా వస్తువు ప్రతీతిలో కన్పించుచున్నది. తార్కికబుద్ధి ననుసరించితిమేని వస్తువునకు వస్తుత్వమే నిలువదు. ఈ సంశయావస్థ అనుభవవిరుద్ధమైనది. సంవిత్సంవేదన మీ సంశయావస్థతో తృప్తిపడజాలదు గనుక సర్వదా మనము సంసర్గానవగాహి యగు అనుభూతులయందే పురుషార్థములు గలవని చెప్పగలుగుచున్నాము. ఏవంవిధమగు ప్రతీతి అపరోక్షానుభూతియని, నిర్వికల్పకప్రత్యక్షమని చెప్పబడుచున్నది. దీనినే

సౌందర్యమని, సత్యధర్మము లీసౌందర్యరూపములని "వైట్
హెడ్" చెప్పినాడు. భక్తిభావనలో ఆత్మవిశ్రాంతి రూపము
అభేద ప్రతిపత్తిపూర్వకమునగు అపరోక్షానుభూతి కన్పించక
పోవుటచే సౌందర్యభావన కుత్స్నుకుల మగుచున్నాము.

వస్తురూపములలో సంతృప్తి కావ్యభావనయందుగాని
భక్తిభావనయందుగాని కన్పించుటలేదు. ప్రత్యక్షముగా
కన్పించు వస్తువుల కింద్రియ గ్రాహ్యత్వమును మాత్రమే స్వీక
రించక వీటిని సంవిద్విశిష్టములుగా నీ రెండు భావనలయందు
గ్రహించుచున్నాము. ఈ ప్రవృత్తిలో సర్వానుగ్రాహకు డగు
ఈశ్వరునియందు భక్తిభావనలో మనస్సు లగ్నమగుచున్నది.
తద్ద్వారా ప్రతివస్తువు పరమేశ్వరుని అభివ్యక్తము చేయుచు
న్నట్లు గైకొనబడుచున్నది. కాని కావ్య భావనలో నిట్టి అద్వి
తీయ మగు పారమార్థిక తత్త్వముపై మనస్సు లగ్నము కా
నక్కరలేదని, బాహ్యరూపమున కతీతమగు భావముద్వారా
వస్తుస్వరూపము వ్యాఖ్యానించబడుచున్న దని, ఇందుచే
భక్తిభావనయే కావ్యభావనకన్న మిన్నయని "ఎ. సి. బ్రాడ్లే"
చెప్పుచున్నాడు.

కాని కేవలము వస్తుస్వరూపనిష్ఠమగు భావముద్వారా
రూపమును వ్యాఖ్యానించుట మహాకావ్యములలో కన్పించుట
లేదు. స్వగత పరగతాది నియమ రహితుడై దేశకాలా
ద్యుపాధులచే నని యంత్రితుడై మహాకవి భావనద్వారా పార
మార్థికతత్త్వమునే దర్శించుచున్నాడు. ఈ పారమార్థిక
తత్త్వము వస్తువులలో అంతర్యామిగాగల దని, తద్వశమున

సౌందర్యాభివ్యక్తి కలుగుచున్న దని కావ్యభావములో కన్పిం చుటచే భక్తిభావన దీనికన్న మిన్నయనుట ప్రామాదికమేమో అని అనిపించగలదు. రసప్రతీతిలో గల సంవిత్సంలేదనముననీ అంతర్యామియే ప్రతీయమాన మగుచున్న దని విస్మరించ రాదు.

భక్తిభావన ఉదాసీనబుద్ధిలో పరిత్యజించుకొన్ని విషయ ముల పైకావ్యభావనకు ఔదాసీన్యము లేదని "ఎ. సి. బ్రాడ్లే" చెప్పుచున్నాడు. సంచార్యాది భావముల విన్యాసమున మహా కవులు చూపు అభిరుచి, వైదగ్ధ్యము భక్తిభావనలో కన్పడ వని ఈ వాదసారాంశము. కాని మానవజాతికి వైశిష్ట్యము నాపాదించు సంచారి భావోద్దీపన లేని భక్తిభావన మానవ హృదయములను స్పందింపజేయ జాలదు. భక్తిభావనలో కలుగు తన్మయత్వములను వర్ణించు యోగులరచనలను గమ నించితిమేని "ఎ. సి. బ్రాడ్లే" వాదము నిరస్తము కాగలదు.

కావ్యాస్వాదనమున భావనా వ్యాపార మతిప్రధాన మైనది. రసప్రతీతికి భిన్నమైన లక్ష్యము భావనలో కన్పించదు. ఇచట భావనావ్యాపారము కేవల ముపకరణము గాక సాధ్యము కూడ నగుచున్నది. కాని భక్తిభావనలో భావనావ్యాపార మను సాధనముద్వారా సాధ్యమగు పరమేశ్వరుడు ప్రతీతి యోగ్యు డగుచున్నాడు. భావనా సమున్మిషితుడైన పరమే శ్వరు డచట లక్ష్యమగు ప్రమేయము. రసప్రతీతిలో గల భావన ఇంద్రియగ్రాహ్యమగు శబ్దాదుల ద్వారా అభివ్యక్తమగుచున్నది. ఈ ఇంద్రియ గ్రాహ్యత్వము భక్తిభావన కతివిరుద్ధ మైన దని

"ఎ. సి. బ్రాడ్లే" చెప్పుచున్నాడు. కాని యోగిప్రత్యక్షమున ఇంద్రియ గ్రాహ్యత్వము పూర్తిగా పరిత్యక్త మగుచున్నదా?

భావనాసమున్మిషితము లగు రసభావములు భావనచే నుపజీవ్యము లగునవి "భావనా పరిపోషమున కీ రసభావము లతిముఖ్యములు. అవిశ్రాంతి లక్షణ మగు ఇచ్ఛాశక్తికి విశ్రాంతి గొలుపు అసాధ్యవిషయము నన్వేషించుటగాని, తత్సాన్వేషణ సల్పుటగాని కావ్యమున కనవసరము. అందుచే లలితకళ లెంతమహత్తర భావాన్వితము లైనను, పురుషార్థములతో ప్రసక్తి లేకుండా విషయములను సృష్టించుచు, భావనావశమున విషయముల కన్యోన్యబంధములను కూర్చుచున్నవి. ఈ సంగతి నెరిగినకవులు భౌతిక రసాయనాది శాస్త్రములలో కన్పించు వస్తుసత్తాకత్వమునుగాని, దార్శనికు లంగీకరించు వస్తుసత్తాకత్వమును గాని, తమ విషయములకు గలదని చెప్పుటలేదు" అని "ఏ. సి. బ్రాడ్లే" వాదించుచున్నాడు.

అపరిమితస్వేచ్ఛతో భావనావ్యాపారము ప్రవృత్త మగుచున్నదని ఈ వాదమున నంగీకరింపబడుట శోచనీయము. అనుభూతిలోనున్న సంవిదధీనముగా భావనావ్యాపారము ప్రవర్తించగలదు. కాని అపరిమితస్వాతంత్ర్యముతో మాత్రము కాదని గ్రహించవలెను. కావ్యగత భావములు, యోగి ప్రత్యక్షమున గల భావములుకూడ హృదయము, ఇచ్ఛా, భావన అను మూడింటికి సమన్వయము కుదిరినపుడే వచ్చుచున్నవి. ఈ సమన్వయమున ననుభూతములగు భావములకు

లౌకికయోగ్యమగు స్థాయిత్వమును తీసికొనివచ్చుటకే మానవ ప్రయత్నము బయలుదేరుచున్నది. ఈ భావములను తాత్త్వికము లని గ్రహించి, వీటిపై శ్రద్ధాభక్తులను నిలుప గలుగుచున్నాము. ఈ శ్రద్ధాభక్తులను భూతము లగు సమయమున నిది భావనాజనిత మగు స్థితియని జ్ఞానము వచ్చినచో నీ యను భూతి క్రమక్రమముగా తిరోహితమగుచున్నది. రసప్రతీతి యందు భక్తి ప్రతీతియందును గూడ బుద్ధి ఇచ్ఛ అనునవి భావనాంగములుగానే కన్పించుచున్నవని తాత్పర్యము. అతితీక్ష్ణ యోగ సమాధిలోవలె మహత్తర రసప్రతీతిలో గూడ సంవేదనమే కలదు. బుద్ధి ఇచ్ఛ అనునవి వాటి వాటి స్వరూప స్వభావములను కోల్పోవుచున్నవి. ఈ సంవేదనమున సంవిద్రూపముగా భావములు గలవు గనుక ఆత్మ, మనస్సు, హృదయ సంవిదాకారమున భాసించుచున్నవి. అందుచే కావ్యమొక ఉపహిత చైతన్యమని ఎచటనుండి కావ్యభావన వచ్చుచున్నదో మనకు తెలియ జాలదని మనము కోరుకొనినపుడీ భావన రాదని ఈ భావనావశమున కల్గు రసప్రతీతి యందు అనుపహితచైతన్య ప్రతీతి కలదని నిశ్చయింపవలెను.



# అనుబంధము ౨

రసనిష్పత్తికి స్థాయిభావములు, సంచారిభావములు, అనుభావములు, విభావములు అవసరములని సంప్రదాయ వచనము. స్థాయిభావమే ఇతర భావ సంయోగవశమున రస ముగా నిష్పన్నమగును.

నిర్వేదము మొదలుగా గల సంచారి భావములు ముప్పదిమూడు గలవని భరతునివచనము. వీటిని ఆంగ్లమున 'ఇమోషన్స్' అందురు. ఏదో ఒక సన్నివేశము నాశ్రయించు కొనిసంచారిభావ ముద్దీపితమగును. స్థాయిభావమునదాగియున్న సంచారిభావము ప్రత్యక్షదర్శనవలనగాని, భావములవలనగాని, శారీరక పరిణామములవలనగాని రగుల్కొలుపబడును. ఇందు ఇచ్ఛా,జ్ఞాన, ఆనందములు సంవలితములై యుండుటచేసంచారి భావోద్దీపనమున వస్తువుయొక్క ప్రధానస్వభావము నిరూపిత మగును. జ్ఞానజన్యమై, ప్రవృత్తిచోదకమై, ఉద్దిష్టార్థప్రాప్తి నాశించునది సంచారిభావము. ఇది క్షణికము, తత్కాలానుభవ యోగ్యము నగుటచే స్థాయిభావమున కంగ మగుచున్నది.

సంచారిభావ మనుభవింపబడునపుడు. ఆంతరంగికమగు అనుభూతి బాహ్యముగా వ్యక్తమగును. ఈ వ్యక్తీకరణలో బయలుదేరునవి సాత్త్వికభావములు, అనుభావములు. శరీర జములగు కటాక్షాదికమువలె కార్యభూతమైనది అనుభావము

(Sensation). ఈ యనుభావము లంతర్గతభావమును అనుస రించి యుండునవి. మనోవృత్తు లుద్దీప్తములై ప్రవృత్తిపరము లైనపుడు శరీరమున కన్పించు మార్పులను అనుభావము లందురు. అనుభావతుల్యములైనవి సాత్త్వికభావములు. సంచారిభావము నుద్దీపింపజేయగల శక్తి బాహ్యవస్తువున గలదు. ఇట్టి ఉద్దీపన మానసికముగా జరుగుచున్నను శారీరకముగా అభివ్యక్తమగుచున్నది. సాత్త్వికభావానుగతమగు సంచారిభావము సుఖదుఃఖాది హేతుకమగుచు స్థాయిభావమును ప్రవృత్తిపరము చేయుచున్నది. సంచారిభావ ముద్దీపితము కాగా తదభివ్యక్తికి తోడ్పడు శారీరక పరిణామములే సాత్త్వికాద్యనుభావములు.

వాచిక, ఆంగిక, సాత్త్వికాభినయము వేటిద్వారావిభావ్య మాన మగుచున్నదో, అవి విభావములు. స్థాయిభావమును రసముగా పరిణమింపజేయుటకు సహకారికారణములగు విభావములు బాహ్యజగత్తులోని విషయములు లేక సన్నివేశములు.

మనస్సుయొక్క స్వరూపవిన్యాసమున స్థావరముగా నుండునవి స్థాయిభావములు. ప్రతి స్థాయిభావములోను జ్ఞానాంశ, ప్రవృత్త్యంశ, అను రెండు అంశలు కలవు. ప్రతి వ్యక్తి ఉపయోగించగల మానసికశక్తి స్థాయిభావప్రవృత్తిలో కన్పించును. బాహ్యవిషయ సందర్శనచే స్థాయిభావములో యత్కించిత్ చలనము కల్గినతర్వాతనే ప్రవృత్తి ఉత్పన్న మగును. ఊకదలిక కాగానే స్తబ్ధముగానున్న స్థాయిభావము పైకి ఉబుకుచున్నట్లు కన్పించుచే ప్రతి స్థాయిభావమున

(Inssinct) విశిష్టమగు సంచారిభావము (Emotion) ఒకటి ఉండును. అన్నిపదార్థములను ఉప్పు తనలోనికి పరిణమింప జేయునట్లు, సంచార్యాదిభావములను తనలోనికి పరిణమింప జేయ జాలినది స్థాయిభావము. సంచారిభావములు స్థాయికి విరుద్ధములైనను, అవిరుద్ధములైనను, స్థాయిని తిరోగమింప జేయలేవు. ఈ స్థాయిభావమే రసముగా పరిణమించునది.

ప్రధానస్థాయిభావములు రతి, హాసము, క్రోధము, భయము, ఉత్సాహము, విస్మయము అనునవి. గ్లాని, ఔత్సుక్యము, శంక, అసూయ, గర్వము, నిర్వేదము, వ్రీడ, చింత, అనునవి మాత్రమే సంచారిభావములు. స్తంభము, స్వేదము, రోమాంచము, స్వరభంగము, లేపథువు, వైవర్ణ్యము, అశ్రువు, ప్రలయము మొదలగునవి. సాత్త్వికాద్యనుభావములు. *



* ఈ భావములపై సమగ్రవిచారణము భారతిలో, ఖరసంవత్సర పుష్య, ఫాల్గున సంచికలలోను, నందన చైత్రసంచికలోను, సమగ్రముగా వివరించి యున్నాను.

## అనుబంధము 3

శృంగారాదిరసే ష్వేషు య దంత ర్భాతి నిత్యశః,
త ద్వందే శాంత మద్వైతం యేన సర్వ మిదం తతమ్.

భావై ర్యథా విలసితా నిజచిత్తవృత్తి
రాప్నో త్యలోకవిభవై శ్చ రసాదిరూపామ్
ఆ స్వాదయోగ్యసుభగాం వివృణోమి తావ
న్నిశ్శేష మత్ర రసభావవికల్పమార్గే.

రసచర్వణ, భక్తిభావన, బ్రహ్మానుభూతి, అనునవి అప రోక్షానుభూతులు. ఈమూటికి అన్యోన్య సంబంధము కలదు. విభిన్నమార్గముల నవలంబించు నీ మూటియందును ఉత్తమ పురుషార్థములే ఉద్దిష్టవిషయములు. వీటిలో నాబాలవృద్ధు లకు నిర్వికల్పక ప్రతీతియోగ్య మైనది రసచర్వణ. ఈ రస చర్వణలోగల రసశబ్దమున కర్థమేమి? అను ప్రశ్నకు సమా ధాన మీయవలె ననిన శాంతరసమును విచారించవలెను. రస మనగా శాంతమేయని, శాంతి ముసహితముకాగా, ఆయా ఉపాధుల ననుసరించి శృంగారము మొదలుగాగల ఎనిమిది రసములు రాగలవని ఈ విచారణలో సిద్ధము కాగలదు.

శృంగారము, హాస్యము, కరుణ, రౌద్రము, వీరము, భయానకము, భీభత్సము, అద్భుతము అను ఎనిమిది రస

ముల నాలంకారికు లందఱు అంగీకరించినారు. వీటితో శృంగార, హాస, కరుణాద్భుతములే రసములని ఆంధ్రభారతిలో వివరించి యున్నాను. ఇవిగాక అనేక రసము లున్నవని ఆలంకారికులు కొందరు వాదించియున్నారు. ఈ నవ్యరసములకు చెప్పబడు స్థాయిభావములకు స్థాయిత్వము లేకపోవుటచే నివి రసములు కాజాలవని వివరించితిని. కాని శాంతమను ఇంకొక రసమును గూర్చి బహుతరవిచార మాలంకారికులచే గావింప బడినది. శాంతము రసము కాజాలదని పలువురు వచించి యున్నారు. శాంతము తొమ్మిదవ రసమని, ఉత్తమపురుషార్థ మగు మోక్షము నుద్దేశించిన దగుటచే నతిప్రధానమైన దని కొందరు పలికియున్నారు. సకలసాహిత్యమునకు శాంతప్రవర్తకత్వమును సాధించిన భట్టనాయకుని మార్గము నవలంబించి అభినవగుప్తుడు శాంతమును మహారసమని శాంతమే రసమని వివరించినాడు.

శృంగారాది రసములవంటిది శాంతము కాదని ఈ వాదవివాదములలో స్పష్ట మగుచున్నది. ఈ వైలక్షణ్య మెందువలన వచ్చుచున్నది? శృంగారాదులవంటిది కాకపోయి నను శాంతమును రసమని ఏల వ్యవహరించుచున్నాము?

ఈ ప్రశ్నలకు ప్రత్యుత్తరము నొసగుటకు ముందు శాంతరస మెట్లు సమీక్షకుల చేతిలో పడినదో గమనించ వలెను. దాక్షిణాత్యప్రతు లనుసరించు నాట్యశాస్త్రమున శాంతరస ప్రకరణము లేదు. "అష్టరసాశ్రయో నియుక్తః"

అని విక్రమోర్వశీయమున మహాకవి పలికినాడు. ఉభయాభి సారికలో వరరుచి ఎనిమిది రసములనే చెప్పినాడు. రసములను నందికేశ్వరుడు ప్రపంచించినాడని రాజశేఖరు డనినాడు. వాసుకిద్వారా శాంతరసము వచ్చినదని శారదాతనయుని అభిప్రాయము. కోహలుడు శాంతరసమును తెచ్చినాడని ధర్మసూరిప్రభృతు లనినారు. ఉద్భటుడు శాంతరసమును ప్రస్తుతించి యున్నాడు. భట్టనాయకుడు శాంతమును విశేషించి వివరించినాడు. అభినవగుప్తుడు శాంతరసప్రకరణమున విజృంభించినాడు. ఆనందవర్ధనునకు పూర్వము శాంతరసమునుగూర్చి వాదోపవాదములు గలవని స్పష్టము. ఈ శాంతరసమునకు సంబంధించిన భాగమును నాట్యశాస్త్రములోనికి ప్రవేశింపజేసినవాడు భరతుడుకానిచో భట్టనాయకుడే యై యుండవచ్చునని ఎంచుటకు తగిన ఆధారము కన్పించుచున్నది.

సర్వశాస్త్రార్థప్రవర్తకము సర్వభావానుకీర్తనము లోకవృత్తానుకరణము, సప్తద్వీపానుకరణము నగునది నాట్యమని భరతు డనేకపర్యాయములు చెప్పియున్నాడు. ఇట్టినాట్యమున శాంత ముండదని భావించుట దుష్కరము. జీవితమునంతయు ప్రదర్శించు నాట్యము భిన్నరుచులు గలప్రజల కందరకు తృప్తినొసగునది. యువకులు శృంగారమున, వైదగ్ధ్యము కలవారు నాట్యగతభావమున, అర్థపరులు వీరరౌద్రాదుల యందు, విరాగులు మోక్షమున సంతోషము నందుచున్నారని భరతుడు చెప్పినపుడు మోక్షశబ్దమునకు శాంతమని అర్థము చెప్పవలెను. భిన్నరుచులు గలజనులకు సంతోష

మును గూర్చుచు, కావ్యజగమున నవగతములగు సూత్రములను, నియమములను నాట్యము వదలజాలదు గనుక శాంతము కావ్యజగములో విశిష్టముగా ప్రతీయమానము కావలసియున్నది.

కావ్యజగమున గల పురుషార్థములే రసములు. కావ్యేతరజగమునుండిగాని, కవియొక్క మనస్సునుండిగాని, ఆవిర్భవించునవి రసములు కావు. తత్త్వనిష్ఠములైన రసములు తత్త్వమును సౌందర్యరూపమున ప్రకాశితము చేయునవి. ఈ రసములలో మనకు తత్త్వావగతి కలుగుచున్నది. కావున నీ రసములలో ననువృత్తమగుచు. రసములకు సౌందర్యత్వాది ధర్మముల నాపాదించుచు, రసములకు రసత్వమును సిద్ధింప జేయుతత్త్వమేదో, ఆ తత్త్వమెట్లు కావ్యలోకమును ప్రవేశించుచున్నదో, మనము తెలిసికొన వలసియున్నది. ఈ తత్త్వమునే శాంత మనవలె నని సిద్ధాంతింప బోవుచున్నాము.

ప్రతిపురుషార్థమునకు నొక కామము గలదని చెప్పుచు భరతుడు మోక్షకామమునుగూడ ప్రస్తుతించినాడు. అనురాగవిరాగములు సంవలితములై మోక్షకామమున నుండ గలవు. విరాగానురాగముల కతీతమైన దీయవస్థ. ఇట్టి అవస్థలో కన్పించు శృంగారము లౌకికశృంగారమువంటిది గాక బ్రహ్మభావనవంటి దని చెప్పవలెను. దీనినే భక్తిశృంగారముగా కొందరు ప్రపంచించినారు. ఈ భక్తిశృంగారమున ప్రతీత మగు శాంతమును గురించి.

"యో మాం ప్రయతతే హంతుం
మోక్ష మార్గాయ పండితః
తస్య మోక్షరతిస్థస్య
నృత్యామి చ హసామి చ"

అని మహాభారతము చెప్పుచున్నది. "మోక్షము నుద్దేశించి నన్ను చంపుటకు యత్నించు పండితునకు సహితము మోక్షరతి యుండుటచే అట్టివానిని చూచి హసించుచు ఆడుదును" అని కామము చెప్పుచున్నది. మోక్షశృంగారమున ప్రమాతృప్రమేయముల కభేదప్రవృత్తి వాంఛిత మగును.

ధర్మశృంగారమును గురించికూడ భరతుడు పల్కుచున్నాడు. ధర్మాభివ్యక్తి రసచర్వణలో ఉన్నను, ధర్మాధర్మములచే రసము నియంత్రిత మగుటలేదు. పురుషార్థ మగు ధర్మమే తత్త్వ మగుటవలనను, ఈ తత్త్వావగతియే రసచర్వణలో కన్పించుటచేతను, రసము నుపహితముచేయు కావ్యము ధర్మవిరుద్ధము కాజాలదు. ఈ ధర్మము భావనానుప్రాణితమై కావ్యమున గలదు. ఏవంవిధమగు ధర్మప్రతీతి వృద్ధులకే ముఖ్యముగా కలుగునని భరతుడు పలికియున్నాడు. వృద్ధలనగా అనుభవజ్ఞులని అభిప్రాయము.

తత్త్వజ్ఞానమువలన నిర్వేదము తపోనియమమువలన గాని, కలుగునని భరతుడు చెప్పుచున్నాడు. విజ్ఞానము, శ్రుతి, శౌచాచారము, గురుభక్తి అనునవి ధృతికి గల విభా

రము సకలలోక హృదయ సంవాద సుందర ప్రయోజనము
గలిగి యుండుటచే రూపకమున శాంతమునకు ప్రసక్తి లేదు.

ఇతరరసములలోవలె శాంతమున స్థాయి సంచారి భావ
ముల అన్యోన్యసంవలనము కనిపించదు. ఈ సంవలనము
ప్రవృత్తినిష్ఠ మైన దగుటచే శాంతమున కనిపించ జాల దని
భావము. నివృత్తిపర మగు అవస్థ అంతరిక అనుభూతి
యోగ్యము కా జాలదు. కావున ఇతరరసములలో నొక అంగ
ముగానే శాంతము కనిపించ వీలున్న దని చంద్రికాకారుని
వాదము. ఈ వాదమును అనుసరించి, విద్యాధరప్రభుత్వము నంద
గలిగిన జీమూతవాహన చరిత్రలో వీరరస మున్న దనవలెను.
ఇచ్చట అంగముగా శాంత ముండుటచే దయావీర మను వీర
రస భేదము కల దనవలెను. అనుభూత మగు రసమును తద్వి
భావరూప మగు దయావీరత్వములో నభిన్నముగా గ్రహించ
వలసి వచ్చును. విభావమునే రసముగా పరిగణించుట అశా
స్త్రీయ మగుటచే వీరమును పాత్రస్వభావమగు విభావముగానే
గ్రహించవలె నని రసముగా నెంచరా దని తెలియవలెను.
కావున నాగానందమున వీరరస మున్న దనువారు కేవలము
విభావమునే వివరించుచున్నారుగాని. రసమును నిర్వచించుట
లే దని నిశ్చయింపవలెను.

రసప్రతీతిలో వివిధవిషయముల సమన్వయము, ఆత్మ
వికాసము, విశ్రాంతి గలవు. అన్యాపదేశరూపమున చెప్పబడు
కావ్యములలో నీ ఆత్మవికాసమునకు విఘ్నములు కలుగ

గలవు. ఇట్టి గాథలలో వ్యంజనావ్యాపారమే కన్పించగలదు గాని సమగ్రమగు రసచర్వణ కలుగదు. ఒకవేళ కలిగినను అది సంచారిభావరూపముననే ప్రతీతమగును. అన్యాపదేశరూపమున శాంతము నుపదేశింపగోరు కవికూడ కృతకృత్యుడు కాలేడు. శాంతోపదేశము చేయు కావ్యము నవలోకించు నపుడు కావ్యబహిర్భూతములగు నియమములు అవసరము. కాని కావ్యజగమునుండి బయటకువచ్చి లౌకికజగములోని నియమములతో కావ్యమును సమీక్షచేయుచో భావనా వ్యాపారము పరిత్యక్తమగును. తద్ద్వారా రసముకూడ మన అనుభూతికి బాహ్యము కాగలదు. కావున శాంతమును రసమని చెప్పినచో కావ్యజగముననే శాంతము నన్వేషించి, కావ్యలోకమున శాంతమున కే స్వభావము కలదో నిశ్చయింపవలెను.

రూపకము దృశ్యశ్రవ్యాత్మకము. రూపకము రంగమున ప్రదర్శించుటకు యోగ్యమై యుండవలెను. ఈ ప్రదర్శనలో ప్రవృత్తి అతిముఖ్యమైన దగుటచే నివృత్త్యాత్మక మని చెప్పబడు శాంతమున కిచట తావు లేదు. చేష్టావ్యుపరమమగు అవస్థ ప్రయోగయోగ్యము కాదు. రూపకము నవలోకించు సామాజికులు విశిష్ట మగు అనుభూతిని గోరి వచ్చుచున్నారు గాని నివృత్త్యాత్మకము, ఉపదేశయుతము నగు శాంతమును గోరి వచ్చుటలేదు. శృంగారాదిరసములు ద్రుతి, విస్తర, వికాస సంవలిత మగు అనుభూతుల నొసగు చున్నవి.

ఇట్టి అనుభూతి లేకున్నను శాంతమున నాత్మవికాస ముండుటచే శాంతమును రసము కా దనలేము.

నిష్కామము, నివృత్త్యాత్మకము, పారలౌకికపరము నగు శాంతము ప్రయోగయోగ్యము కాని రంగమున అనుభూతి యోగ్యము కా జాలదు. అనాది కాలప్రవాహాయాతము లగు రాగద్వేషముల నుచ్ఛేదించుట అశక్యమగుటచే శాంతప్రతీతి అస్వాభావిక మగును. సర్వజనానుభవ గోచరత్వము కూడ శాంతమునకు లేదు. ఈ హృదయసంవాదములేని శాంతము నకు రసత్వములేదు.

కాని అలోకసామాన్యమగు మహానుభావచిత్తవృత్తిని లేదని ఎట్లనలేమో, అట్లే శాంతప్రతీతి లేదనజాలము. శాంత రసప్రతీతిగల మహాభారతమును కావ్యజగమునుండి వెడల గొట్టలేముకదా! శాంతమున నివృత్తిపూర్వకమగు చిత్త వృత్తియే కలదని యనుట దుష్కరము. పైగా లౌకికజగద్వివరణము, లోకవృత్తసమీక్షకము నగు కావ్యజగమున లౌకిక జీవితములో కన్పించు శాంతము లేదని యనుట సాహసము. కావ్యజగమును ప్రవేశించిన శాంతమున భావనావ్యాపారము రసత్వము కన్పించక తప్పదు. ఇట్టి శాంతము లౌకిక శాంత మునకంటె విలక్షణమగును. భావానాసమున్మిషితమైన రసత్వ మున దేశకాల ప్రమాత్రాద్యుపాధులు నశింపగలవు. ఏవం విధమగు నిష్కామభావనయే శాంతరసమున గలదు, ఇట్టి శాంతప్రతీతి సకలజనానుభవ గోచరము కాదనిన, శృంగారా నుభూతికూడ విరాగులకు లేదని, తద్ద్వారా శృంగారము

రసము కాజాలదని పలుకవలసి వచ్చునని లోచనకారుడు పలికినాడు. సర్వానుగ్రాహకమగు కావ్యజగమున నిష్కామభావనతో సిద్ధమగు శాంత ముండకతప్పదు. సమాధిలోగల యోగప్రత్యక్షమున శాంతమే ప్రధానమని, జీవితహేతుభూతమగునదని తెలియవచ్చుచున్నది. భయానకాది రసములలో తామసప్రకృతులకే రసప్రతీతి కలదు. ఇట్లే తత్త్వజ్ఞాన బీజసంస్కారము గలవారలకు శాంతరసప్రతీతి కలదనవలెను. అధికారిభేదము నాశ్రయించుకొని వచ్చిన హృదయసంవాదమే భిన్నభిన్న రసములను నియంత్రించుచున్నది. కావున శాంతమునకు రసజగమున నేస్థాన మున్నదో విచారింపవలెను. శాంతమును శృంగారాదులవంటి రసముగా స్వీకరింపవలెనా? లేదా?

మన ఆలంకారికు లీ విషయమును వివేచింపలేదు. కాని శాంతముయొక్క స్థాయిభావములను విచారించు సందర్భమున శాంతరసస్వభావమును తెలిసికొనుటకు తగిన విషయమును కొంత ఇచ్చియున్నారు. శాంతము రసమా? కాదా? అను విచారణలతో నున్న ఆలంకారికులు ఏకకంఠముతో నొకే ఒక స్థాయిభావమును శాంతమున కప్పగించలేరని మరువరాదు. ఈ భిన్న స్థాయిభావముల నొకసారి పర్యాలోచన చేసిన శాంత స్వరూప స్వభావములు కొంతవరకు అవగతములు కాగలవు.

**3.** శమమును శాంతరసముయొక్క స్థాయిభావ మని కొంద రనినారు. కాని భరతు డిచ్చిన భావములలో శమము కన్పించకపోవుటచే నిర్వేదమే శాంతస్థాయిభావ మని కొందరు,

శమనిర్వేదములు పర్యాయపదము లని మరికొందరు పలికి నారు. శమ మనగా ప్రవృత్తిరహిత మగు అవస్థ యని గ్రహించి, ఇట్టి శమము రసపరిపోషకము కాజాల దని దశ రూపకకారు డనినాడు. కాని రూపకమున శాంతమునకు స్థానము లేకున్నను రూపకవిలక్షణము లగు కావ్యములలో శాంత ముండ వీ లున్న దని అవలోకకారు డనినాడు. ఐనను శాంతము ప్రవృత్తిశూన్య మగు స్థితి యని, ఇట్టి స్థితి అనిర్వచ నీయ మగు లోకోత్తరాహ్లాదమే కాగలదని, ఈ ఆహ్లాదము కావ్యబహిర్భూత మని యనుచున్నాడు.

సర్వచిత్తవృత్తిప్రశమమే శాంతమునకు స్థాయి యని కొంద రనినట్లు లోచనకారుడు పలుకుచున్నాడు. చిత్తవృత్తి ప్రశమము చిత్తవృత్తి కాజాలదు గనుకను, స్థాయిభావము చిత్తవృత్తి యగుటవలనను ఈ వాదము పరాస్త మగు చున్నది. కాని తృష్ణాక్షయరూప మగు చిత్తవృత్తిగా దీనిని గ్రహించి, ప్రసజ్యప్రతిషేధముగా గాక పర్యుదాసముగా చెప్పినచో నిది శమముకంటె విలక్షణము కాజాలదు. నిర్వి కార చిత్తత్వమే శమమును నిర్వచించునదని రుద్రభట్టుకూడ చెప్పియున్నాడు. సర్వేంద్రియముల ఉపరమ లక్షణముగా శాంతమును ప్రపంచించు ప్రపంచహృదయముకూడ నీ వాద మునే అంగీకరించు చున్నది. కాని సర్వేంద్రియోపరమమున ప్రవృత్తిగాని, చిత్తవృత్తిగాని ఉండ జాలవు. కావున అనుప జాత విశేషాంతర చిత్తవృత్తి రూప మగు స్థాయిభావమును శాంతమున కొందరు కనిపెట్ట గలిగినారు. దీనిని నిర్విశేష

చిత్తవృత్తి యందురు. ఉత్తమము లగు అనుభూతులలో ఇచ్ఛాశక్తికి ప్రాధాన్యము కన్పించదు. ఇచ్ఛాశక్తిద్వారా ఆత్మవికాసమునకు విఘ్నమే కన్పించ గలదు. నిర్విఘ్న స్వసంవేదనాత్మకముగా రసచర్వణ కల దని యనునపుడు ఇచ్ఛాశక్తి అన్యశక్తులతో సంవలితమై సమన్వయము నందు చున్న దని అంగీకరించి యున్నాడు. కావున శాంతప్రతీతిలో తృష్ణాక్షయసుఖ మున్న దని ఆనందవర్ధనుడు పలికినపుడు శాంత మనగా రస మని యర్థము చెప్పికొనవలసి వచ్చు చున్నది. రస శాంతి శబ్దములు పర్యాయపదము లైన ఈ సిద్ధాంతము సమంజస మగును.

తృష్ణాక్షయసుఖ పరిపోషలక్షణము గల శాంతరసమున అహంకారప్రశమము గల దని చెప్పుచు ఇట్టి శాంతము అహంకారపూరిత మగు వీరరసముకంటె అత్యంత విలక్షణ మైన దని ఆనందవర్ధను డనినాడు. అహంకార ప్రశమమునగా దేశ కాల ప్రమాతృ వ్యవధులు నశించగా కలుగు అపరి చ్ఛిన్న మగు ఆత్మానుభూతి యని అర్థము. ఇట్టి శాంతమున నహంకార ప్రశమము కల దని చెప్పిన తృష్ణాక్షయసుఖ మనగా శమమే యని అర్థము చెప్పవలె నని హేమచంద్రు డనుచున్నాడు. ఈ వాదము లన్నియు శమము నాధారము చేసికొని శాంతమును నిర్వచింప యత్నించునవి.

సమ్యగ్ జ్ఞానమును శాంతస్థాయిగా రుద్రటు డంగీక రించినాడు. సమ్యగ్ జ్ఞానమున నిష్కామభావన, సుఖదుఃఖ ముల కతీతమగు స్థితి కలుగగలవు. కాని ఈ శాంతమునకూడ

విభావానుభావ వ్యభిచారి భావసంయోగము కలదని నమి సాధువు చెప్పుచున్నాడు. శబ్దాదివిషయస్వరూపమగు విభావము, జన్మాదికమగు అనుభావములు, శ్వాసాదిసంచారిణులు నిచట గలవని ఇతని అభిప్రాయము. ఇట్టి సమ్యగ్ జ్ఞానము మనలను విషయపరాఙ్ముఖులనుగా చేయును. అట్టిచో సమ్యగ్ జ్ఞానజన్యమగు శమమే శాంతమునకు స్థాయి యగుట యుక్తమేమో అని అనిపించగలదు.

వస్తుతత్త్వాలోచనాదికము లగు ఉద్దీపన విభావములు స్మృత్యాది వ్యభిచారిభావములు కలిగి ధృతిస్థాయిభావాత్మకమైనది శాంతమని సరస్వతీకంఠాభరణకారుని వాదము. ఈ ధృతియొక్క విశిష్టభావమె శమ మని కూడ చెప్పుచున్నాడు. మన మింతవరకు విచారించిన వాదములకంటె అధికమైన విషయ మిచట లభించుటలేదు. శమ మను రూపముతో ధృతి కన్పించు ననినచో శమమునే స్థాయిగా చెప్పవచ్చును ఇట్టి తత్త్వజ్ఞానమును మతియొక్క విశిష్టరూప మనుచున్నాడు. శృంగారప్రకాశలో స్పష్టముగా శాంతరసస్థాయి శమ మని చెప్పబడినది.

ఉద్విగ్నచేతస్కులకు నాట్యము ధృతిని కలుగజేయు నని మొదట అధ్యాయములో భరతుడు చెప్పియున్నాడు. కావ్యజగమునగల రసచర్వణలో ఉద్విగ్నమానసము పోయి విశ్రాంతి చేకూరు నని భావము. శౌర్యము, విజ్ఞానము, శ్రుతి, విభవము, శౌచము, ఆచారము, గురుభక్తి, అధిక మనోరథార్థలాభము, క్రీడ మొదలగునవి ధృతిని ఉత్పన్నము

చేయునవని భరతుడు పలికియున్నాడు. వీటిద్వారా మనస్సుపరిష్కృతమై, ఆత్మ నిర్మల మగును. ఇట్టి విశదీభూతమగు అవస్థను ధృతి యందురు. ఈ విశదీభావము ప్రతిసహృదయుని యందును కన్పించగలదు. కావున ధృతినిస్వీకరించు శాంతము ప్రతిరసానుభూతియందు కలదని చెప్పవలెను.

4. కోరికలు నశించగా కలుగు విశ్రాంతి లక్షణమగు అనుభూతిగా శాంతమును స్వీకరించిన వాదములను విచారించితిమి. కోరికలు నశించిన నిరాశ, దైన్యము మొదలగునవి సంభవించు నవకాశ మున్నది. కాని ఇచ్చట ఇచ్ఛాశక్తిసంతృప్తమై, ప్రశమితమై యుండును. వాసనారూపమున నుండు సంస్కారములు చక్కగా నియంత్రితములు కానంతవరకు ఇచ్ఛాప్రశమనము కుదురదు.

"తస్య ప్రశాంతవాహితా సంస్కారాత్"

"తచ్ఛిద్రేషు ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః"

అని యోగదర్శనము చెప్పుచున్నది. సంస్కారములు ప్రశమితము లైనచో ఆత్మశాంతి కలుగును. సంస్కారములు నిరుద్ధములైన చిత్తము ప్రశాంతమై విక్షేపశక్తిరహిత మగును. చిత్తవిక్షేపరాహిత్యమగు స్థితి ఉత్తమములగు అనుభూతుల కతిప్రధాన మైనది. ఈస్థితియే సమాధికి యోగ్యమైనది. స్వార్థములగు భావములు, సంవేదనములు ఈస్థితిలో కన్పించజాలవు. స్వార్థరహితమగు చర్వణలో ఆత్మ ఉపాధిరహిత మగును. రూపముద్వారా ఉపహిత మగుచున్నను కావ్యజగము నిరుపహితమగు అనుభూతి నీయ గల్గుచున్నది. ఈ

నిరుపహితమగు అనుభూతిని శాంతమని కావ్యజగమున వ్యవ హరించు చున్నాము. నాట్యమునగూడ లోకోత్తర పరమ పురుషార్థ సూచన కన్పించుటచే నాట్యము శాంతరసోపక్షేప మని భట్టనాయకుడు వచించినాడు. విక్షిప్తమగు చిత్తమును ఉత్తమమార్గమునకు తీసికొనిపోవునది కావ్యము. సంస్కృత మైన చిత్తము ఆత్మగానే భాసించగలదు. ఈసంస్కృతి కావ్యమందుపహితమైన రసము నాశ్రయించుకొని వచ్చు నది. కావున రసచర్వణ వేరు, పురుషార్థప్రాప్తి వేరు, అని ప్రపంచించుట ప్రామాదికము.

కావ్యజగమున సంప్రాప్త మగు పురుషార్థము కావ్య మునకు బహిర్భూతము కాజాలదు. కావ్యాంతర్గతమై వస్తుతః అనుపహితమై యున్న లోకోత్తర మగు జ్ఞానము నభివ్యక్తము చేయునది పురుషార్థమని పిలువబడు చున్నది. ఇట్టి పురుషార్థ ప్రాప్తిలో ఆత్మానాత్మ లభిన్నములను ప్రతీతి కలుగును. ఏవంవిధ మగు స్థితిని అనిర్వాచనీయ మనక తప్పదు గనుక శాంత మని పిలుచు చున్నాము. అనిర్వచనీయ మైనను శాం తము నివృత్త్యాత్మకము కాజాలదు. ఆధ్యాత్మిక మగు అను భూతులలో సహితము చిత్తవృత్తులు నివృత్తము లగుటలేదు. ప్రతి ఉత్తమ అనుభూతియు విశిష్ట మైనది. ఇందు విశిష్ట చిత్తవృత్తి విశిష్టప్రయోజనము కలవు. ఈ వైశిష్ట్యము భావ నానుప్రాణిత మైనచో రసానుభూతి వచ్చును. కావున మోక్షాభి ధాన పరమ పురుషార్థోచిత మగు చిత్తవృత్తి గల శాంతము నకు రసత్వము సిద్ధించి తీరవలె నని అభినవగుప్తు డనినాడు.

ఇట్టి శాంతము మిగిలిన రత్యాది భావములకు ప్రకృతి. రత్యాదులు శాంతముయొక్క వికృతులు, ప్రకృతినుండి ఉత్పన్నమైన వికృతి చివరకు ప్రకృతియందే లీన మగుటచే రత్యాది భావములు శాంతమున పర్యవసితము లగు చున్నవి. ఈ పర్యవసితత్వము లేనిచో, రత్యాదులకు భావశబ్దవ్యపదేశ్యత్వ ముండజాలదు. సుఖదుఃఖములు, ధర్మాధర్మములు మొదలగు వానిలో కన్పించు అన్యోన్యాభావ మీశాంతమున కన్పించదు. బుద్ధీంద్రియములు, కర్మేంద్రియములు సన్నిరుద్ధములై ఆత్మసంస్థితములై ఉండగా కలుగు సర్వప్రాణిసుఖహితమగు స్థితిని శాంత మనవలెనని భరతుడు చెప్పియున్నాడు.

శాంతము రసమైన శాంతానుభూతిలో చిత్తవృత్తులు నిరుద్ధములు కాజాలవు. ఇట్టి అనుభూతి మహాభారతమున మనకు గలదు. మహాభారతమున రసచర్వణ, ధర్మభావన అను రెండును అన్యోన్యసంవలితములై, అభిన్నములుగా ప్రతీయమానము లగుచున్నవి. మహాభారతయుద్ధ మెవరికిని ఉపకరించ లేదనుట సత్యమే. ప్రధానపాత్ర లందగు ఆధ్యాత్మికమగు ధర్మముపైకి కత్తి దూసినవా రగుటచే ఉభయపక్షములకు నీ యుద్ధమున దైన్యమే ఫలించినదని మహాభారతమున ధ్వనించుచున్నది. ఈ వ్యంజనావ్యాపారవశమున మనకు నిరపేక్షభావనగల అనుభూతి కలుగుచున్నది. ప్రధాన పాత్రలలో గూడ నిష్కామప్రవృత్తి, నిరపేక్షబుద్ధి కొంతవరకు గలవు. ఎవరి కేరీతిగా జగము ప్రతీయమాన మగుచున్నదో ఆ ప్రతీతి

యంతయు అవసానవిరసము, అవిద్యాప్రపంచరూపము నగు చున్నది. మోక్షలక్షణ పరమపురుషార్థమును దార్శనికు లంగీకరించినట్లు, మహాభారతమున అంగిగా కనబడు తృష్ణాక్షయ సుఖ పరిపోష లక్షణ మగు శాంతరసమును కావ్యజగమున స్వీకరింపవలెను. మోక్షానుభూతి ఆస్వాద్యయోగ్యమై కావ్య జగమున కన్పించగా శాంతరస మనబడుచున్న దని లోచన కారు డనుచున్నాడు. ఇట్టి శాంతరసమును శృంగారాదుల వంటి రసముగా గ్రహించుటచే సమీక్షకులు అపమార్గమును త్రొక్కి వాద వివాదగ్రస్తులైనారు.

**5.** శృంగారాదులగు ఎనిమిది రసములలో నేదేని ఒక రసముయొక్క రూపాంతరమే శాంతమని కొందరనినారు. నాగానందములో కన్పించు జీమూతవాహనునియందు శాంత రసత్వము సిద్ధించుచున్నదని దయావీరత్వము కలదని అనుచున్నారు. కాని వీరరసమున ఉత్సాహము అహంకారోత్కర్షను పోషించునది. ఈ అహంకారము శాంతరసాస్వాదమునకు శల్యభూతమైనది. శాంతమున నిరహంకారరూపత్వము లేకపోవుటచే శాంతము దయారసమున అంతర్భూతము కాజాలదని విశ్వనాథు డనినాడు. రసచర్వణలో కన్పించు అహంకార ప్రశమనము, దేశకాలాద్యుపాధిభంగము అనునవి శాంతమున కూడ కలవు. శృంగారాదిరసము లీ అహంకార ప్రశమావస్థయందు పర్యవసితములై రసత్వమును పొందుటచే దయావీరాదు లన్నియు శాంతమున అంతర్భూతము లగుచున్న వని చెప్పవలెనని విశ్వనాథుని అభిప్రాయము. శాంతమున దయా

వీర మొక అంగము. శాంతముయొక్క ఒకానొక రూపాంతరమున కుపలక్షక మైనది దయావీరము. ఇట్లు శృంగారాది రసములు, రత్యాది స్థాయిభావములు, సాత్త్వికాద్యనుభావములు, సంచారిభావములు, విభావములు అనున వన్నియు శాంతమున కన్పించు వివిధములగు అంగములని సిద్ధమగుచున్నది.

పైగా వీరరసమునకు చెప్పబడు స్థాయిభావ మగు ఉత్సాహము ప్రతిరసానుభూతిలోను సంచారిభావానుగతమై, భావనాసంవలితమై కన్పించుటచే వీరరసమునకు రసత్వము లేదని చెప్పవలెను. అన్ని రసములలోను యత్కించిత్ గా ఉత్సాహానుభూతి యుండుటచే వీరమన్యరసములలోని అంగమే కాగలదు. వీర శాంతము లభిన్నములని చెప్ప గల్గినచో వీర రౌద్రములు కూడ నేల అభిన్నములు కావో చెప్పవలసి యున్నదని ఆనందవర్ధనుడు ప్రశ్నించి యున్నాడు. వీర భీభత్సాదులలో శాంత మంతర్భూత మగునని కొంద రనినారని అవలోక కారుడు చెప్పు వాదముకూడ అశాస్త్రీయమే అగుచున్నది.

కొందరు శాంతముయొక్క స్థాయి ఉత్సాహ మనినారు. కాని ఈఉత్సాహము వీరప్రభవమైనచో వీర శాంతము లభిన్నములు కావలెను. అట్లుగాక ఈ ఉత్సాహము దయావీర మనబడు శాంతమును పోషించునదనినచో, దయావీరము నాయకస్వభావమును నిర్వచించునదని, రసపరమగు శబ్దము

కాదని మనవరాదు. పైగా దయావీరము శాంతమే కాగలదు. కాని వీరము కాజాలదు కావున దయావీరము శాంతమునకు పర్యాయవాచకమని లోచనకారు డనినాడు.

శాంతమున, శృంగారాదుల యందు కొంతవరకు ఉత్సాహప్రతీతి గలదు. కాని ఒకే ఒక స్థాయిభావమునుండి భిన్నరసములు రాగలవా ? ఒకే ఒక కారణమునకు భిన్నములగు కార్యము లుండవని, ఒకే ఒక కార్యమునకు వివిధములగు కారణములు లేవని దార్శనికులు నిర్ణయించినారు. ఉత్సాహమునుండి వచ్చు వీరమున అభిమానము కలదని, శాంతిమున అహంకారప్రశమ మున్నదని ఆనందవర్ధను డనినాడు. శాంతమున కన్పించు ఉత్సాహము వీరమునగల ఉత్సాహము కంటె విలక్షణమైనది. దయావీరమును శాంతరసముగా చెప్పువారు, ధర్మవీరముకూడ శాంతరసమే కాగలదని విస్మరించరాదు.

వీరత్వము వ్యక్తిస్వభావనిష్ఠము, రసనిష్ఠముకూడ కావచ్చును. రసనిష్ఠ మైనచో స్వయంసిద్ధము, స్వయంగ్రాహ్యము, స్వయంపోషకము నగుచు, అన్యాపేక్షగాని అన్యాశ్రయముగాని లేనిది కావలెను. కాని వ్యక్తిస్వభావము ప్రవృత్తినిష్ఠము, ప్రవృత్తిస్వభావనిష్ఠము నగుటచే వ్యక్తిస్వభావమగు వీరత్వమున అన్యాపేక్ష, అన్యాశ్రయము, కన్పించగలవు. దయావీరత్వము వ్యక్తిస్వభావనిష్ఠము. శాంతము రసనిష్ఠము. ఉత్తమ వీరరసమున అహంకారప్రశమ

నము కలదనిన, ఈప్రశమనము తత్త్వజ్ఞానజన్యమని, తత్త్వజ్ఞానము శాంతానుభూతిలోని దని తెలియవలెను. వీరము శాంతానుప్రాణితమైన రసము కాగల అవకాశము కుదుర గలదు.

జుగుప్సను శాంతస్థాయిభావముగా కొందరంగీకరించి యున్నారు. ద్వేషము, అసహ్యము, నిరసనభావము, రోయుట మొదలగునవి జుగుప్సలో కలవు. మోక్షము నుద్దేశించు శాంతమున లౌకికవిషయములపై జుగుప్స కలదు. ఈ జుగుప్స ఉన్ననే వ్యక్తి విరాగి కాగలడు. జుగుప్సనుండి బయలుదేరు శుద్ధమగు భీభత్సమున భౌతికవాంఛలపై అసహ్యము, నిర పేక్షబుద్ధి వైరాగ్యప్రవృత్తి కలవు. సందేహము లాత్మను బాధించునపుడు జుగుప్సితము లగు విషయములను భావించుమని. సుఖములను నసహ్యించుమని యోగసూత్రము చెప్పు చున్నది. "వితర్కబాధనే ప్రతిపక్ష భావనం" అని యోగ సూత్రము.

విరాగియొక్క ప్రవృత్తిని మనము గమనించునపుడు భౌతికవిషయములపై విరాగికి జుగుప్స కలదని మన మెంచుట సహజమే. కాని విరాగియొక్క అనుభూతిలో జుగుప్స కలదా? జుగుప్సను ప్రధానచిత్తవృత్తిగా నుంచుకొనిన ఆత్మవిశ్రాంతి కలుగుట దుర్లభము. ప్రధానముగా గల జుగుప్స రాగద్వేషా దులను పోషించునదేగాని ఉపశమింపజేయునది గాదు. పైగా విరాగియొక్క లక్ష్యమురాగద్వేషాది రహితమగు స్థితి యగు

టచే జుగుప్స నివృత్తము కాక తప్పదు. ఇట్లు నివృత్తమగు జుగుప్స సంచారిభావమే యగునని అభినవగుప్తు డనినాడు. విప్రలంభమున ఔత్సుక్యము రౌద్రమున ఔగ్ర్యము, కరుణలో నిర్వేదము, వీరమున ధృతి, భయానకమున త్రాసము, అద్భుతమున హర్షము, శాంతమున జుగుప్స వ్యభిచారిభావములు కాగలవు. వీటిని స్థాయిభావములని గ్రహించరాదు.

నిర్విఘ్న స్వసంవేదనాత్మక విశ్రాంతి లక్షణముగా రసచర్వణను వెనుక ప్రపంచించితిమి. ఇచట కలుగు ఆత్మవికాసమున దేశకాల ప్రమాతృత్వాదికము లగు ఉపాధులు లేవని చెప్పితిమి. హృదయసంవాదవశమున రసాస్వాదములో వివిధ విషయములు సంవలితములై సమన్వయము నందుచున్నవనినాము. ఇట్టి హృదయసంవాదము గల వ్యక్తిని సహృదయుడని, పండితుడని అందుము. బ్రాహ్మణుడు, గోవు, ఏనుగు, కుక్క మొదలగువాటియందు సమదృష్టి గలవాడే పండితుడని గీత చెప్పుచున్నది. ఈ సమదృష్టి కలుగనంతవరకు ద్వేషముతో కూడిన జుగుప్స కన్పడగలదు. పైగా శాంతమున జుగుప్స వ్యభిచారిభావమై విషయపరాఙ్ముఖముగా కన్పించగలదు. కాని శాంతమున ఆత్మరతి ప్రధానముగా చూపట్టుచున్నది.

రసప్రతీతిలో ఆత్మరతి కెట్టి స్థానమున్నది? అనుభూతులను పొందుట ఆత్మయొక్క స్వభావముగా కన్పడుట గలదు. ఆత్మయొక్క శక్తి (స్వభావము) అనుభవించుట అనవచ్చును.

అనుభూతిని తనకొరకై తానే వాంఛించునది ఆత్మ. కావున అనాహతానందమయ స్వాత్మవిషయకమగు రతియే మోక్ష సాధనమని, ఇట్టి ఆత్మరతియే శాంతముయొక్క స్థాయిభావ మని చెప్పుచున్నారు. ఆత్మయే ప్రమాత, ఆత్మయే ప్రమే యము కాగా, ఆత్మావలోకనమున లేక ఆత్మానుభూతియందు విశ్రాంతిలక్షణమగు పరమసుఖప్రాప్తి యున్నదనినచో, ఈ అనుభూతి ఆత్మకంటె భిన్నము కాజాలదు. ఈ అనుభూతి ప్రవృత్తిజనకముకూడ కాలేదు. కావున—

"య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే."

అని గీత చెప్పుచున్నది. ఈ అనుభూతిలో సర్వభూత ములు ఆత్మయందున్నట్లు, ఆత్మ సర్వభూతములలో నున్నట్లు ప్రతీతి గలదు. బాహ్యజగమును పూర్తిగా అవగాహన చేసి కొనినపుడే ఆత్మరతి అర్థవంతము, భావగర్భితము కాగలదు. నిజమైన ఆత్మరతిలో రతిస్థాయిభావముగాక ప్రమాతృ ప్రమేయానన్యత్వము కలదు. ఈ అనన్యత్వము రసచర్చలో నతివిశిష్టమైనదని చెప్పియున్నాము.

హాస, శోక, క్రోధ, భయ, విస్మయములలో నేదైన నొకటి శాంతమునకు స్థాయి కాగలదని మరికొందరనినారు. మానవుల దైనందిన వ్యవహారములజూచి శోకము, విషయలో లుపత్వముపై కోపము అధర్మభీరుత్వము, జగన్నాట్యమున చిక్కుకొనిన మానవులను జూచి హాసము, ఆధ్యాత్మిక చిత్ర

ములను గాంచి విస్మయము మొదలగు భావములను శాంతా నుభూతిలో పొంద వీలున్నది.

ప్రత్యేకముగాగాని, సమష్టిగాగాని ఈ స్థాయిభావ ములు శాంతపరిపోషకము లని యనినచో వీటి కాయా రసము లలో కన్పించు విభావాదు లచట కన్పించ జాలవు. ఆయా విభావాదులు సంస్కృతములై రా వీలున్నది. ఇట్లు చేయు టలో విభావాదులతో స్థాయిభావమున కతిసన్నిహిత మగు సంబంధము తేదనవలసి వచ్చును. ఇది అశాస్త్రీయము. కాని స్థాయిభావమును ప్రవృత్తిపరముగా గాక, జ్ఞానాకారముగా అంగీకరించితిమేని స్థాయికి భావములతో సన్నిహిత సంబం ధము లేదని చెప్పవీలున్నది.

సంస్కృతములై పరిష్కరింపబడిన స్థాయిభావములకు నిజస్వభావము పోయి నూతన స్వభావము వచ్చుచున్నది. స్థాయిభావములు క్రమక్రమముగా మార్పులను చెందు చున్నవి. పశుపక్ష్యాదులలో కన్పించు స్థాయిభావములను మానవులలో కన్పించు స్థాయిభావములకు విశేషభేదము కలదు. మానవులలో స్థాయిభావములు జ్ఞానపర్యవసితములై జ్ఞానముతో నభిన్నము లైనట్లు కన్పించుచున్నవి. "కొహ్లెర్" మొదలగు శాస్త్రజ్ఞులు కోతులపై పరిశోధనలను సలిపి స్థాయి భావము జ్ఞానానుప్రాణిత మైనదని అప్రబుద్ధమగు జ్ఞానమే స్థాయియని నిశ్చయించి యున్నారు.

శాంతమున అనేక స్థాయిభావము లున్నవని అంటిమేని ప్రతిరసమున ఇట్లే ఉండవచ్చునా? అను సందేహము కలుగక మానదు. అనేక స్థాయిభావములు కన్పించిన వీటిలో నొకటే ప్రధానమైనదని, మిగిలినవి దీని అంగములని చెప్పవలెను. అంగములైన స్థాయిభావములు సంచారిణు లగును. పరిష్కృతములైన స్థాయిభావములు శాంతపరిపోషకము లనునపుడు స్థాయిభావ మనగా చిత్తవృత్తి యని విస్మరించరాదు. విభావ బలమున ఆత్మనుండి బయలుదేరు చిత్తవృత్తులను స్థాయి భావము లనవలెను. ఇట్లు ఆత్మనుండి బయలుదేరుచు సత్త్వ విశిష్ట మగుచున్న స్థాయిభావ మొక్కటే గలదు. దీనిని శమ మందురు. స్థిరమై అవ్యభిచారి యగు శమము సర్వరసముల యందు గలదని శార్ఙ్గదేవు డనినాడు. శృంగారాదులలో నేదేని జనకరస మనుభూత మగునపుడు జన్మాంతరసుకృత విశేష వశమున శమ ముత్పన్న మగుటచే నిట్లు చెప్పబడిన దని కల్లినాథుడు వ్యాఖ్యానించినాడు.

ప్రతి రసచర్వణయందు నిర్విఘ్న ప్రతీతి ఆత్మవికాసము, విశ్రాంతి కలవు, కరుణరసప్రతీతిలో మన ముద్విగ్న మనస్కుల మగుటలేదు. ఇచ్ఛాశక్తి సంతృప్తి నందుచున్నది. ఇట్టి అనుభూతిని ప్రతిరసములోను కలుగజేయ జాలిన సూత్ర మును శమ మనవలెను. ప్రతిరసము శాంతము నంతర్యామిగా గలిగి సజీవమై భావగర్భిత మగుచున్నది. శాంతప్రతీతిలేని రస ప్రతీతిలేదు. రసత్వమున్నకొలది శాంతము ప్రతీతము కాగలదు.

రత్యాది స్థాయిభావము లన్నియు అవిభక్తములుగా శాంతమునకు స్థాయి యగుచున్నవని మరికొంద రనినప్పుడు శృంగారాది రస సముదాయమునకు శాంతమను శబ్దము సామాన్యవాచకమని తేలగలదు. కాని చిత్తవృత్తు లన్నియు ఒకే ఒకసారి రా వీలు లేకపోవుటచేతను, చిత్తవృత్తులలో కొన్నింటికి అన్యోన్యాభావ సంబంధము, అన్యోన్యవైలక్షణ్యము ఉండుటచేతను, ఈ సర్వస్థాయివాదమును నిరాకరించక తప్పదు.

కాని శాంతమున కభినవగుప్తుడు తత్త్వజ్ఞానమును స్థాయిగా చెప్పుచున్నాడు. సమస్త లౌకికాలౌకిక చిత్తవృత్తి కలాప మిచట వ్యభిచారిరూపమున కలదనినాడు. సర్వస్థాయి భావములు వ్యభిచారిభావములై తత్త్వజ్ఞానమును పోషించగా శాంతము సిద్ధమగునని అభినవగుప్తుని వాదము. కొద్దిమార్పు లతో సర్వస్థాయివాదమే పరిగృహీతమగుచున్నది. చైతన్యము ప్రమాతృ ప్రమేయ రూపములుగా పరిచ్ఛిన్నము (ఉపహితము) కాగా, ప్రమాతయందు చైతన్యము కన్పరచు చిత్తవృత్తులే స్థాయిభావములని, వ్యభిచారిభావములని చెప్పబడు చున్నవి. ప్రమాతృప్రమేయములను సమన్వయపరచు శుద్ధ చైతన్యమున నీ భావములన్నియు పర్యవసితము లగుచున్నవి. ఈ పర్యవసితత్వము ఎంతవరకు సమగ్రమగునో, తత్తుల్యమగు పురుషార్థము మనకు కావ్యజగమున కన్పడును. అపుడు రసములు శుద్ధచైతన్యాభివ్యంజకములు, శుద్ధచైతన్యావగతికి త్రోవ జూపునవియు నగును.

6. నాట్యశాస్త్రప్రాచీన వ్రాతప్రతులలో "స్థాయి భావాన్ రసత్వ ముపనేష్యామః" అను పంక్తి యైనతరువాత "శాంతో నామ శమస్థాయిభావాత్మకః" అని మొదలుగా శాంతలక్షణము పఠింపబడినట్లు కలదు. దీని తర్వాత శృంగారాదులలక్షణము లీయబడినవి. సమస్తభావములకు ప్రకృతిభూతమైనది. శమ మని చెప్పుటకిట్లు పఠింపబడిన దని అభినవగుప్తుడు పల్కినాడు.

శమమును స్థాయిభావముగా స్వీకరించితిమేని భావములసంఖ్య ఏబది కాగలదు. భరతుడు నలుబదితొమ్మిది భావములనే నిర్దేశించినాడు. శమముతో ఏబది భావములగుటవలనను శమ శాంతములు పర్యాయపదము లగుటవలనను కొందరీ శమస్థాయిభావము నంగీకరించకపోయినారు. భరతుడు స్థాయిభావము లెన్ని గలవో సంఖ్యానిర్దేశము చేయలేదు. స్థాయిభావములను చెప్పి వెంటనే నిర్వేదము మొదలుగాగల వ్యభిచారి భావములను పఠించినాడు. నిర్వేదశబ్దమునకు మంగళప్రదమగు అర్థము లేదు. ఇట్టి నిర్వేదముతో భావముల నేల పఠించ వలసివచ్చినది? నిర్వేదము రెండు విధములు. తత్త్వజ్ఞానజన్యమగు నిర్వేదము శుభప్రదమైనది. రెండవది అశుభప్రదము. అమంగళభూత మగు అర్థమును సూచించుచున్నను, నిర్వేదము స్థాయిభావముగాను, వ్యభిచారిభావముగాను కలదని ఉభయధర్మ జీవిత్వఖ్యాపనార్థము స్థాయిసంచారిణులమధ్య చెప్పబడినది. కావున తత్త్వజ్ఞానజన్యమగు నిర్వేదము శాంతస్థాయియని వీరివాదము.

శమ శాంతములు పర్యాయపదము లగుటచే శమము స్థాయిభావము కాజాలదనువారు హాస హాస్య శబ్దములుకూడ పర్యాయపదములే యని మరువరాదు. స్థాయిభావములగు శమ హాసములు, సిద్ధములు, లౌకికములు, సాధారణములు. రసము లగు శాంత హాస్యములు సాధ్యములు, అలౌకికములు, అసాధారణములు.

భౌతికవిషయములపై ఔదాసీన్యమును జూపు నిర్వేద మొక్కొక్కచో జుగుప్సగా కన్పడగలదు. మరొకప్పుడు సంతుష్టిగా భాసించగలదు. దారిద్ర్యము, వ్యాధి, అవమానము, క్రోధము, తాడనము, ఇష్టజననాశము, తత్త్వజ్ఞానము మొదలగువానివలన నిర్వేదము కలుగును. ఇచ్చట రెండు భిన్నవిధములుగా నిర్వేదము కన్పించుచున్నది. తత్త్వజ్ఞానోద్భవ మగు నిర్వేదము స్థాయిభావ మని, ఇష్టానిష్ట వియోగాప్తికృత మగు నిర్వేదము వ్యభిచారిభావమని శార్ఙ్గదేవు డనినాడు. స్థాయి యగు నిర్వేదము శాంతమున గలదని మమ్మటాదుల వాదము. ఇచ్చట తత్త్వజ్ఞానోద్భవ మగు నిర్వేద మున్నదనిన ఈ నిర్వేదము స్థాయిభావము కాగలదా? స్థాయిభావ మనగా చిత్తవృత్తి. చిత్తవృత్తిని నియంత్రించునది తత్త్వజ్ఞానము. ఇచ్చటగల నిర్వేదమునకు జ్ఞానాకారము నంగీకరించవలెను. జ్ఞానముగా పరిణమించగల చిత్తవృత్తిని స్థాయి యనవలెను గనుక స్థాయిభావమును జ్ఞానముకంటె నత్యంత విలక్షణమైన దానినిగా చెప్పరాదు. కావున జ్ఞానము వేరు, స్థాయిభావము వేరు అని చెప్పుచు స్థాయిభావమే ప్రకృ

ష్టమైన దని పలుకు "బెర్గ్సన్" వాదము నిరస్త మగు చున్నది.

స్థాయి, జ్ఞానము అనునవి రెండు ప్రవృత్తులని వీటికి అన్యోన్య వైలక్షణ్యము పూర్తిగా కలదని "బెర్గ్సన్" వాదము. వీటికి జన్యజనక భావము గాని, ప్రాక్పశ్చాదవస్థా రూప సంబంధముగాని ఉండజాలదు. కాని "క్లాప్రెర్", "కాఫ్కా", "వెర్తిమర్" మొదలగు శాస్త్రజ్ఞుల పరిశోధన లలో స్థాయిభావము జ్ఞానానుప్రాణిత మైనదని, సమభివ్యక్తము గాని జ్ఞానమే స్థాయిభావమని నిశ్చితమైనది. కావుననే స్థాయి భావమును చిత్తవృత్తియని భారతీయాలంకారికులు చెప్పు చున్నారు. చిత్తవృత్తి జ్ఞానముకంటె విలక్షణ మైనది కాజా లదు. జ్ఞానశూన్యమగు చిత్తవృత్తికి ప్రవృత్తిగాని, అర్థము గాని, ప్రయోజనముగాని ఉండదు.

నిర్వేదము స్థాయిభావ మని, వ్యభిచారభావ మని, జ్ఞానాకార మని కూడ చెప్ప గలుగు చున్నాము. ఆయా సందర్భముల ననుసరించి నిర్వేదమున కీ లక్షణములు వర్తించ గలవు. బాహ్యజగమునుండి మరలిపోవుచున్న వ్యక్తియొక్క నివృత్త్యాత్మక మగు భావముగా నిర్వేదమును గ్రహించితి మేని, ఈ నిర్వేదమున హృదయసంవాదము మాటుపడ గలదు. హృదయసంవాదము లేని చిత్తమును అద్రుతచిత్త మందురు. అద్రుతచిత్తము రసప్రతీతికి విఘ్నము కలిగించునది. ద్రుతచిత్త మున్నచో ప్రమాతృప్రమేయముల కభేదప్రతిపత్తి ఆవరణభంగము కలుగగలవు. సంచార్యాది భావములద్వారా

చిత్తమునకు ద్రవావస్థ కలుగును. వస్తువు స్వాకారమును ద్రుతచిత్తమున నుంచుచున్నట్లు కన్పించును. పరిచ్ఛిన్నము లైనను ఆత్మానాత్మలకు చైతన్యరూపమున నభేదము ప్రతీత మగుచున్నదని భావము. ఈ ప్రతీతిలో బాహ్యజగము ప్రమాత్రభిన్నముగా గలదు. మనకు చిరపరిచితమైన మృదుకరతల స్పర్శ కాలాంతరమున ప్రతీతమైన నెట్టి అనుభూతి కలుగునో అట్టి అనుభూతియే ఇచట గలదు. ఏవంవిధ మగు ఆధ్యాత్మికానుభూతి శాంతమున సిద్ధ మగుటచే శాంతమును రసపర్యాయముగా వ్యవహరించ గలుగుచున్నాము.

సర్వానుగ్రాహకము, స్వయంసిద్ధము, సాక్షిభాస్యము నగు చైతన్యావగతిలో ఇచ్ఛాశక్తి నివృత్త మగును. ఇచ్ఛాశక్తిరహితమగు ప్రతీతిలో జ్ఞానావగతి యుండుటచే రస మనగా జ్ఞానమని చెప్పుచున్నాము. ఇట్టి రసమును శమ మని నిర్వేద మని తత్త్వజ్ఞాన మని కూడ వ్యవహరించ వచ్చును. ఈ రసావగతిలో స్వలక్షణములుగా విషయములు భాసించక, ఉపహితములగు జ్ఞానములుగా ప్రతీయమానము లగుచున్నవి. తద్ద్వారా రసజగమున గల ప్రమేయము స్వతంత్రము, అన్యాపేక్షారహితము, స్వయంసిద్ధము, సమగ్రము నగుచున్నది. భావనావ్యాపారము సమున్మిషితమై తీవ్రరూపమును ధరించగా సంవేదనముల మనోహృదయముల నేకము చేయగా బాహ్యజగ మాత్మలో లీనమైనట్లు భాసించగా అద్వితీయ మగు ప్రత్యగాత్మప్రతీతి కలుగును. ఈ ప్రతీతికి కావ్యజగమున నభివ్యంజక మైనది రస మనబడు శాంతము. ఇచట వ్యక్తిగత

మగు ఆత్మ ఉపాధ్యతీత మగుచున్నది. కావున తత్త్వజ్ఞాన జన్యమగు నిర్వేదము రత్యాదిస్థాయిభావముల కుపమర్దకమై భావవైచిత్ర్యసహిష్ణువులగు రత్యాదులకంటె ఉత్కృష్టమగు స్థాయిస్వభావముకలదై శాంతమున ప్రతీత మగును. స్థాయి యనగా ఇట్టి నిర్వేదమేగాని, వేరొండు కాజాలదు. రత్యాదు లీ స్థాయిభావముయొక్క వివరములు.

తత్త్వజ్ఞానము, నిష్కామకర్మ, నిదిధ్యాసనము, భావన మొదలగువానిద్వారా నిర్వేద ముత్పన్న మగునని చెప్పితిమి. ఒకానొక అనుభూతివలన కలుగు ఫలితము నిర్వేద మని తాత్పర్యము. కాని శాంతమున కున్న స్థాయిభావమును విచారించు సదర్భమున ఫలావస్థను వివేచించుట తగదు. ఐనను నిర్వేదమును ఒకింత విచారించి చూడవలసి యున్నది.

తత్త్వజ్ఞానమువలన నిర్వేద ముత్పన్న మగుచున్నదను వాదమును పరిశీలించుచున్నాము. తత్త్వజ్ఞానమునుండి కలుగు ఫలితమేమి ?

> "దుఃఖ జన్మ ప్రవృత్తి దోష మిథ్యాజ్ఞానానా ముత్త
> రోత్తరాపాయే తదనంతరాపాయా దపవర్గః"

అని న్యాయదర్శనము చెప్పుచున్నది. మిథ్యాజ్ఞానము నశించగా దోషములు, దోషములు పోగా ప్రవృత్తి, ప్రవృత్తి నశించగా జన్మ, జన్మలేనిచో దుఃఖము నశించుచున్నవి. తత్త్వ జ్ఞానము కలుగగా మిథ్యాజ్ఞానము నశించును. ఈ మిథ్యాజ్ఞాన నాశమున దోషవినాశమే కలదుగాని, నిర్వేదప్రాప్తి కాదు. శోకప్రవాహ ప్రసర రూపమగు చిత్తవృత్తివిశేషము నిర్వే

నము. తత్త్వజ్ఞానము వైరాగ్యమును తెచ్చునది. రాగద్వేషా
దుల ప్రధ్వంసయే వైరాగ్యము. కావున నిర్వేద తత్త్వజ్ఞాన
ములకు జన్య జనక సంబంధము కలదని చెప్పుట అశాస్త్రీయము.
పైగా నిర్వేదమునుండి కొన్ని అనుభూతులు బయలుదేరుటయే
గాక, కొన్ని అనుభూతులు నిర్వేదమున పర్యవసితము లగు
చున్నవని మరువరాదు.

7. తత్త్వజ్ఞానము, నిష్కామకర్మ, నిరపేక్షబుద్ధి,
శౌచము మొదలగునవి శాంతమున కన్పించు విభావము లని
భరతు డనుచున్నాడు. ఈ విభావముల ననుసరించి యమ
నియమాదులు వచ్చును. ఇవన్నియు శాంతానుభూతిలో
కన్పించు విశిష్టము లగు సన్నివేశము లని తెలియవలెను.
ఇచట చెప్పబడిన విభావములకు విభావత్వము లేదు. శాంత
మున కన్పించు కొన్ని ప్రధానములగు అంశములనే విభావము
లనుటచే, "విభావాద్యప్రతిపాదనం తస్య పరమపురుషార్థ
తయా లోకయాత్రాతిక్రాంతత్వాత్" అని భట్టగోపాలు
డనినాడు. శృంగారాదులవంటి రసము కాకపోవుటచేతను,
శాంతము అలౌకిక మగుటచేతను, శాంతమునకు విశిష్టముగా
విభావములను భరతుడు పేర్కొనలేదు.

ఏవంవిధమగు శాంతమున చెప్పబడిన విభావములం
బుద్ధీంద్రియ కర్మేంద్రియములకు సంబంధించిన యమ నియ
మాదులకు చెందినవగుటచే, శాంతము బాహ్యవిభావములచే
పోషింపబడునది కాదని స్పష్టము. ఆంతరమగు స్థితియొక్క
పరిపోషమే శాంతము. తత్త్వజ్ఞానము శాంతమున ముఖ్యమైన,

శాంతము ఆధ్యాత్మికమైన, శాంతమున ఆత్మ, తత్త్వజ్ఞానము అను రెండును ప్రాణభూతములై కలవని చెప్పవలెను. తత్త్వజ్ఞానమే మోక్షసాధన మగుటచే మోక్షవిషయకమగు శాంతమున తత్త్వజ్ఞానమును స్థాయిగా చెప్పుచున్నాము. తత్త్వజ్ఞానమనగా ఆత్మజ్ఞానమని అర్థము. పరికల్పిత విషయోపభోగరహితము, జ్ఞానానందాది విశుద్ధ ధర్మయోగి యగు ఆత్మయే శాంతమునగల స్థాయియని అభినవగుప్తుడు నిశ్చయించినాడు. ఆత్మావగతియే రసచర్వణయని శాంతప్రతీతి యని కావ్యజగమున పిలువబడుచున్నది.

తత్త్వజ్ఞానజన్యము నిర్వేద మని చెప్పునపుడు తత్త్వజ్ఞానమే ప్రధాన మైన దని అందుచే స్థాయి యగుచున్న దని చెప్పవలెను. వస్తుతః నిర్వేదము తత్త్వజ్ఞానమున కుపకరించునది మాత్రమే యని తెలియవలెను. తత్త్వమును తెలిపికొని నిర్వేదము నందుట, నిర్వేదమునుండి మోక్షమును పొందుట మన అనుభవమున కన్పించదు. కాని నిర్వేదము కలుగుటచే తత్త్వమును తెలసికొనవలె నని యత్నించుచున్నాము. తత్త్వము ఆత్మకంటె, చైతన్యముకంటె, విలక్షణమైనదికాదు. చైతన్యమునకు బహిర్భూత మైనదానికి అస్తిత్వము లేదు.

తత్త్వము పురుషవ్యాపారనిష్ఠము కాదు. వస్తువులను అర్థవంతముగా భాసింపజేయున దగుటచే వస్తువులయం దుపహితముగా ప్రతీత మగునది తత్త్వము. ఉపహితమై, విషయముల నర్థవంతము చేయుజాలి, విశ్రాంతిలక్షణము కలిగినది

ఆత్మ యగుటచే తత్త్వజ్ఞానమున కాత్మజ్ఞాన మను నర్థమును చెప్పితిమి. ఆత్మజ్ఞానమున జ్ఞానమునకు ప్రమేయముగా ఆత్మ కలదు. తెలిసికొనవలసిన విషయము ఆత్మ. ఈవిషయమును తెలిసికొనునదికూడ ఆత్మయే.తనను తానే అనాత్మగా భావించు ఆత్మ ఇచట గలదు. కాని అనాత్మ యనగా జడపదార్థము కాదు. జడపదార్థములు సహితము ఆత్మ నంతర్యామిగా కలిగి యుండి అనాత్మగా కన్పించుచున్నవి. కాని జగమున ప్రాణ భూతముగా నున్న ఆత్మను (చైతన్యమును) తెలిసికొనవలె ననిన ఆవరణభంగము కలుగవలెను. ఇట్టి ఆవరణభంగమే రస చర్వణలో కల దని వెనుక చెప్పితిమి. కావున రస మనగా శాంత మను అర్థము వచ్చుచున్నది. ఈ శాంతము నిరుప హితము, విశ్వజనీనము, సర్వానుగ్రాహకము, సర్వవిషయము లందు కల అనువృత్తప్రత్యయము నగుచున్నది.

సకల చిత్తవృత్తులు, భావములు ఈ ఆత్మ నాశ్రయించు కొని వచ్చునవి. స్థాయిరూపమగు ఆత్మ నాశ్రయించుకొనిన చిత్తవృత్తులను కూడ స్థాయిభావము లనుచున్నాము. ఈ స్థాయిభావములు వ్యభిచారిభావములవలె భాసించుచు ఆత్మాను భూతికి మార్గము చూపుచున్నవి. రత్యాది స్థాయిభావములను అభివ్యక్తపరుపజాలిన ఆత్మస్వభావము శమముగా కన్పించుట చేతను, ఆ స్థాయిభావములకు విశ్రాంతిస్థాన మగుటచేతను, శమమునుగాని ఆత్మనుగాని ఏబదవ భావముగా లెక్కింప నక్కర లేదు. రత్యాదులవలె ఈ శమమునకు (ఆత్మకు) పృథగా

స్వాదను లేదు. పైగా స్థాయిభావములు వ్యభిచారిభావము లగునట్లు, ఈ ఆత్మ వ్యభిచారిభావము కాజాలదు.

ఆత్మస్వరూపమగు తత్త్వజ్ఞానము శమము. కాలుష్యో పరాగ విశేషములుగా రత్యాదులు గలవు. కాని శమమున ఆత్మస్వభావము ప్రశాంతముగా నుండును. విశ్రాంతిలక్షణ మగు శమము యమనియమాదులద్వారా ప్రతీతమగుచున్నది. ఈవిధమగు ఆత్మావగతిని అనిర్వచనీయముగా నిర్వచించి కావ్యజగమునుండి త్రోసివేయుట అనుచితము. మోక్షావస్థ యందే ఆత్మస్వరూపాపత్తి లక్షణ ప్రాదుర్భావ ముండుట వలన, ఇట్టి అవస్థను శాంత మనుటవలన, శాంతముయొక్క స్వరూపము అనిర్వచనీయ మగుచున్నదని ధనికుడనుట ప్రామాదికము. శాంతముయొక్క స్వరూప స్వభావములను ఉపహితవిషయముల నుద్దేశించి బయలుదేరిన భాషతో సమగ్రముగా ప్రపంచించుట దుష్కరమగుటచే శాంతమును అనిర్వచనీయ మనవచ్చును. భావశూన్య మగుటచే శాంత మనిర్వచనీయ మగుటలేదు. శాంతమున అద్వితీయము, అపరి చ్ఛిన్నము నగు భావము కలదని అనుభూతిలో సంవేద్య మగుచున్నది.

శాంతమున రత్యాదులు వ్యభిచారిభావములవలె ప్రతీ తము లగుటచే, తదాధారభూత మగు అనువృత్తప్రత్యయమును సూచించ గలుగుచున్నవి. శృంగారాది రసములు మండల మున గల ఎనిమిది దేవతలవలె నుండగలవు. ఈ దేవతల

కాధారము, భూతము, చైతన్యము నగు దేవదేవునివలె శాంతము మండలమధ్యగత బిందువువలె నుండు నని శివాద్వయాగమము చెప్పుచున్నది. బాహ్యపిండము చైతన్యమున లీన మైనను, చైతన్యమున మార్పు రానట్లు, శృంగారాదులు శాంతమున రత్యాదులు శమమున లీన మగుచున్నవి. ఆత్మ స్వభావమగు ఈ శమ మొక్కటే స్థాయిభావము. ఈవిధమగు శమము (శాంతము) నిరుపహితము. కాని లలితకళలు ఉపహిత స్వరూపములను జూపున వగుటచే అనుపహితతత్త్వమును ధ్వనింపజేయగల్గిన సామర్థ్యము కావ్యజగమున కలదు. శృంగారాది రసములు వీటికి వివర్తోపాదన మగు శాంతరసమును ధ్వనింపజేయ గల్గుచు రసము లగుచున్నవి.

శృంగార హాస్యాది రూపములలో ఆత్మజ్ఞానము కావ్యజగమున ననుభూతమగుచున్నది. కాని ఆత్మజ్ఞానము ఆత్మావగతియందే సమగ్రముగా కల్గును. కావున ఆత్మకు స్థాయిత్వమే కలదన గల్గుచున్నాము. ఈ స్థాయిత్వము ప్రతి అనుభూతిలోను శమమను రూపమున కన్పించుచున్నది. ఈ ప్రతీతిలో ఆత్మ ప్రమేయమువలె భాసించును. ప్రమేయము కాకున్నను ప్రమేయమువలె భాసించుచున్నదను జ్ఞానము కలుగగానే మనకు ప్రమేయ మవగతము కాలేదని, ప్రమేయమున్నదా? లేదా? అను సందేహము కల్గును. ఇట్టి స్థితిలో కలుగు వితర్కబాధ వలన కావ్యానుభూతి కతీతమగు అపరోక్షానుభూతి కలదను భావము మన కుదయించగా, ఏవంవిధ మగు అనుభూతినే

కోరుచు ఆధ్యాత్మికజగమును ప్రవేశించుచున్నాము. శమము ద్వారా ఆధ్యాత్మికమగు ప్రత్యగాత్మప్రతీతి నంద గలుగుచున్నాము. దీనినే బ్రహ్మాస్వాదమని యందురు.

ఈ ఆస్వాదమున మహత్తర మగు పురుషార్థప్రతీతి యుండుటచే నిట స్థాయిత్వమే కల దనవలెను. కాని వ్యక్తివివేకవ్యాఖ్యానావసరమున రుయ్యకుడు శమముకూడ వ్యభిచారిభావము కాగల దని చెప్పినాడు. కోపాభిహతునకు కల్గు ప్రసాదోద్గమమున శమము సంచారిభావ మగు నని ఇతనివాదము. ఇది అశాస్త్రీయ మని వెనుక వివరించి యున్నాము.

అభినవగుప్తుడు తత్త్వజ్ఞానమును స్థాయిగాను, భావముగాను కూడ ప్రస్తుతించి యున్నాడు. శమ మొక్కటే స్థాయి యని ప్రపంచించినాము. రత్యాదులవంటి స్థాయిభావము కాకపోవుటచే శమమును భావమనవచ్చును. ఇట్టి శమముచే పరిపుష్టమైన శాంతమున ఆధ్యాత్మికము, లోకోత్తరమునగు ప్రతీతి కలదు. ఈ ప్రతీతిలో సుఖ మున్నదా? లేక దుఃఖ మున్నదా? అను ప్రశ్నలు కలుగవచ్చును. కాని రసచర్వణలో సుఖదుఃఖముల కున్న స్థానమును వెనుక చెప్పియున్నాము. ఇచట వైషయికసుఖము లేదనవచ్చును. ఈశమమున భావము లన్నియు సమన్వితము లగుచున్నవి. కాని శాంతప్రతీతిలో నీ భావముల కతీతము, ఈ భావములకంటె విశిష్టమునగు ప్రతీతి కలదని మరువరాదు. రాగద్వేష మధ్యస్థ వృత్తులు నశించగా

శమమున నిర్మలహృదయము కలుగును. ఇట్టి హృదయముతో కవి నట సామాజికులు తన్మయత్వము నందుచున్నారు.

ఇట్టిస్థితిని సామాజికునకు ప్రమేయ మగు కావ్యమొసగు చున్నది. అనుభూతిలో గల ప్రమేయము కవికిచ్చుచున్నది. ప్రమేయములు శాంతాభివ్యంజకము లని భావము. సంవిదధీనమై సంవిదభిన్నముగా భాసించునది ప్రమేయము. కావుననే ద్రుతచిత్తముయొక్క ప్రకాశమును శమ మని మధుసూదనసరస్వతి అనినాడు.

రసచర్వణను విశ్రాంతిలక్షణ మనినాము. ఈ విశ్రాంతి ప్రమోదసారము. శబ్దము, ఛందము, గీతము మొదలగువాని ద్వారా నీ ప్రమోదము కలుగు చున్నది. మనో హృదయములు నిర్మలములు కాగా, హృదయసంవాదవశమున భావనా వ్యాపారముద్వారా కావ్యానుశీలనమున తన్మయత్వము వచ్చుచున్నది. ఇట్టి స్థితిలో ప్రమేయము సత్యమా ? కాదా ? అని మొదలుగాగల ప్రశ్నలు బయలుదేరవు. పైగా దేశ కాల విశేషావేశానాలింగనత్వముతో నలరారు స్థితి సంభవించుటచే సామాజికుడు పాత్రలతో నభేదము ననుభవింప గలుగుచున్నాడు. ఇట్లే కవిగూడ పాత్రలతో తాదాత్మ్యము నందుచున్నాడు. సర్వత్ర స్వాత్మరూపమగు మతి కలదు. స్వాత్మరూపమున విశ్వమును దర్శింప గలుగుచున్నాడు. ఇది హృదయాభ్యంతర నిఖాత మగుటచే తిరోహిత మగుటలేదు,

విస్మృత మగుటలేదు. ఇట్టి అనుభూతి మన వ్యావహారిక జీవిత మునకూడ గొప్ప పరిణామములను తీసికొని రాగలిగి యున్నది ఇట్టి అనుభూతిని నిజ సంవిదానంద ప్రకాశమయ మని, విచిత్ర మని, శాంతమని, రసమని వ్యవహరించుచున్నాము.

శాంతమున అనుభూతమగు ఆత్మచైతన్యము కావ్య మున ఉపహితమగు చైతన్యముకంటె విలక్షణము కాదు; కావ్యానుశీలనమున భావనావశమున హృదయసంవాదము కల్గుచున్నది. హృదయసంవాదమున ప్రమేయములోనికి స్వాత్మానుప్రవేశ మున్నదను ప్రతీతి కల్గును. ఇట్లే ప్రమేయ మాత్మలో నంతర్లీన మైనట్లు కూడ భాసించును. కావున "సాధారణీభూతతయా సామాజిక మపి స్వాత్మసద్భావేన సమావేశయంతీ" అని అభినవగుప్తు డనినాడు. కావ్యాను భూతికి బహిర్భూత మగు చిత్తవృత్తిని అపేక్షించనటువంటి ప్రతీతి కన్పించుటచే నీ శాంతాస్వాదము లౌకికములగు ప్రత్య క్షానుమానాదులకంటె విలక్షణ మైనది. ఇది చిత్తవృత్త్యంతర జననాక్షమము. ఏవంవిధ మగు అనుభూతి నిర్విఘ్న స్వసం వేదనాత్మక విశ్రాంతి లక్షణము, రసనావ్యాపారగ్రాహ్యము నగుటచే రస మని పిలువబడు చున్నది. రస మనగా రస ప్రతీతి. రసప్రతీతి, రసచర్వణ, రసాస్వాదము అనునవి పర్యాయ పదములు. రస మనగా శాంతము. ఈ శాంతము కావ్యజగ మున గల పురుషార్థము లగు శృంగారాదులకంటె విలక్షణము. శృంగారాదులద్వారా శాంత మభివ్యక్త మగుచున్నది.

కావున శృంగారాది రసములు శాంతముయొక్క ప్రాతిభాసిక రూపములు.

8. రసప్రతీతి లోకోత్తరము, సత్యము, పారమార్థికము ముఖ్యము నగుటచే రసము లని వ్యవహరింపబడు శృంగారాదులకంటె భిన్నమైన శాంతమును మహారస మనవలెను. ఈ శాంతమునకు పారమార్థిక సత్యత్వ మున్నచో శృంగారాదులను అసత్యము లనవలెను. ఇట్లు స్ఫోటవాదము నంగీకరించితిమేని శృంగారాదుల కేవిధమైన అస్తిత్వమును ఆపాదించలేము. కాని శృంగార హాస్యాదులు కూడ ప్రతీతము లగుచున్న వని గమనించితిమేని ఈవాదము దూరనిరస్తమగును.

ప్రాభాకరమీమాంసకుల అన్వితాభిధానవాదము నంగీకరించి శృంగారాదులు శాంత మను సాధ్యమునకు ఉపాయాత్మకము లనవలెను. కాని, రసము ఆనుమానికము కాదని సాధనముల్లగు హేతువులద్వారా సిద్ధమగునది కాదని వెనుక చెప్పియున్నాము.

భాట్టమీమాంసకుల అభిహితాన్వయవాదము ననుసరించి శృంగారాదిరససముదాయమునగలఅనువృత్తప్రత్యయమే శాంతమని చెప్ప వీలున్నది. ఈ సముదాయమున శృంగారాదులు అంగములు. అంగములసముదాయముకంటె విలక్షణము, ప్రతి అంగమున నంతర్లీనము, ప్రతిఅంగముయొక్క పరమావధియు నగునది శాంతమని తాత్పర్యము. శాంతము శృంగా

రాదులలో అంతర్యామిగా నుండుటయేగాక, తదధ్యక్షత్వ లక్షణ లక్షితముకూడ నగును.

ఏవంవిధమగు శాంతము వివర్తోపాదానము. ఈ మహా రసమున ఆయా సన్నివేశములలో కన్పించు రూపాంతరము లను శృంగారాది రసము లనవలెను. లౌకికజగమున అనురా గాత్మకమై ప్రతీతము కాగా శాంతమును శృంగారమందుము. విరాగముగా, నిష్కామముగా కన్పించగా హాస్య మందుము. ఈ రెంటియందుగల సాపేక్షభావము నాశ్రయించుకొనివచ్చునది కరుణ. ఈ మూటియందును రౌద్ర, వీర, భయానక బీభత్స ములు అంతర్భూతము లగుచున్నవి. ఈఅంతర్భావమున కలుగు ద్వంద్వప్రతీతిలో అద్భుత ముత్పన్న మగుచున్నది. కావున రస మొక్కటే అని స్పష్టము. భరతుడుకూడ "న హి రసా దృతే కశ్చి దర్థః ప్రవర్తతే" అనుచో రసశబ్దమును ఏకవచన ముగా ప్రయోగించినాడు. ఇట్టి మహారసమును కవిగత సాధారణీభూత సంవిత్ అని చెప్పవలెను. ఈ శాంత మన్నిరస ములలోను అనువృత్తప్రత్యయముగా కన్పించుటచే శృంగా రాదులు శాంతపర్యవశితములై రసశబ్దము నందగలుచున్నవి. ఇంతేగాక శృంగారాదులలో శాంతమే ఉపహితమై యుండు టచే ప్రతిరసమున శాంతప్రాయ మగు ఆస్వాదమే కలుగు చున్నది. "తత్ర సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదః" అను అభినవగుప్తుని భావమును "భగ్నావరణాచిత్" అని జగన్నాథుడు ప్రపంచించి యున్నాడు. రసప్రతీతిలో ఉపాధు

లనబడు ఆవరణ పూర్తిగా భగ్న మగుచున్నది. కావున ఆ యా నిమిత్తముల ననుసరించి వివిధభావములు శాంతము నుండి వచ్చుచున్న వని, నిమిత్తాపాయమున మరల శాంతము ననే లీన మగుచున్న వని భరతుడనినాడు.

మహారసము, రసపర్యాయవాచ్యము నగు శాంతము సత్త్వప్రధానము. మనోవ్యాపార మగు సాత్త్వికవృత్తి ఇచట గలదు. రసధర్మములుగా కన్పించువానిలో మాధుర్య మిట విశిష్టముగా, ఉత్తమముగా కలదు.

—* ఇతి శమ్. *—



## శ్రీమహారాజ పోషకులు (శాశ్వతము రు 116 లు)

శ్రీ జగ్గు లింగయ్యగారు — బందరు

ఈదర వేంకట్రావు పంతులుగారు — ఏలూరు

దరిశి జానకిరామయ్యగారు — కొత్తపాలెం (దరిశి తా॥)

తూములూరు వెంకటశివరామయ్యగారు — నెల్లూరు

బొంగరాల వీరాస్వామనాయుడుగారు — కాకినాడ

యేజండ్ల శ్రీరాములుచౌదరిగారు — తెనాలి

జిల్లెళ్ల వేంకట భానోజీ తామర్పు జమీందారువారు — పేరూరు

## రాజపోషకులు (శాశ్వతము రు 58 లు)

శ్రీ దూపాటుల శివరాంగారు — హాత్రాస్

పాలుట్ల పాలంకయ్యగారు — గుంటూరు

దోనేపూడి వెంకట రమణమూర్తిగారు — కంభం

వేజెళ్ళ రాఘవయ్యచౌదరిగారు — జూపూడి

కలగర నాగభూషణచౌదరిగారు — ఏలూరు

యస్. కె. ప్రకాశరావుగారు — తెనాలి

స్థానం నరశింహారావుగారు

కె. నరశింహారావుగారు

పులిపాటి వెంకటేశ్వర్లుగారు

బొంతా సత్యనారాయణ సోదరులు.

జొన్నాదుల రామస్వామిగారు

చదలవాడ నాగేశ్వరరావుగారు

సంకా వీరభద్రయ్యగారు

శ్రీ అల్లాడ వి. శివస్వామిగారు
ప్రొప్రైటర్సు రూబీ యింక్సు
ప్రొప్రైటర్సు సారధి ప్రెస్
త్రిపురమల్లు శ్రీరాములుగారు
తాడేపల్లి హరినారాయణగారు
ముక్కామల రామచంద్రరావుగారు
కోటంరాజు ప్రసాదరావుగారు
యమ్. సుబ్బారాయుడుగారు
రూపాకుల సూర్యనారాయణగారు
రావినూతల నరసింహారావుగారు ఒంగోలు
తూములూరి శ్రీరామమూర్తిగారు పినపాడు
వల్లూరు వెంకటేశ్వర్లుగారు బాపట్ల
కె. మధుసూధనరావుగారు
మామిడిపూడి వెంకటసుబ్బయ్యగారు తిరుచునాపల్లి
యం. లింగమూర్తిగారు మదరాసు
సి. అలవందరయ్యగారు
ఆర్. సాంబశివరావుగారు
పిసిపాటి పిచ్చయ్యగారు ఇంకొల్లు
జరుగుల హరినారాయణగారు
ఊదర సూరయ్యగారు అయితానగరం
ఇనుకపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గార్లపాడు
పన్నాల లక్ష్మీనరసింహంగారు గుంటూరు
పన్నాల రామకృష్ణయ్యగారు
జొన్నలగడ్డ వెంకట సుబ్రహ్మణ్యంగారు
మేళ్ళచెర్వు వీరాంజనేయశాస్త్రిగారు

శ్రీ నిడమానూరి

కూచిభొట్ల సుబ్బారావుగారు బొంబాయి

గరిమెళ్ళ వేంకటరమణ కామేశ్వరరావుగారు గంగలకుర్రు

గరిమెళ్ళ శ్రీరామమూర్తిగారు

శ్రీ దువ్వూరి వేంకటపతి సోమయాజులు జమీందారు

గొర్తి పళ్లయ్యపంతులుగారు అగ్రహారం

మద్దింశెట్టి బ్రహ్మయ్యగారు అయినవిల్లి

విళ్ళ వెంకటస్వామిగారు

మద్దిరాల వెంకట కామేశ్వరరావుగారు శానపల్లిలంక

సమయమంతుల నాగేశ్వరరావుగారు ర్యాలి

అల్లవరపు అన్నప్పగారు ముక్తేశ్వరం

సలాది బాపయ్యగారు అనాతవరం

సరిపల్లె విశ్వనాథంగారు

కొప్పర్తి కృష్ణమూర్తిగారు ధవిళేశ్వరం

బులుసు పాపయ్యశాస్త్రిగారు రాజమండ్రి

బులుసు సత్యనారాయణగారు

చింతలూరి రామారావుగారు

ద్వారకదాస్ గిరిధరదాస్ గారు

టి. కనకరాజుగారు

వాజపేయాజుల వెంకటేశ్వర్లుగారు

జి. వరదరావుగారు

ఉండవల్లి శంకర కోటేశ్వరరావుగారు రాజమండ్రి

యం. సోమేశ్వరరావుగారు

జిల్లా సుబ్బారాయశ్రేష్ఠిగారు

మానాప్రగడ శ్రీరాములుగారు

శ్రీ కిడాంబి రాఘవరాజుగారు

బులుసు వెంకటేశ్వర్లుగారు — బెజవాడ

కాజ సూర్యనారాయణగారు — విజయవాడ

నావిలాల శ్రీనివాసరావుగారు

నందిపాటి రామయ్యగారు

మంథా సుబ్బారావుగారు — అమలాపురం

కోట పాలయ్యగారు

మంగళపల్లి లక్ష్మీనారాయణశాస్త్రిగారు

యం. వెంకటసుబ్బారావుగారు

కస్తూరి రామచంద్రమూర్తిగారు

కె. జగన్మోహనరావుగారు — నేలకొండపల్లి

జి. లోకనాథశర్మగారు

ఆదిరాజు అన్నారాజీరావుగారు — విజయనగరం

పసుమర్తి వీరభద్రస్వామిగారు

కె. యస్. యన్. పట్నాయిక్ గారు

జోస్యుల వెంకట సత్యనారాయణమూర్తిగారు — భట్నవిల్లి

గొర్తి వళ్ళయ్యశర్మగారు — నేదునూరు

నడింపల్లి సత్యనారాయణరాజుగారు — అంబాజీపేట

నూకల అమ్మన్నపంతులుగారు — నందంపూడి

వడ్లమాని కామేశ్వరరావుగారు

నూకల లక్ష్మీనారాయణగారు

గంటి సుబ్బారావుగారు

చల్లా సుబ్రహ్మణ్యంగారు — నరేంద్రపురం

ద్విభాష్యం వెంకటసూర్యనారాయగారు — చింతలూరు

బూదరాజు వెంకటసుబ్బారావుగారు — స్వర్ణ

| | |
|---|---|
| శ్రీ బాదరాజు వాసుదేవము | |
| జాగర్లమూడి కుప్పుసామి | |
| కొల్లూరు కోటయ్యచౌదరి | |
| దిరిశాల రమణారెడ్డిగారు | |
| బవరం కోటిరెడ్డిగారు | |
| కోట శ్రీనివాసరావుగారు | |
| పుతిగెళ్ళ వెంకటకృష్ణయ్యగారు | [illegible] |
| చతుర్వేదుల రామచంద్రయ్య | [illegible] |
| వసుమర్తి సత్యనారాయణగారు | కావలి |
| వద్దిరాజు రంగారావుగారు | హనుమకొండ |
| కె. మధుసూదనరావుగారు | |
| కురికాల వేణీరావుగారు | పరకాల |
| కురికాల వేంకటేశ్వరరావుగారు | |
| కురికాల వెంకటరామారావుగారు | |
| వద్దిరాజు వెంకటరంగారావుగారు | వరంగల్ |
| ఐ. వెంకట్రావుగారు | |
| యస్. సిద్ధాంతిగారు | |
| టి. యస్. మూర్తిగారు | |
| [illegible] గంగాధరరావుగారు | |
| డి. జనార్దనరావుగారు | |
| పొట్లపల్లి సత్యనారాయణరావుగారు | బ్రహ్మన్వాడి |
| ఉప్పల శ్రీరామమూర్తిగారు | అనకాపల్లి |
| వేదాంతం వెంకటసత్యనారాయణశర్మగారు | అత్తోట |
| కోలగొట్ల సూర్యనారాయణరావుశ్రేష్ఠిగారు | పార్వతీపురం |
| యన్. పి. విశ్వనాథశర్మగారు | సికింద్రాబాదు |